ఆర్యవిజ్ఞానం ౧.

# బ్రహ్మాండ సృష్టి విజ్ఞానం



గ్రంథకర్త:

**కోట వెంకటాచలం**

అద్వైతబోధిని, నిర్విచారజీవనం, మానవ సృష్టివిజ్ఞానం, కలిశక విజ్ఞానం,
అభాసక్రైస్తవం ఇత్యాది గ్రంథముల గ్రంథకర్త.

గాంధీనగరం - విజయవాడ

★

గ్రంథకర్తచే ప్రకటితము

విరోధినామ సంవత్సర జ్యేష్ఠమాసం కలి ౫౦౫౦

క్రీ॥ శ॥ 1949 జూన్ నెల

ఆర్యవిజ్ఞాన ప్రథమ కుసుమము

బ్రహ్మాండ సృష్టి విజ్ఞానం

(ప్రథమకూర్పు 1000 ప్రతులు)

*



## అంకితము

శ్రీ కృష్ణాతీర, విజయవాడ పట్టణ,

ఇంద్రకీలాద్రి స్థిత

శ్రీ దుర్గామల్లేశ్వరులకు-

కోట వెంకటాచలం

గ్రంథకర్త

సర్వధారినామ సంవత్సర చైత్ర బ 3 సోమవారం

అనూరాధా నక్షత్రం : : కలి ౫౦౪౯

క్రీ॥ శ॥ 26-1-1948

*

కవితిలక ప్రెస్
: విజయవాడ :

# ప్రకటన

1. మానవసృష్టి విజ్ఞానము, (ఇంగ్లీషు తర్జుమా) వెల 1-8-0

గ్రంథకర్త: కోట వెంకటాచలంగారు,

గాంధీనగరం — విజయవాడ.

ది 14 మే 1949 కృష్ణాపత్రిక యిట్లు వ్రాయుచున్నది.

విజయవాడ వాస్తవ్యులగు శ్రీ కోట వెంకటాచలంగారు అద్వైత బోధినీ, నిర్విచారజీవనము, ఆభాస క్రైస్తవము, బ్రహ్మాండ సృష్టి విజ్ఞానము, కలిశకవిజ్ఞానము, మానవసృష్టి విజ్ఞానమునెడి ఉత్తమ గ్రంథముల రచించి ఆంధ్రమహాజనులకు అపారమైన సేవచేసి యున్నారు.

పురుషప్రకృతి చిద్విలాసము, సృష్టిక్రమము విపులముగ శాస్త్ర ప్రమాణముగ వర్ణించుటయేగాక డార్విన్ సృష్టిక్రమము అసంపూర్తిగ నున్నదని ఋజువుచేయగలిగిరి.

ప్రపంచసృష్టి 195,58,85,048 సంవత్సరములక్రింద జరిగియున్నదని స్పష్టపరచిరి.

భారతీయులు ఆదిమనివాసులని, వేలకొలది వత్సరములక్రితమే నాగరికతకు, విజ్ఞానమునకు పేరుపొందిరని, ఆఫ్రికా, ఆస్ట్రేలియా, అమెరికాఖండములగూడ ఆక్రమించుకొని నివసించిరని ఇపుడిపుడే గుర్తింపబడుట సంతోషకరము.

ఆర్యవిజ్ఞానమునకు మూలాధారము వేదములనియు, వారి నివాసస్థానము సరస్వతీ నదీతీరమగు బ్రహ్మావర్తదేశమనియు, అయ్యదియే ఋషుల తపోభూమియనియు, సక్రమముగ గ్రంథస్థనిదర్శన పూర్వముగ కళ్ళకు కట్టినట్లు స్పష్టీకరింపగలిగిరి. బ్రహ్మర్షి దేశ, మధ్య

దేశ, ఆర్యావర్త, యజ్ఞీయదేశ, భారతవర్ష చిత్రపటము చక్కగ ముద్రించిరిచి మన మన్ననలకు పాత్రులైరి.

భారతవర్షమే వారి ప్రధాననివాసస్థానమని నిర్వివాదముగ స్పష్ట పరచిరి. వారి ఆధ్యాత్మికశక్తి అపూర్వమని, నాగరికత నిరుపమాన మని, ఆచారవ్యవహారములు సైన్సు ముఖ్యసూత్రములపై ఆధారపడి యున్నవని ఋజువుచేయబడినది.

భారతదేశచరిత్ర పునర్నిర్మాణయుగమున ఇట్టి ఉత్తమగ్రంథము లందలి విషయము లెక్కువగా ఆచరణయోగ్యములుగ నుండగలవని విశ్వసించుచున్నాము. భారతీయ సంస్కృతి ఆరాధకులు వారికి సహాయ పడ ప్రార్థించుచున్నాము

---

2. <u>ఆభాస క్రైస్తవం</u> వెల రు 1—8—0

రచన:- కోట వెంకటచలంగారు,

గాంధీనగరం — విజయవాడ.

(1) ది 29 అక్టోబరు 1949 తెలుగు స్వతంత్ర-మద్రాసు - మాస పత్రిక యిట్లు వ్రాయుచున్నది.

"ఆభాస క్రైస్తవము" జిజ్ఞాస రేకెత్తించే చురుకైన విమర్శన పుస్తకం. క్రైస్తవ మతవిషయాలన్నీ 'లేని వానిని ఉన్నట్లుగా ఊహిం చిన'వని దాని తాత్పర్యం. పరస్పర విరుద్ధాలైన పాశ్చాత్య సిద్ధాంతా భాసాలు మనలను అసాంప్రదాయులనుగా చేస్తున్నాయి; అటువంటి సిద్ధాంతాలను బాగా విమర్శించి, సత్యాసత్యాలు నిరూపించి ప్రజలలో ప్రచారం చేయడం దేశానికి క్షేమం. అని రచయిత అభిప్రాయం. బైబిలులోని సృష్టికాలం వగైరాలు పందొమ్మిదవ శతాబ్దములో గావించిన నిరాధారమైన ఊహలు క్రీస్తుపుట్టుక, జీవితం, బోధలు, సిలువ నెక్కుట, తిరిగి లేచుట, మొదలైన సంగతులు అభూతకల్పనలు.

క్రీస్తు పుట్టినాడన్నసంగతి ప్రచారానికివచ్చిన మొదటిశతాబ్దంలోనే అది పట్టి అబద్ధమనీ, మిషనరీల కల్పన అనీ వ్యతిరేక ప్రచారం చేసే గ్రంథాలు వెలువడ్డాయి. శ్రీకృష్ణుని కథ ఈజిప్టు, అక్కడినుండి పాలస్తీనాకు వ్యాపించింది. అక్కడి భాషలో కృష్ణునిపేరు 'క్రిష్టాసు'గా మారింది. కృష్ణుని మతం అనుసరించినవారు 'క్రిష్టియను'లయారు. క్రీస్తుకాలానికిపూర్వం రెండువేల సంవత్సరాలకి పైనుంచి ఈజిప్టులో 'క్రిష్టియను' మతమనేదివుంది. పుస్తకం యీ విషయాలన్నిటినీ - అయా గ్రంథాలనుంచి సేకరించిన ప్రమాణవాక్యాలతో సహేతుకంగా వివరిస్తోంది; ఇదే ఇంగ్లీషులో వెలువడిఉంటే, ఇంకాయెక్కువ ప్రయోజనము, ప్రచారము ఉండేదేమో అని తోస్తుంది."

(2) ది 8—11—48 విజయవాడలోని విజయవాణిపత్రిక యిట్లు వ్రాసియున్నది.

"ఇది ఒక అపూర్వ ప్రజ్ఞా సమన్వితపరిశోధక గ్రంథం. భారత దేశంలో మనసంస్కృతివిజ్ఞానాలకు భంగంకలిగిస్తూవున్న యీరోజుల్లో ప్రజల కన్నులను తెరుస్తున్నది ఈగ్రంథం. ఇది ఇంగ్లీషులోనికి తర్జుమా చేసి క్రిష్టియన్ పాదరీలందరికి పంచిపెట్టతగిన ఉద్గ్రంథం."

(3) ది 25—9—48 కృష్ణాపత్రిక యిట్లు వ్రాసియున్నది.

"క్రైస్తవమతస్థులు దీనిని సాకల్యంగా పరిశీలించి సత్యవిచారణ చేసుకోవడంమాత్రం వారికే శ్రేయస్కరమనుటకు సందేహం లేదు. హింసావిధానంచేతనూ, దానోపాయంచేతనూ, మతవ్యాప్తి సాధించుకొన్న పూర్వవృత్తాంతమును తలుచుకొని యిప్పటికైనా సిగ్గుపడి క్రైస్తవమతాచార్యులు సవోల్లేఖనపూర్వకంగా క్రైస్తవ మతమును ఒక క్రొత్త దారి త్రొక్కిస్తే, వారికీ లోకానికీగూడా క్షేమకరం అవుతుంది. ఈ గ్రథం వారిని అట్టిఉద్యమానికి ప్రేరేపిస్తుందని ఆశిస్తున్నాం."

(4) ది 4—12—48 ఆంధ్రవాణి విజయవాడ వారపత్రిక యిట్లు వ్రాసియున్నది.

"క్రైస్తవ మతము కల్పితమని రుజువుచేయు గ్రంథములు, ఆంగ్లమునందును, హిందీయందును, పెక్కులుగలవు. కాని వాని అన్నిటికంటె యీ ఆంధ్రగ్రంథం యెక్కువ ప్రామాణికము గాగలదని చెప్పకతప్పదు...ప్రతి మతస్థుడూ యీ పుస్తకమును తప్పక చదువవలెను. శ్రీ వెంకటాచలంగారు చేసిన చారిత్రక పరిశోధనకు ఆంధ్రులెల్లరు ఋణపడియున్నారు."

ఓమ్

# ఆర్య విజ్ఞానము

[ 8 భాగములు ]

## పీఠిక

మానవజాతి వృద్ధిపొందుటకు పూర్వచరిత్ర లావశ్యకములు. అట్టి చరిత్ర లిపుడొక్క భారతదేశమునందుగాక మరెచ్చటను లభింపనేరవు. భారత వర్షమతి పురాతనమైనది. అనాదినుండియు ప్రతి సృష్టియందును జీవుల ప్రథమ సృష్టి కేర్పడిన స్థానము సృష్టి ప్రారంభమున మానవ జాతిని సృజించుటకుగాను దేవతలచే వరింపబడిన ప్రదేశము. బ్రహ్మపంపున స్వర్గలోకవాసియు మానవజాతి కాదిపితయు, బ్రహ్మమానస పుత్రుడునైన స్వాయంభువ ప్రజాపతి కర్మాధీనులై ప్రకృతియందు లీనమైయుండి సృష్టికి రాగోరుచుండిన జీవులకు భౌతిక శరీరములనిచ్చి ప్రజావృద్ధి నొనర్పనుద్యమించెను. అప్పటికి మానవజాతి నివసించుటకు తగిన భూభాగములు లేకుండెను. భూగోళము జరిగిన కల్పాంత ప్రళయంబున నీటియందుమునిగియుండెను. స్వాయంభువుడు తన యుద్యమమునకు భూగోళము జలమునుండి యుద్ధరింపబడుటావశ్యకమైనందున విష్ణుదేవును పాసింపగా ఈశ్వరానుగ్రహంబుచే భూగోళము నీటిపైకి రాబడినటుల వైదికవాఙ్మయము వేనోళ్ళ జాటుచున్నది. (బ్రహ్మాండ పురాణం ప్రక్రియాపాదం ప్రథమాశ్వాసం చూడుడు). అటుపిమ్మట స్వాయంభువుడు స్వర్గలోకమునుండి తన దారాపుత్రాదులతోడను, అత్రి, వసిష్ఠ, కశ్యపాదులైన తొమ్మండుగురు ప్రజాపతులతోడను భౌతిక శరీరములను బొంది భూమి కవతరించి ప్రప్రథమమున సరస్వతీ, దృషద్వతీ నదులమధ్యస్థమైన "బ్రహ్మావర్తము"నెడి పేరుగల ప్రదేశమున నివసించెను. "బ్రహ్మావర్తమును" గురించి మానవసృష్టి విజ్ఞానమును రెండవ భాగమున "ఆర్యావర్తము

అను ప్రకరణమున వివరించబడినది ఆయననివసించిన ప్రదేశము "మను క్షేత్రమని" నేటికిని వ్యవహరింపబడుచు పుణ్యపురుషులైన యాత్రికు లచే దర్శింపబడుచున్నది. అట్లు స్వర్గమునుండి రాబడిన వారలు పద హారు మంది. వీరు "ఆర్యులు" "భారతులు" అను పేర్లతో దేవ తలచే బిలువబడిరి. ఆర్యులనగా ఈశ్వర పుత్రులని యర్థము. భరతు డను పేరుగల స్వాయంభువ మనువుసంతానముగనుక భారతులనబడిరి. వారు నివసించిన ప్రదేశమునకు భారతవర్షమని పేరు కలిగినది. వీరి వలన యుద్భవించిన సంతానములోడనే భూగోళమంతయు నిండినది. స్వాయంభువుని జననము లగాయతు యిప్పటికి 195, 58, 85, 044 సంవత్సరములు. సృష్టితోరాబడిన వేదములలో కొంత భాగము కాలగర్భమున లీనమైపోయినదిపోగా కొద్ది ముఖ్యవిషయములతో గూడిన చరిత్రలు స్మృతులు, పురాణములు, ఇతిహాసములను పేరున మనకు లభించియున్నది. వానియందార్యులను గురించిన స్పష్టమైన వాక్యములుగలవు. చిరకాలమునుండియు వాటిని పఠించి ఆర్యుల జననమును, వ్యాప్తిని నాగరికతను మన పూర్వులు తెలిసికొని యానం దించుచు వాని యాధారమున తమ ప్రాచీన సాంప్రదాయములను కాపాడుకొనుచు వచ్చుచుండిరి. కాని కొన్ని కారణాంతరములవలన ఆర్యావర్తమునుండి వెడలగొట్టబడియు, తాముగా లేచిపోయియు; యితర ప్రదేశముల నాక్రమించిన మన ఆర్యసోదరులు, వేదశాస్త్రా ధ్యయనాదులు లేని కారణమున, క్రమ క్రమముగా తమ ఆర్య సాంప్రదాయములు మరువబడి భ్రష్టమగుటచేత అవైదిక, అశాస్త్రీయ ములగు వివిధములైన స్వేచ్ఛాచారముల నవలంబించినందున ఆర్యుల కంటె వేరైన జాతులుగా నెంచుకొని వివిధ భూముల నాక్రమింపుచూ యొకరితో నొకరు విరోధించి యుద్ధాదిక్రియల కుపక్రమించి యొకరి నొకరు చంపుకొనుచు యొకరికొకరు శత్రువులుగా పరిగణించబడి వివిధములైన అనేక జాతులుగా నేర్పడిరి. దేశకాల భేదములచే అనేక భాషా భేదములుగలవారలైరి. శీతోష్ణాది భేదములచే రూప, వర్ణ భేదములుగలవారలైరి. ఆహార విహార భేదములవలనను

సాంగత్య దోషములచేతను, అనాగరిక నాగరిక భేదములనొంది తామస, రాజసాది వృత్తులు గలవారలై వివిధ స్వభావములను బొంది యనేక విధములైన వేషభాషలు గలవారైరి. వీరెంత మారినను ఆర్య సాంప్రదాయములు వీరియందంతర్గతమై నేటికిని నిలిచియుండి నట్లు స్పష్టముగా గానవచ్చును.

ఆరవమనువైన చాక్షుషుని కాలము తీరినవెంటనే రాబడిన జలప్రళయమువలన భూమిమీాద సమస్తప్రాణులు నశించినవి. భూమి జలముచే నిండిపోయినది. అట్టి ప్రళయాంతమున "వైవస్వతమనువు" కాలము ప్రాప్తించి తిరిగి సర్వజీవ వృద్ధి చేయబడినది. వైవస్వత మన్వంతరము ప్రారంభమై యిప్పటికి పన్నెండు కోట్ల అయిదు లక్షల ముప్పదిమూడు వేల నలుబదినాలుగు సంవత్సరము లైనది. అప్పటి నుండియు తిరిగి మానవచరిత్ర ప్రారంభమైనది. పన్నెండుకోట్ల సం॥ రముల పైచిలుకు కాలములో భారతీయుల లెక్కప్రకారము యిరువ దేడు మహాయుగములు గడిచి యిరువదెనిమిదవ మహాయుగములో కృత, త్రేత, ద్వాపరయుగములు గడువగా కలియుగము ప్రారంభమై 5044 సం॥రము లిప్పటికి గడిచినవి. మన్వంతర ప్రళయము గాక ప్రతి మహా యుగాంతమందును చిన్న ప్రళయములు తటస్థింపుచు భూమిమీాద జీవకోటి హెచ్చుగా నశించుచుండును. ఒక్కొక్క మహా యుగములోని యొక్కొక యుగాంతమందు భూమిమీాదచ్చటచ్చట కొద్దికొద్ది ప్రళయములు తటస్థమగుచు జీవకోటి నష్టమగుచుండును. ఇది స్వభావ నియతి. జలస్థల భాగములు తారుమారగుచుండును. ఉన్నత పర్వతములు క్రుంగుటయు, చిన్న గుట్టలుపైకి వచ్చుటయు జరుగుచుండును. అగ్నిచేతను, గాలిచేతను, జలముచేతను, మంచు చేతను, యిసుకచేతను జీవకోటి నశింపుచుండును. ఇట్టి స్థితిలో యిరువదేడవ మహాయుగాంతమందు హెచ్చు భాగము మన భూమి మీాద ప్రాణికోటి నశించినది. తిరిగి యిరువదెనిమిదవ మహాయుగ ప్రారంభమునుండియు జీవకోటి వృద్ధినొంది స్వల్పములగు యుగాంత ప్రళయములు దాటి కలియుగ ప్రారంభమునకు 38,88000 సం॥రములు

వృద్ధిపొందినది. ద్వాపరాంతమందు జరిగిన మహాభారత యుద్ధములో మానవకోటి హెచ్చు భాగము నశించినది. (ఆ యుద్ధమున చీనా, గ్రీసు, రోము, ఈజిప్టు, అరేబియా మొదలైన దేశముల రాజులు సైన్యములతో పాల్గొనిరి) ఆ పిమ్మట ప్రజలు నిరుత్సాహులై యనేక తెగలు భారతవర్షమునుండి యితరదేశములకు వారి నాగరికతతో వెడలిపోయిరి. వారివలన ఈజిప్టు, గ్రీసు. రోము, మొదలుగాగల దేశములాక్రమింపబడి తిరిగి ఆర్యనాగరికతా వ్యాప్తి నొనర్పబడినది. ఇట్టి యతిప్రాచీనమైన భారతవర్ష చరిత్రను వ్రాయుట, కాపాడుట సామాన్యవిషయము కాదు. వ్రాయబడిన చరిత్రలు కొంతకాల ముందునుగాని హెచ్చుకాలము మనలేవు. సుమారు రెండు వేల సం॥రముల క్రిందట గ్రీకు చరిత్రకారులచే వ్రాయబడిన చరిత్రలలో చాలాభాగము నష్టమైన సంగతి హూణవిద్యాధికు లెరుంగనిది కాదు. క్రీస్తుశకము నాల్గవ శతాబ్దములో మతపిచ్చిగల 'కాన్స్టాంటైను' యను క్రైస్తవరాజుచే యనేక చరిత్రాంశములు గల గ్రంథములు నశింపు చేయబడినట్లు యిటీవల చరిత్రలు చెప్పుచున్నవి. హూణ, గూర్జరాది యనాగరిక జాతులచేతను మతావేశపరులగు మహమ్మదీయులచేతను క్రీ॥శ ప్రారంభ శతాబ్దము లగాయతు పదునేడవ శతాబ్దము వరకు ప్రాక్పశ్చిమ దేశములయందు నాశన మొనర్పబడిన వాఙ్మయమునకు లెక్కలేదను సంగతి లోకులందరెరింగినదే. ఇట్టి స్థితిలో యుగాంత ప్రళయములు, మహాయుగాంత ప్రళయములు, మను ప్రళయములలో ప్రాచీన భారతవర్ష చరిత్రలు నష్టపడుటలో నాశ్చర్యము లేదు. అందువలన ఇప్పుడు పురాణములు చరిత్రలను పేరున వ్రాయుచుండిన రాజులపేర్లు, వారి పరిపాలనా కాలములు, వారివారి రాజ్య కాలములలో జరిగిన విశేష విషయములు మొదలైన యల్పవిషయములను వ్రాసియుంచుట భారతీయు లెరుగరని తలంచుట గొప్ప పొరబాటు. కోట్లకొలదిగా జరిగియుండిన కాలములోని రాజచరిత్రములు వ్రాయుటయు, వానిని కాపాడుటయు మానవ సాధ్యమైన పని కాదు.

ఇప్పటికి కలియుగము లగాయతు జరిగిన 5044 సం॥రముల కాలములో రాజ్యములు చేసిన రాజుల చరిత్రను వివిరముగా మన

పురాణములలో "భవిష్యద్రాజేతిహాసము" అను పేరున వ్రాయబడి యున్నది. కాశ్మీర, నేపాళ దేశ చరిత్రములలో సుమారు పది వేల సం॥రములవరకు రాజుల పేర్లు లభ్యమగుచున్నవి. స్వల్ప విషయములతో గూడిన చరిత్రలు నశించుట కవకాశము గలదని యెఱింగిన మన పూర్వులచే పురాణేతిహాసముల రూపమున సృష్ట్యాది నుండియు పరిపాలించిన ప్రముఖ రాజవంశముల జాబితా క్లుప్తముగా నీయబడినది. ఇరువది యైదవ మహాయుగమందలి త్రేతాయుగాంత సంధియందు జరిగిన శ్రీరామ చరిత్ర శ్రీమద్రామాయణమను పేరున ఇతిహాస రూపమున వ్రాయబడినది. గత ద్వాపరాంతమున జరిగిన కురు పాండవ యుద్ధము భారతేతిహాస రూపమున వ్రాయబడినది. వానియందు సృష్ట్యాదినుండియు రాబడిన రాజవంశములు వర్ణింపబడినవి. కేవల రాజవంశములే గాక నాయా కాలములలోని ప్రజల స్వభావములు, ఆచారములు, యోగ్యతలు, నాగరికతలు, విద్యాపాటవములు, ధర్మములు, ఆధ్యాత్మిక విషయములు, నాయా కాలములయందు ప్రజలనుసరించుచుండిన యైహికాముష్మిక సుఖసాధనంబునకు సంబంధించిన విషయములు మొదలైన వివరములతో గూడిన విషయము లెన్నియో కుప్పతిప్పలుగ ఇతిహాస పురాణములం దామూలాగ్రముగా వర్ణింపబడినవి. ఎన్ని ప్రళయములు తటస్థించినను, యెట్టి ప్రజావిప్లవములు చెలరేగినను, అనాగరికులగు మోటుజాతివారలు ప్రబలి ప్రపంచము నంతను భస్మీపటల మొనర్చినను చెడకుండునట్లు యితిహాస పురాణములుగూడను కంఠస్థము చేయుట కనుకూలించులాగున వ్రాయబడి చిరజీవులై ప్రళయములయందుగూడ నశింపకయుండిన మహర్షుల వలన నేటివరకును కాపాడబడి మనకందులాగున చేయబడినవి.

మహర్షు లెల్లప్పుడును చిరంజీవులై వేదశాస్త్రాది విద్యాప్రచారకులై యుండిరను విషయమునుగురించి ఆంధ్ర బ్రహ్మాండ పురాణం అనుషంగపాదము, తృతీయాశ్వాసమునసిట్లు చెప్పబడినది.

క॥ ఎనుబది యెనిమిదివేలని, మునిసంఖ్యా చెలంగు వారి మిఖములవలనన్.
ఘన సంహితలన్నియుఁ బ్రబలెను భూస్థలినవియె మహితలీలం
దనరున్. (638)

తే॥ దక్షిణంబగు పథముఁ దగవసించి
మఱి శ్మశాననివాసులై మెఱయువారె
ప్రతి యుగంబున సంహితాహ్వయములను గ్ర
మంబున నొనర్చుచుందురు మనుజులకయి॥ (639)

మ॥ అవియే శాఖలు వారలేమునులు వే, దాధ్యాపకుల్ వారెవా
రె వచింపందగు వారలద్దియె ధరి, త్రింబోల్చు సద్గ్రంథమై
సువిచారక్షమమై మహర్షినుతమై, శోభాస్పదంబై మహో
త్సవ సంధాయకమై సమస్త మనువుల్, శాసించు రాజ్యంబునన్
(640)

వ॥ పూర్వంబుతోఁ బశ్చిమంబును, వర్తమానంబుతో నుభయంబును గ్రహింపఁదగు. ఇట్లు వేదంబులును, మునులును, మనువులును, మంత్రంబులతోడ నూర్ధ్వంబునొందుచు మరలి వచ్చుచునుందురు. జనలోకంబున సురలు దశ కల్పంబులు గడిపి పర్యాయకాలంబు రాఁగ మరలఁ బుట్టుచుందురు. (641)

క॥ మనువు గతింపఁగ వేఱొక,మనువధికారంబునొంది, మనుజాదుల వే
దనుతవిధిం బాలించును,గననించుక యైన లేదు కాలవిషమతల్ (648)

తే॥ బూర్వమన్వంత మందును బోకనిలిచి
యున్న ధార్మికశిష్టులై యొప్పుచున్న
సప్తమౌనులు మనువును సంతతికయి
తపమొనర్తురు దాన సంతతి జనించు (649)

క॥ పరమాశ్చర్యమ్మును దుష్కరము నవ్వారి తపము కలిమిజనించున్
గరమరుదుగఁ బూర్వమువలె ధరణిన్ మనుజోత్కరంబు
దైవంబలరన్ (650)

వ॥ పూర్వమన్వంతరంబులకుఁ బ్రతి సంధాన లక్షణంబిదియ. ఒక
మన్వంతరంబు గతింప వేఱొక మన్వంతరం బారంభంబగు
వ్యవహార సాధనంబే కవిధంబ (660)

క॥ మను, దివిజ, పితృసమూహము, మునిసప్తక మివ్వి నాల్గు
మూలంబులగున్
మనువుల యంతరముల కెల్లను వీరివలనఁ బ్రజలు లభియింతురిలన్
(671)

చ॥ సురవరులెల్ల మానుసకు సూనులు నిర్జరవారసూనులై
పరఁగెడు వారు సర్వ పితృవర్యులు దేవతనూజులై ఋషుల్
ధరణిఁ బ్రసిద్ధులౌదురిది ధర్మము శాస్త్రవినిశ్చితంబు నై
కరము ప్రసిద్ధమై తనరుఁగా మునిశీతకరా! మహామతీ (672)

చ॥ మనువు మహీవరోదుజనిమండలమున్; ఋషిసప్తకంబు పా
వనధరణీ సురావళిని బర్వఁగఁ జేసిరి ముఖ్యలక్షణాం
బనఘ! యిదేయగుం బ్రకృతిమాను సంతరమందు విస్తరిం
చినఫలమేమటంచు లఘుసిద్ధిగఁ జెప్పితి సృష్టియంతయున్ (673)

గతించిన విషయములు విస్తరించి చెప్పుటవలన ఫలములేదని క్లుప్తముగా జెప్పబడినటుల పురాణమే స్పష్టము చేయుచున్నది.

పైవిషయమును గురించి యాజ్ఞవల్క్య స్మృతియందు.

మూ॥ "తత్రాష్టాశీతిసహస్రాముసయో గృహమేధినః పునరా
వర్తినోబీజ భూతాధర్మ ప్రవర్తకాః (యాజ్ఞ॥ స్మృతి. ౩.౧౮౬)

తా॥ అచ్చట (స్వర్గమందు) యెనుబది యెనిమిదివేల సంఖ్యగల గృహస్థులైన మునులు పునరావృత్తి ధర్మము గలవారై ధర్మమును లోకములో తిరిగి ప్రచారము చేయు నిమిత్తము బీజభూతులై (విత్తసమువంటివారై) వుంటున్నారు.

మూ॥ "సప్తర్షి నాగవీథ్యంత ర్దేవలోకం సమాశ్రితాః తావం త ఏవమున యస్సర్వారంభవివర్జితాః తపసాబ్రహ్మచర్యేణ సంగ త్యాగేన మేధయా తత్రగత్వావతిష్ఠంతే యావదాభూత సంప్లవం॥" (యా. ౩-౧౮౬)

తా॥ సప్తర్షులకు గజవీధికి మధ్యమందుండే పై చెప్పబడిన (యెనుబది యెనిమిదివేల) సంఖ్యగల మునులు సర్వారంభము వలన విడువబడినవారై తపస్సుచేతను, బ్రహ్మచర్యముచేతను, సంగత్యాగము చేతను, జ్ఞాననిష్ఠచేతను, (కూడుకొనినవారై) దేవలోకమును ఆశ్ర యించి ప్రళయమువరకు వుంటూ ధర్మమును ప్రచారము చేయుచుందురు.

మూ॥ "యతోవేదాః పురాణాని విద్యోపనిషద స్తథా శ్లోకా స్సూత్రాణి భాష్యాణి యచ్చకించనవాఙ్మయం" (యాస్మృ. ౩-౧౮౭)

తా॥ ఏమునిసమూహామువలన వేదములు, పురాణములు, విద్యలు, ఉపనిషత్తులు, ఇతిహాసములు, సూత్రములు, భాష్యములు, ఆయుర్వేదాదులైన శాస్త్రములు మొదలుగాగల వాఙ్మయమేదిగలదో దానికంతయు వారు (మునులు) ప్రవర్తకులై యుంటున్నారు.

శ్లో॥ "తిష్ఠంతి చేహా యేసిద్ధా అదృష్టా విచరంతిచ" (మత్స్య పురాణం)

తా॥ జనులచే చూడబడనివారై సిద్ధులు లోకమంతటను సంచ రించుచున్నారు అని చెప్పబడినది.

భారతీయుల వేదశాస్త్రములు భూలోకములో ప్రజలు మఱచి నంత మాత్రమున నశించునవి కావు. వానిని ధరించియుండి లోక ములో లుప్తములైనపుడెల్లను వానిని తిరిగి లోకములో ప్రచారము చేయుటకు యెనుబది యెనిమిదివేల మంది మహామునులు జీవన్ముక్తు లయ్యును, లోకానుగ్రహార్థము వారివారి కుటుంబములతో సహా స్వర్గలోకమందుంటున్నారు. ప్రతి కలియుగాంతముునను వేదశాస్త్ర విముఖులగుచు ప్రజలు వేదధర్మముల నొదలుటయేగాక వేదశాస్త్ర ప్రచారకులగు వారి నాదరింపక యుపేక్షించినందున వాని ప్రచా

రము ప్రజలలో లేనందున ప్రజలు దురాశ, అసూయ, ద్వేషము, క్రోధమాత్సర్యములతో గూడినవారై యన్యోన్య వైరంబున యొకరొకరికి ఘాతుకులై ప్రవర్తించుచు కలియుగాంతమునకు ప్రజలలో హెచ్చుభాగము నశించెదరు. పిమ్మట మునులు తిరిగి భూలోకమందవతరించి ప్రజావృద్ధిచేసి వేదశాస్త్రాదులను ప్రవర్తింప చేయుచుందురు. అప్పుడు కృతయుగమై తోచును. ఇది స్వాభావిక నియతి ప్రతి కృత యుగమున ధర్మమునకు వృద్ధియు ప్రతి కలియుగమున హానియు కలుగుచుండునని తెలియవలెను.

అనంతమై, అతిపురాతనమై, నైహికాముష్మికాది సర్వవిషయ సంశోభితమై యలరారెడి వైదిక వాఙ్మయమంతయు, రాజచరిత్రలనదగిన యొక యల్పాంశమును వ్రాయుటకుపకరింప జాలదని యపోహపడి దానిని త్రోసివేయుచుండుటవలన మన విమర్శకుల సంకుచిత స్వభావము వెల్లడియగుచున్నది.

ఈకాలమునకు మానవచరిత్రను వ్రాయుసంకల్పముతో మన వేదశాస్త్ర పురాణేతిహాసాది వాఙ్మయమును మొట్టమొదట పరిశోధింప మొదలిడినవారు పాశ్చాత్యవిద్వాంసులు. మన గ్రంథసముదాయమును పఠింప మొదలిడు నాటికి వారిమనములందు రూఢములై యుండిన భావములకనుగుణముగా మన గ్రంథములు లేనవ్వియు. భారతీయ వాఙ్మయమున నిప్పటి సృష్టిప్రారంభకాలము నూటతొంబదిమైదు కోట్ల సం॥రములను మించియుండెను. వారు దానిని జీర్ణింప జేసుకొనలేక పోయిరి. వారి మతగ్రంథమైన బైబిలు ప్రకారము వారు తెలిసికొని రూఢిగా నమ్మియుండిన సృష్టికాలము ఆరువేలసంవత్సరములకు తక్కువగా నుండెను. రెంటికిని పోలిక యెక్కడను గనుపట్టకుండెను. తమ మతగ్రంథములోని సృష్టికాలము తప్పని చెప్పుటకు వారి కిష్టముగాకుండెను. వారి సృష్టికాలమును భారతవర్షములో వైవస్వత మన్వంతరమున నిరువదియెనిమిదవ మహాయుగములోని ద్వాపరాంత సంధియందున్న చంద్రవంశములోని కురువంశ సంభూతుడును, పాండురాజ ధృతరాష్ట్రులకు పితామహు

డును, భీష్మునికి తండ్రియునైన శంతనమహారాజు రాజ్యము చేయు చుండినట్లు పురాణములలో జెప్పబడియుండుటయేగాక వారి ప్రాచీన పరంపరను కృతయుగాదినుండియే గాక వైవస్వత మన్వంతర ప్రారంభమునుండియు జెప్పబడియుండుటయు, అంతకు పూర్వము సృష్ట్యాది నుండియు రాబడిన రాజవంశ పరంపరలను జెప్పబడియుండుట జూచి వానిని మనస్సున పట్టించుకొనుట కసమర్థులైనందున మతి చెడినవారై వాని నెట్లయినను ద్రోసివేయు మార్గ మన్వేషింప మొదలిడి వాని నన్నిటి నతిశయోక్తు లనిరి. అనాగరికుల యంధవిశ్వాస మనిరి. కవి కల్పితములనిరి. ప్రక్షిప్తము లనిరి. వ్యాసవిరచితములు కావనిరి. నిన్న మొన్న వ్రాయబడినవనిరి వాటి ప్రమాణమును నిరసించుచు ద్రోసి వేయ జూచిరి. సుమారు ఆరువేల సంవత్సరముల క్రిందట జన్మించి మూడువేల సంవత్సరముల క్రిందట కింకను బాల్యావస్థలోనే యుండి సుమారైదువందల సం॥రముల క్రిందట కళ్ళుదెరచి ప్రపంచమును జూడజాలి తామే పండితుల మనుకొనుచు యితరులంద రనాగరికులని చెప్పుచుండిన యీ జాతివారల బుద్ధికందనిదంతయు, యసంగత మనియు, కల్పనాకథలనియు వానిని ద్రోసిపుచ్చ జూచిరి. కాని వారిచే సంకల్పింపబడిన మానవచరిత్రను వ్రాయుటకు తమ వాఙ్మయ మందేమియు దొరకదాయె. అందువలన గత్యంతరము లేక వారు మనగ్రంథములనే దీసికొని భారతీయుల ప్రాచీనతను, ఔన్నత్యములను దెలుపు భాగములుప్రమాణములక్రింద జమకట్టి వానిని వదలి అందలి యల్పాంశములను మాత్రము తీసికొని తమ విమర్శనలకు వానిని ప్రాతిపదికగాజేసి తమ కించిజ్జ్ఞతతో తామూహించినటుల విషయము లను సమకూర్చి దేశచరిత్రల నల్లిరి 195 కోట్ల చరిత్రనంతను తమ బైబిలులోని సృష్టి ప్రారంభకాలమైన ఆరువేల సం॥రములలో నిముడ్చి యన్యోన్య విరోధములతో గూడిన చరిత్రాభాసముల నల్లియుండిరి. అనాదిగా నుండిన వేదములు గొడ్లనుకాచుకొనెడి యనాగరికులగు పశుల కాపరులచే యప్పుడప్పుడు గానము చేయబడినవనిరి. పురాణములు వేయి సం॥రముల క్రిందట వ్రాయబడినవనిరి. మహాభారతయుద్ధము క్రీ॥ పూ 1400 సం॥రమున జరిగినదనిరి. ఆ పిమ్మట

రామాయణకథ జరిగియుండవచ్చునని యుంచనా. వేసిరి. ఇవన్నియు వీరు స్వయముగా దెలిసినవారివలెనే కాలములను నిర్ణయించుచు వ్రాసియుండిరి.

హెచ్. హెచ్. విల్సను మహాశయుడు పురాణములను, వాని రచనాకాలమును గురించి వ్రాసిన విషయములను జూడుడు—

(Vide His Book "Puranas") (June 1897)

1. బ్రహ్మ పురాణము : "It could not have been compiled earlier than the thirteenth or fourteenth century." (Page 28)

తా॥ బ్రహ్మపురాణము క్రీ॥ శ॥ పదమూడు, పదునాలుగు శతాబ్దములకు ముందుకూర్చబడియుండినట్లు చెప్పుటకు వీలు లేదు.

2. పద్మపురాణము : "No portion of the Padma Purana is, probably, older than the twelfth century and the last parts may be as recent as the fifteenth or sixteenth." (Pages 34-35)

తా॥ "పద్మపురాణములోని యే భాగము పన్నెండవశతాబ్దముకు పూర్వపుదని జెప్ప వీలుపడదు; చివరభాగములు నూతనముగా 15 లేక 16 వ శతాబ్దములలో వ్రాయబడియుండవచ్చును.

3. విష్ణుపురాణము :—ఈపురాణమును గురించి వ్రాయుటలో విల్సనుపండితుడు పురాణముల ప్రాచీనతను కొంతమాత్ర మంగీకరించి యున్నాడు. అవి వ్రాయబడిన కాలము నవీనమైనను అందుల దెలుప బడిన విషయములు ప్రాచీనములైనవే నని యంగీకరించుచున్నాడు.

"It is therefore, as idle as it is irrational, to dispute the antiquity or authenticity of the greater portion of the contents of the Puranas, in the face of abundant positive and circumastantial evidence of the prevalence of the doctrines which they teach, the currency of the legends which they narrate, and the integrity of the institutions which they describe at least three centuries before the Christian era. But the origin and development of their doctrines, tradi-

tions, and institutions were not the work of a day; and the testimony that establishes their existence three centuries before Christianity, carries it back to a much more remote antiquity, to an antiquity, that is probably, unsurpassed by any of the prevailing fictions, institutions or beliefs of the ancient world." (Vide Puranas by H. H. Wilson. Pages 105, 106.)

తా॥ పురాణములలో చెప్పబడిన విషయములు ప్రజలలో ప్రసిద్ధములుగా నాచరణలోనుండగాను, అందు చెప్పబడిన రాజచరిత్రములు ప్రజలలో పరంపరాగతముగా చెప్పకొనబడుచునుండగాను, వానిచే బోధింపబడునీతి, నియమములతో గూడిన ప్రవర్తనము ప్రజలయందు స్థిరత్వమును బొందియుండగాను వాటి ప్రామాణికత్వమును, ప్రాచీనత్వములను గురించి వివాదపడుట తెలివిహీనమైన పని. అవి క్రీస్తుశకమునకు పూర్వము అధమము మూడుశతాబ్దములనుండియు నుండియున్నవనుటకు సందేహము లేదు. అయితే వానియందలి సిద్ధాంతముల యుత్పత్తి, అభివృద్ధి అందుకు సంబంధించిన సంస్థలు యొక్క కాలమున మాత్రమేర్పడినవి కావు. క్రీ॥ పూ॥ మూడుశతాబ్దముల క్రిందటనే యున్నవనగా వాని (అనగా పురాణముల) ప్రాచీనత అతిప్రాచీన కాలమునకు తీసుకొనిపోవుచున్నది. ఆ ప్రాచీనత యెట్టిదనగా ప్రపంచములో నే యితర ప్రాచీన పురాణములు సంస్థలు మతములు మించలేని అతిప్రాచీనకాలమునకు చెందియున్నవి.

4. వాయుపురాణం: "It may perhaps, be regarded as one of the oldest and most authentic specimens extant of a primitive Purana." (Page 39.)

తా॥ అతి ప్రాచీనమై, నమ్మకమైన విషయములతో గూడి ఆదికాలము నుండియు గల పురాణములలో నొకటిగ నెంచవచ్చును.

5. శ్రీ భాగవతము: అది పన్నెండవ శతాబ్దములో "బోపదేవు" డను వానివలన వ్రాయబడినట్లు వదంతిగలదు.

దేవీభాగవతము: దేవీభాగవతమె అసలు 18 పురాణములలో చేరినదని వ్రాయబడినది. (Page 51)

6. నారదీయపురాణము : "In the concluding pages it is said "Let not this Purana be repeated in the presence of the 'Killers of Cows' and condemners of the gods". It is probably a compilation of the 16th or 17th century." (Page 54)

తా॥ నారదీయ పురాణము చివర ముగింపు పుటలలో నిట్లుదాహరింపబడినది. "ఈ పురాణము గోవులను చంపువారు, దేవతా దూషణ చేయువారి యెదుట చదువరాదు." అని యుండుటవలన యీ పురాణము మహమ్మదీయ దండయాత్ర మన దేశమునకు వచ్చిన పిమ్మట అనగా 16 లేక 17 శతాబ్దములలో వ్రాయబడి యుండవచ్చును అని విల్సను దొరగారు వ్రాసియుండిరి. వీరి హేతువాదమెంత దౌర్బల్యమైనదో చూడుడు. వేదములోకూడను గోమాంసము తినువారికి, గోహత్య చేయువారికిని యుపనిషద్జ్ఞానమును బోధించకూడదని యుపదేశించిన వాక్యములు గలవు. అందువలన వేదములు కూడను యిటీవల 17 వ శతాబ్దములో వ్రాయబడినట్లూహించవలసి యుండునుగదా! పాశ్చాత్య విమర్శకుల ధోరణియే యిట్లుండ వారి యనుయాయులైన హైందవ పండితులమాట వేరుచెప్పనవసరము లేదు.

7. మార్కండేయ : "It is not easy to conjecture a date for this Purana. That it is subsequent, is doubtful. It is unquestionably more ancient than such works as the Brahma Purana, and Naradiya Purana; and its freedom from sectarial bias is a reason for supposing it anterior to the Bhagavata. At the same time its partial conformity to the definition of a Purana, and the tenor of the additions which it had made to receive legends and traditions, indicate not a very remote age; and, in the absence of any guide to a more positive conclusion, it may conjecturally, be placed in the ninth or tenth century."

(Page 59)

తా॥ మార్కండేయపురాణమున కొక తేదీని యూహించుటకు సులభముకాదు. అది యిటీవలిదని చెప్పుటకుసందేహించవలసి యున్నది.

బ్రహ్మ, నారదీయపురాణములకంటె అతిప్రాచీనమైనది. అందుమతాంతర్భావాఖిల పక్షపాతము లేనందున భాగవతముకంటె పూర్వపుదని చెప్పవచ్చును. కాని పురాణలక్షణములను కొన్నిటిని మాత్రమే యొప్పుకొనుటచేతను, (అనగా చెప్పుటచేత) కథలను, సాంప్రదాయములను చేర్చుకొనెడి స్వభావము కలదగుటవలనను అతిప్రాచీనమని చెప్పుటకు వీలులేదు. అతిప్రాచీనమని చెప్పదగిన అవకాశము లేనందున క్రీ॥ శ॥ తొమ్మిది లేక పదవశతాబ్దములలోనిదని యూహింపబడవచ్చును.

8. అగ్నిపురాణము : "There is every probability that it dates long after the beginning of our era." (Page 62)

తా॥ "మనశకము అనగా క్రీస్తుశకప్రారంభమైన చాలా కాలమునకు వ్రాయబడవచ్చునని చెప్పుట కవకాశము గలదు." (62 పేజీ)

9. భవిష్యపురాణము : "This Purana, as the name implies, should be a book of prophecies, foretelling what will be (Bhavishyat), as the Matsya Purana intimates. Whether such a work, exists, is doubtful". (Page 64)

తా॥ "ఈపురాణము రాబోవు విషయములను ప్రవచించినటుల పేరువలననే దెలియుచున్నది. మత్స్యపురాణ మీపురాణమును బేర్కొనుచున్నది. అట్టి గ్రంథ ముండుననెడి విషయము సందేహాస్పదము." (64 పేజీ)

10. బ్రహ్మవైవర్తపురాణము : "The Brahma Vaivarta has not the slightest title to be regarded as a Purana." (Page 69.)

తా॥ "బ్రహ్మవైవర్తము పురాణముగా నెంచుట కేమాత్ర మవకాశములేదు." (69 పేజీ)

11. లింగపురాణము : "It is not likely that the work is earlier; it may be considerably later."(Page 73)

తా॥ ఇది పురాతనమని చెప్పుట కవకాశములేదు. అది చాలా వెనుక వ్రాయబడినది." (73 పేజీ)

12. వరాహపురాణము : "It may perhaps be referred to the age of Ramayana, the early part of the twelfth century." (Page 75)

తా॥ "ఇది బహుశః 12వ శతాబ్దారంభమునాటి రామాయణ కాలమును సూచింపవచ్చును. (75 పేజి)

(విల్సను మహాశయుడు వరాహ పురాణకాలము 12 వ శతాబ్దారంభమని చెప్పుటలో రామాయణకాలమును కూడను 12 వ శతాబ్దమునకు దెచ్చియున్నాడు. ఇతర జాతులను వారి నాగరికతను తమకంటె హీనముగా ప్రదర్శింప నుద్దేశించి విమర్శనలకు బోయిన వారి నుపేక్షించుటయే మేలు)

13. స్కాందపురాణం : "There is every reason to believe the greater part of the contents of the Kasi Khanda anterior to the first attack upon Benares by Mahmad Ghazni" (Page 76)

తా॥ "ఈ పురాణములోని కాశీఖండము గజినీ మహమ్మదు కాశీ దండయాత్ర కటీవలిదని నమ్ముటకు తగిన కారణములు గలవు

14. వామనపురాణము : "It has not however, the air of any antiquity; and its compilation may have assumed the pleasure of some Brahman of Benares three or four centuries ago." (Page 80.)

తా॥ "పురాతన మనదగిన వాసనయే యీ పురాణమునకు లేదు. మూడు నాలుగు శతాబ్దముల క్రిందట యొకానొక కాశీపండితుని వలన వినోదార్థముగా వ్రాయబడి యుండవచ్చును." (80 పేజి)

15. కూర్మపురాణము : "The date of the Kurma Purana cannot be very remote." (Page 83)

తా॥ కూర్మపురాణము వ్రాయబడిన కాలము యెక్కువ దూరములో లేదు.” (83 పేజీ)

16. మత్స్యపురాణము : “It is not very ancient.” (Page 87)

తా॥ అది పురాతనమైనది కాదు.” (87 పేజీ)

17. గరుడపురాణము : “Whether a genuine Garuda Purana exists is doubtful.” (Page 88)

తా॥ అసలు గరుడపురాణమనున దున్నదనుట సందేహాస్పదము.” (88 పేజీ)

18. బ్రహ్మాండపురాణము : “This work cannot be admitted, therefore, to be a part of a genuine Purana.”

తా॥ “ఇది అసలు న్యాయమైన పురాణములో భాగమని అంగీకరించుటకు వీలులేదు.” (91 పేజీ)

ఈ పై ప్రకారము పురాణములన్నియు యేదియో యొక విధమున నిరసింపబడినవి. అంగీకరింపబడిన పురాణముల కాలమైనను రెండువేల మూడువందల సం॥రముల వెనుకకాలమునకు తీసుకొనిపోబడియుండలేదు. ఇది పాశ్చాత్యపండితుల పరిశోధనాధోరణి. పురాణముల యోగ్యతను, కాలమును, ఆరవభాగమున చెప్పబడియున్నది. అచ్చట చూచుకొనవలయును. భారతయుద్ధమునకు అనగా క్రీ॥ పూ॥ 3138 సం॥రముల కాలముననే వ్యాసభగవానుడు పురాణముల వ్రాసియుండెను. సృష్ట్యాదినుండియు జరిగిన వానిలో కొన్నికొన్ని ముఖ్యాంశములను మాత్రమవి జెప్పును.

పాశ్చాత్యచరిత్రకారుల కథలిట్లుండ వారిశిష్యులై వారి యనుయాయులై హూణావిద్యాధికులైన భారతీయ విద్వాంసులు కూడను తమ ప్రాచీనసాంప్రదాయములను మరచిన వారగుటవలన తమ నవీన గురువుల ననుసరించి వారి పలుకులనే పలుకుచు భారతీయ జనసామాన్యముయొక్క మనసులనుకూడను కలుషితమొనర్చిరి. వారి ప్రాచీన

వాఙ్మయమందు వారికుండిన విశ్వాసమునంతను నాశమొనర్చి దేశమునకును, జాతికిని తీరని యపకారమొనర్చిరి. ఇంకను యిప్పటికిని జేయుచునేయుండిరి. తమ ప్రాచీనసాంప్రదాయములను మచ్చునకైనను విచారణకు దెచ్చియుండినవారుకారైరి. సనాతనసాంప్రదాయమునకు చెందిన శ్రీ బాలగంగాధరతిలకు మహాశయులు "మహావిషువము లేక మేషాయనము కృత్తికానక్షత్రమున సూర్యుడు ప్రవేశింప ప్రారంభమైనటు లభిప్రాయపడి మహాభారత యుద్ధము క్రీస్తుకు పూర్వము పదునాలుగవ శతాబ్దమున జరిగియుండునని సూచించిరి. మహాభారత మనుశాసనికపర్వములో శ్రాద్ధకర్మలు, దానధర్మములు, మొదలగునవే యేకాలములయందు గావించిన నెక్కుడు ఫలితము నిచ్చునో జెప్పెడి సందర్భమున, సంక్రమణ కాలములయందు గావించిన విశేష ఫలము నిచ్చునని జెప్పబడియుండిన సందర్భమును బురస్కరించుకొని మహాభారత కాలమునందు మేషాయనము కృత్తికా నక్షత్రమున ప్రారంభమయ్యెనని యభిప్రాయమును వెలిబుచ్చినటు లగుపడుచున్నది. విశ్వామిత్రుడు త్రిశంకుని కొరకు ప్రతిసృష్టి గావించినప్పుడు శ్రవణా నక్షత్రమునుండి నక్షత్రములను సృష్టించినట్లు మహాభారత మాది పర్వమున శకుంతలోపాఖ్యానమును జెప్పు సందర్భమున జెప్పబడియుండుట వలనను, అశ్వమేధ పర్వమునందు సృష్టిక్రమమును, సృష్టిప్రారంభమును జెప్పబడియుండుట వలనను, మహాభారత కాలమున ఉత్తరాయణము శ్రవణా నక్షత్రమునకు సూర్యుడు వచ్చినపుడు ప్రారంభమైనట్లు లభిప్రాయపడి మహాభారతము క్రీస్తుకు పూర్వ మైదవ శతాబ్దమున వ్రాయబడినటుల వ్రాసియుండిరి." (తిలకు గీతారహస్యము 556_557 పుటలు చూడుడు) మహాభారతమును కలి ప్రారంభ సం॥రమున వ్రాయుట కారంభించి మూడు సం॥రములలో వ్యాస భగవానుడు పూర్తి గావించి దానికి "జయ" యని పేరుపెట్టినట్లు మహాభారతమున గల వాక్యమును త్రోసిరాజనిరి. శ్రీ తిలకు మహాశయులే యిట్టి భావములను బొందియుండ, యితర హైందవ చారిత్రకులమాట చెప్పనేల? మన ప్రాచీన మహర్షులచే వ్రాసియుంచబడిన గ్రంథములు మన నాగ

రికతను, మన రాజచరిత్రములను, మన సాంప్రదాయములను, మన సృష్టి కాలపరిమితులను, చెప్పజాలవట. అవి కల్పనా కథలట. కాని పాశ్చాత్య పండితు లూహించి వ్రాసిన వన్నియు పరమ ప్రమాణము లట. వాటిని గట్టిగా నమ్మవలెనట. వీరి యూహాలు ప్రమాణములుగా నెంచబడిన యెడల వీరికంటె కొన్ని వేల సం॥రములో లేక కొన్ని కోట్ల సం॥రములో యెక్కువ ప్రాచీన కాలమున, ప్రాపంచిక సుఖ ముల నుల్లంఘించి తపోయోగముల నాశ్రయించి, పర్ణ, వాయు భక్షులై, స్వప్రయోజన మెఱుగక, కేవల లోకసంగ్రహార్థమై జీవిం చిన మహాపురుషుల యూహాల (అవియూహాలని వాదమున కంగీక రించినను) నెంతటి పరమ ప్రమాణములుగా నెంచవచ్చునో యూహింపుడు.

పైప్రకారము పాశ్చాత్య పండితుల చేతను, వారి యను యాయులైన హైందవ పండితులచే తను వ్రాయబడిన దేశచరిత్రల లోని కాలపరిమాణము లన్నియు తారుమారై యదార్థ చరిత్రను దెలిసికొనుట కనువుగా నుండియుండ లేదు; ఇప్పుడిప్పుడు భూగర్భ శాస్త్రజ్ఞులు (Geologists) సృష్టి రెండువందలకోట్ల సం॥రముల క్రింద టనై యుండెనను యభిప్రాయమును వెలిబుచ్చిరి. కాని మానవ సృష్టి మాత్రము రెండులక్షల యేబది వేల సం॥రముల క్రిందటనై యుండవచ్చునని యొకరును, నాలుగులక్షలని యొకరును యంచనా వేసియుండిరి. దీనికి కారణము డార్విన్ మహాశయుని పరిణామ వాదమును పూర్వపక్షము చేయ లేకుండుటయే. అనాదిగా నుండిన జీవులు సృష్టిలోనికి రాబడి మానవులుగా జన్మించుటకుమధ్యగల పరం పరనుమనకు బోధజేయుటలో జీవుడు తన పూర్వజన్మాను రూపమైన కర్మసంస్కారములతో గూడి తత్తదను రూపమైన పాషాణ, లోహ, వృక్ష, సరీసృప, జంతు సంబంధములగు జన్మలనెత్తుచు క్రమముగా కర్మక్షయమునొందిన పిమ్మట మానవ జన్మమునకు వచ్చునని మన శాస్త్రములయందు జెప్పబడినది. కాని ప్రతి జీవునికి యిదియే పరి ణామమని యెచ్చటను జెప్పబడి యుండ లేదు. అది వాని కర్మాధీనమై యుండును. జీవునిసృష్టి కెప్పుడును ప్రారంభము లేదు. అనాదినుండియు

జీవులుండి యున్నారు. జన్మపరంపరలును యుండియున్నవి. సృష్టి, లయము, పునస్సృష్టి అనాదినుండియు వచ్చుచుండినవి. అనాదికాలము జరుగుచుండును. కర్మఫలములు వారినంటి వెంట వచ్చుచుండును. అచేతనములగు పాషాణాదులు క్రమ పరిణామమున మానవపరిణామమును పొందునని చెప్పువాదము కేవల మసంగతమైనది. అది సహేతుకమైన వాదము కాదు. ప్రతి విషయము సహేతుకముగా బుజువు కాని దంగీకరించుట కొప్పుకొనని యిట్టి హేతువాదకాలమున హేతువునకు నిలువని మూర్ఖవాదమును గొప్పజేసి దానికి ప్రాముఖ్యత నిచ్చి దానిదృష్ట్యా భారతీయులస్వాభావిక సృష్టి కథనమును విమర్శించుట హేయము.

పాశ్చాత్య పండితు లూహించినట్లు యీ సృష్టి రెండువందల కోట్ల సం॥ రముల క్రిందట స్వాభావికముగా ప్రారంభమై క్రమ పరిణామమును పొందుచు ఆఖరుకు నాలుగు లక్షల సం॥ రముల క్రిందట మానవ సృష్టియైనటుల క్షణమాత్రము వాదముకొరకు అంగీకరించుదము. రెండువందలకోట్ల సం॥ రములకు పూర్వము యీ స్వభావము లేక ప్రకృతి లేదా? ఉండినదనిన అంతకుముందు యెంతకాలమునుండి ఉండియున్నది? ఆ కాలములో మార్పులు జరుగుచుండుటలేదా? ప్రకృతి అనగానే మారుచుండునదిగదా! ఈ మార్పు చెందు స్వభావమునకు మొదలుగలదా? మొదలుండినదనిన మార్పు ప్రారంభింపక పూర్వ మేస్థితిలో నున్నది? స్వభావము లేక ప్రకృతియనునది స్వతంత్రయునికి గలదిగా కనుపించుటలేదు. స్వభావ మనగానే యిది "ఎవరి స్వభావము" అను ప్రశ్న పుట్టును – లేక ప్రకృతియని పేరు పెట్టినను "ఎవరి ప్రకృతి" అని ప్రశ్నపుట్టును. ఇది యేదో యొక వ్యక్తి యొక్క స్వభావము లేక ప్రకృతియై యుండవలెను. ఇది నా స్వభావము, అది వాని స్వభావము. నీ స్వభావ మెట్టిదనిన స్వభావ మెవరిదో యొకవ్యక్తి నాశ్రయించియున్నట్లు రూఢమగు సిద్ధమున వ్యవహరించుచున్నాము. స్వభావము లేక ప్రకృతి స్వాతంత్ర్యయునికి గలది కాదనుట స్పష్టముగా తెలియుచున్నది. స్వాతంత్ర్యము లేనిదెట్లు కార్యమునందు ప్రవేశించగలదు? అనగా మార్పుచెందగలదు?

దానిని మార్పుచెందింప జేయుగల స్వాతంత్ర్యమైన వ్యక్తిగల వస్తు వొకటుండితీరవలయును. అట్టి స్వతంత్రతగల వ్యక్తియే ఆత్మ. ఆత్మ అనగా "తాను" అని అర్థము. గనుక స్వభావము లేక ప్రకృతి ఎవరిది అని ప్రశ్నించువారికి వచ్చు జవాబేమి? తన ప్రకృతేనని జవాబు. తానెవరు? స్వభావము లేక ప్రకృతిని నియమించి మార్పులయందు ప్రేరేపించుచు, దానిని చూచుచు, తెలిసికొనుచు, నియమించుచు, ఆనందించుచుండెడి "తానే" యీ ప్రకృతి మార్పుల కాధారము. తనను విడిచి ప్రకృతి యెప్పుడు నుండలేదు; ప్రకృతిని తనయందు విలీన మొనర్చుకొని తానుండగలడుగాని తనను విడచి ప్రకృతి స్వాతంత్రముగా నుండలేదు. ప్రకృతి లేక స్వభావమనునదొక శక్తి. శక్తి పురుషుని (లేక వస్తువు) విడచియుండుట కవకాశము లేదు. స్వభావ మెప్పుడును స్వాతంత్రముగా వ్యవహరింపగలది కాదు. పురుషుని సంకల్పమువలన ప్రేరితమై మార్పులను జెందుచుండునుగాని తనకు తానుగా నెప్పుడును చలించలేదు. అది జడము. చైతన్యము (అనగా జ్ఞానము) గలది కాదు. జ్ఞానమే ఆత్మ. ఆతడే పురుషుడు. ఆతని సంకల్పముననే యీ సృష్టి యుత్పత్తి, స్థితి, లయములను పొందుచు తిరిగి తిరిగి సృష్టింపబడుచు లయమును బొందుచు అనాదికాలము నుండియు చక్రాకారమున భ్రమించుచున్నది. గాని యెప్పుడో యొక ప్పుడు రెండువందల కోట్ల సం॥ల క్రిందటనో లేక పదివేల కోట్ల సం॥ల క్రిందటనో ప్రారంభమై అంతకుపూర్వము లేక ముందు కొంత కాలమునకుండక నశించునది కాదు. పురుషునియందీ ప్రకృతి అనాది నుండియు గలదు. అనంతకాలము వచ్చుచున్నట్లును లయించు చున్నట్లును తోచుచుండును. పురుషునియందు జాగ్రత్స్వప్న సుషుప్తు లెట్లో అట్లే సృష్టి, స్థితి, లయములుకూడను నిరంతరము జరుగు చుండునని తెలియవలెను. అట్టి పురుషప్రకృతుల స్వరూపమును తెలిసి నప్పుడే ప్రకృతి శాస్త్రము సంపూర్ణతను బొందును. ఆత్మ నెఱుగ బడనంత కాలము యెట్టి పరిశోధనలవలనగాని, ప్రకృతి శాస్త్ర ప్రయోగముల వలనగాని ప్రకృతి స్వరూపము తెలియబడదు. అది యసంపూర్ణమై అసత్యమునే జూపును. "ఆత్మజ్ఞానము" వల్లనే ప్రకృతి

స్వరూపము సంపూర్ణముగా నెఱుంగ వీలగును. ఆత్మజ్ఞానము లేని పురుషులచే జేయబడిన ప్రకృతి పరిశోధనలవలన యేర్పడిన నవీన ప్రకృతి శాస్త్రములు అసత్యమునుండి యసత్యమును బొందింపజేయునవిగాని యదార్థమును దెలుపగలవి కావు ఆ విషయములో ఖగోళ శాస్త్రములో గొప్పపండితుడని పేరొందిన "జేమ్సు జీన్సు" అను పేరుగల పండితుడు వెలిబుచ్చిన అభిప్రాయములీ దిగు నీయబడుచున్నవి.

"We know not how, when, or why, one of these cooling fragments gave birth to life." (The Mysterious Universe. By Sir, JAMES JEANS, M.A. D. Sc., Sc. D., L. S. D., F. R. S. Ed., 1933. Page 2).

(1) తా॥ "అనంతమైన జగత్తులో ఉష్ణమునువీడి చల్లబడిన వానిలో యొక అల్పాంశమైన యీ భూగోళము మీద యేలాగున, యెప్పుడు, ఎందుకే ప్రాణులుత్పత్తిని బొందినవో మాకు తెలియ లేదు."

2. "The appeal of the new physics to probabilities may merely cloak its ignorance of the true Mechanism of Nature." (Do. Book Page 19.)

తా॥ "ఆధునిక ప్రకృతిశాస్త్రమును "బహుశః, ప్రాయశః" (యిట్లుండవచ్చును, అట్లు కావచ్చును, ఆ ప్రకారము నమ్మవచ్చును) అనెడి సంభావ్యములతో చేర్చి ప్రయోగించినందువలన ప్రకృతియొక్క నిజస్థితిని తెలిసికొనలేని మన అజ్ఞానమును మూసిపెట్టుకొనిన వారమగుచుంటిమి. (అనగా తెలియని విషయమును తెలిసినట్లు సంభావించుచు (అట్లు కావచ్చును, యిట్లుండవచ్చును అనెడి) సందేహములతో గూడిన నిశ్చయములతో మన అజ్ఞానమును కప్పి తెలిసిన వారివలె నటించుచుంటిమని తాత్పర్యము.)

3. "We have still no definite knowledge on any of these problems." (Do. Book P. 26)

తా॥ "ఇట్టి ప్రకృతిశాస్త్ర రహస్యములందు మన కిప్పటికిని యదార్థమైన జ్ఞానము కలిగి యుండుట లేదు."

4. "Things are not what they seem; it is the general recognition that we are not yet in contact with ultimate reality. (Do. Book P. 111-112)

తా॥ "(లోకములోని) వస్తువులు, అవి మనకు కనుపడుచుండిన స్వరూపముగలవి కావు" మనమింకను వాస్తవమైన సత్యవస్తువు నెఱుగకుంటిమని సమిష్టిమీద ప్రకృతిశాస్త్రజ్ఞులందరి యంగీకారమైయున్నది."

5. The universe as a whole may have, would entirely transcend our terristrial experience, and so be totally unintelligible to us. In this event, we should have had no foothold from which to start our exploration of the true meaning of the universe." (Do. Book P. 112)

తా॥ "బ్రహ్మాండమంతయు, ఇహలోకసంబంధమైన మన అనుభవములను మించిపోవుచున్నందు వలన సంపూర్ణముగా (యేమాత్రము కూడ) మన కర్థము కాని (లేక తెలియని) స్థితిలో నున్నది. ఈవిషయమున బ్రహ్మాండస్వరూపమును తెలుసుకొనగలపరిశోధనలు Research చేయుటకు తగిన పునాది (లేక ప్రాతిపదిక లేక మూలము) మనకు దొరికి యుండలేదు."

6. Our Earth" A millionth part of a grain of sand out of all the sea-sand in the world.' (Do. Book P.3

తా॥ (మనభూగోళము) ప్రపంచమునగల సముద్రములు అన్నిటియందుండిన యిసుక రేణువులన్నిటిలో యొక రేణువునందు పదిలక్షలవంతు పరిమాణము గలిగియున్నది. అంత (వ్యత్యాసము బ్రహ్మాండమునకును యీ భూగోళమునకును గలదు)

7. "Standing on our microscopic fragment of a grain of sand, we attempt to discover the nature and purpose of the universe which surrounds our home in space and time." (Do. Book P. 3)

తా॥ కంటికి కనుపడని అతిసూక్ష్మమైన యిసుక రేణువులోని అల్పభాగమన దగిన యీ భూగోళముమీద నిలుచుండి (అనంతముగా గల) దేశకాలములవలన నావరింపబడియుండి మనచుట్టును గల యీ

బ్రహ్మాండముయొక్క స్వరూపమును తెలిసికొనుటకు మనము ప్రయత్నించుచుంటిమి" అని చెప్పియున్నాడు. క్రీ॥ శ 17, 18, 19 శతాబ్దములలోని న్యూటన్, (Newton) గ్యాలిలియో (Galileo) హెలెంహోల్ట్జు, (Helmholtz) లార్డు కెల్విన్ (Lord Kelvin) వాటర్స్టన్ (Waterston) మాక్సువెల్ (Maxwell) మైకేలాంగ్లో (Michelangelo) బక్ (Bach) మొదలుగాగల ప్రకృతిశాస్త్రవేత్తల వాదములను విమర్శించి వానిలో యీనాటి ప్రకృతిశాస్త్ర ప్రయోగములవలన బయలుపడిన లోపములను చూపుచు ప్రకృతిశాస్త్రము యీ సృష్టిరహస్యములు తెలిసికొనుటకు చాలదనినిర్ణయించి యింతవరకు ప్రకృతిశాస్త్ర ప్రయోగములవలన తాము తెలుసుకొనిన దేమియు లేదనియు, యింతవరకు ప్రకృతిశాస్త్రమను పేరున పెరిగిన గ్రంథమంతయు శాస్త్రజ్ఞుల ఊహాపోహలేగాని సత్య విషయములు గావనియు స్పష్టీకరించి "జేమ్సు జీన్సు" మహాశయుడు తన గ్రంథము నీవిధముగా ఉపసంహారవాక్యములతో ముగించియున్నాడు.

8. "We may well conclude by adding, what might will have been interlined into every paragraph, that everything that has been said, and every conclusion that has been tantatively put forward, is quite frankly speculative and uncertain. We have tried to discuss whether present-day science has anything to say on certain difficult questions, which are perhaps set for ever beyond the reach of human understanding. We cannot claim to have discerned more than a very faint glimmer of light at the best; perhaps it was wholly illusory, for certainly we had to strain our eyes very hard to see anything at all. So that our main contention can hardly be that the science of to-day has a pronouncement to make, perhaps it ought rather to be that science should leave off making pronouncements: The river of knowledge has too often turned back on itself." (The Mysterious Universe. Page 138)

తా॥ ఈ గ్రంథములోని ప్రతి పేరాలో మధ్య హెచ్చరించబడినట్టి (అనగా అధునిక ప్రకృతి శాస్త్రము సత్యమును తెలిసికొని

చెప్పలేదను విషయమును గురించి హెచ్చరింపబడి.ది) గ్రంథములో చెప్పబడిన ప్రతివిషయములోను మనము ముఖ్యముగా గమనింప వలసిన దేమనగా ! :

"పరిశోధ్ధమై ముందు విచారణకుపెట్టి తేల్చబడిన ప్రతి ప్రకృతిశాస్త్ర పర్యవసానము, నిష్కపటముగా జెప్పిన, నమ్మరానిది (లేక నిజముకానిది) సంశయమైనది." మానవబుద్ధి తెలుసుకొనుట కతీతమైన కఠిన సమస్యలను ఆధునిక ప్రకృతిశాస్త్ర మేమైనను తెలుప గలదేమో చూతమని మేము ప్రయత్నించితిమి. కాని అస్పష్టమై మకమకలాడెడి గుడ్డి వెలుగుకంటె (అనగా ఆభాసజ్ఞానము) హెచ్చుగా తెలిసికొంటిమని చెప్పదగిన అర్హతను పొందలేకపోతిమి. బహుశః ఆ స్వల్పవెలుగుకూడను పూర్తిగా భ్రమాత్మకము కావచ్చును. నిశ్చయముగా యేమాత్రమైనను తెలిసికొనగలమేమోననెడి ప్రయత్నమున నిమగ్నులమై మా యావచ్ఛక్తిని యుపయోగించితిమి. (యేమియు తెలిసికొనలేకపోతిమని తాత్పర్యము) అందువలన యిప్పుడు మా ముఖ్యవాద మేమన :

"ఆధునిక ప్రకృతిశాస్త్రము తెలిసికొని చెప్పదగిన సిద్ధాంత మేమియు లేదు" ప్రకృతిశాస్త్రరీత్యా సత్య సిద్ధాంతమిదియని ప్రకటించుట విధిగా మానవలెను. ప్రకృతి శాస్త్రజ్ఞాన ప్రవాహము యెదురుతిరిగి తనను తానే ముంచివేసుకొనుచున్నది. (అనగా పరస్పర విరుద్ధ పర్యవసానము లేర్పడి యేమియు తెలియరాకున్నది. అని తాత్పర్యము) అని మనము పర్యవసానమును తేల్చుకొనవచ్చును." అని వ్రాసియున్నాడు.

పై ప్రకృతి శాస్త్రజ్ఞుల హెచ్చరికవలన నైనను భారతీయులు తమ శాస్త్రములలోని ప్రతివిషయము ప్రకృతిశాస్త్రమున కనుకూలించి యుండవలెననెడి యుక్తి శూన్యమైనపిచ్చివాదము నొదలి తమ శాస్త్ర వాక్యములకు విరోధముగాదోచెడి ప్రకృతిశాస్త్ర పర్యవసానములు శాస్త్రజ్ఞుల యూహా కల్పితములుగాని వాస్తవములు కావని తెలిసికొని తమ శాస్త్ర వాక్యముల ననుసరించి విజ్ఞానము నార్జించుట యుక్తము.

ప్రకృతి రహస్యమును తెలియగోరువారిని వేదమీ విధమున ప్రబోధించుచున్నది.

శ్రుతి :- యస్మిన్ విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి"

తా॥ ఏది తెలియబడగా యీ కనుపడు సర్వప్రకృతి స్వరూపము తెలియబడిన దగునో (అట్టివస్తువును) తెలిసికొనుమని ఆదేశించుచున్నది. దానినెట్లు తెలిసికొనవలయుననగా వేదమిట్లాజ్ఞాపించుచున్నది.

శ్రుతి :- "తద్విజ్ఞానార్థం సద్గురుమేవాభిగచ్ఛేత్ । సమిత్పాణిం శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం"

తా॥ ఆపరమాత్మ వస్తువును తెలిసికొనుటకు సద్గురువునే పొందవలసినది (వేరుమార్గము లేదని తాత్పర్యము) చేతియందు సమిధలను ధరించినవాడవై (అనగా శ్రోత్రియుడుగా నుండెడి గురువుగారికి అగ్నిహోత్రముల కుపయోగపడు; లేక గురువుకు శాస్త్రీయముగా యుపయోగింపదగు నొకపదార్థమును గొని (వట్టిచేతులతో పోకూడదని తాత్పర్యము) (లేక నీకుగల సందేహములను గురించి ప్రశ్నించుటకు తగిన చిత్తముగలవాడవై అని వేఱొక అర్థము) వేదాధ్యయనము చేసి శ్రోత్రియుడై బ్రహ్మనిష్ఠుడుగా నుండెడి సద్గురువునే బొందుము. అని వేదమాత జీవులకు హితముపదేశించుచున్నది. అట్లుగాక చేయబడు ప్రకృతి శాస్త్రపరిశోధనలాత్మ వస్తువు నెరిగింపజాలవు అని తాత్పర్యము ఆత్మవస్తువు తెలియబడుచుండగా ప్రకృతి స్వరూపము దానంతటదియే గోచరమగును.

శ్లో॥ "ప్రత్యక్షేణానుమిత్యావాయస్తూపాయోనవిద్యతే ।
ఏతం విదంతి వేదేన తస్మాద్వేదస్య వేదత"॥

తా॥ ప్రత్యక్షముగా గాని, (ఎచ్చట పొగగలదో అచ్చట అగ్నియుండునను న్యాయమునకు అనుమాన ప్రమాణమని పేరు) అనుమాన ప్రమాణముచేగాని మరి యెట్టి యుపాయములచేతను తెలియబడని వస్తువేదిగలదో దానిని తెలుపునది వేదము అందువలన వేదమునకు వేదతము సిద్ధించినది.

భూమిమీదనుండిన వస్తుసముదాయమును ఆకాశములోని గ్రహతారకాదులును మనకు ప్రత్యక్షగోచరములు. (భూతద్దము యొక్క సహాయమున చూడబడునవన్నియును గూడ ప్రత్యక్షగోచరములే) మనకు ప్రత్యక్షముగా కనుపడక వానివలన యేర్పడిన కార్యమునుబట్టి యూహింపబడినది అనుమానమువల్ల తెలియునదైయున్నది. జగత్తును చూచి దీనిని చేసినవాడెవడో యొకడుండి తీరవలయుననెడి సామాన్య యుక్తివలన గ్రహింపబడునది అనుమానగోచరము. ప్రత్యక్షముచేతను అనుమానముచేతను గ్రహించి మతములు స్థాపింపబడినవి. ప్రత్యక్ష, అనుమాన ప్రమాణములచే తెలియదగిన వానిని తెలియ జెప్పుటలో విశేషమేమియు లేదు. ప్రత్యక్ష, అనుమాన ప్రమాణముల చేత గ్రహించుట కవకాశము లేని విషయమును గురించి బోధించునదియే భారతీయుల వేదము. అందువలన దానికి జ్ఞానత్వము సిద్ధించినది. వేదమనగా జ్ఞానమని అర్థము. విచారణవలన గ్రహింపబడి అనుభవములోనికివచ్చిన దే జ్ఞానము. అట్టిఅనుభవజ్ఞానమును కలుగజేయునది వేదము అట్లుగాక దేవుడనెడి యొకవ్యక్తివలన తన శిష్యుల కొరకో చెప్పబడినట్టును, అట్టి (యిష్టుడు) ప్రవక్తలోకమునకు వెల్లడించినట్లును దానిని నమ్మినవారు స్వర్గమును పొందెదరనియు, నమ్మనివారు నరకములో త్రోయబడి శాశ్వతకాలము దుఃఖమును పొందుచుందురనియు చెప్పెడి మతగ్రంథములుగలవు. అందు ముఖ్యముగా చెప్పబడునదేమన "దేవుని విషయము చెప్పుచుండిన ప్రవక్తల వాక్యములను నమ్ముట ముఖ్యము" అని బోధించును. తనకేమియు తెలియనప్పుడే నమ్ముట తటస్థించును. నమ్ముట అనగా అజ్ఞానము, అనగా తెలియకపోవుట. ఆ గ్రంథములు (లేక మతములు) చెప్పినట్లు విశ్వసించుట అనగా తనకేమియు తెలియదన్నమాట అనగా తానెల్లప్పుడు అజ్ఞానములోనే యుండుట అని తాత్పర్యము–భారతీయుల వేదముట్లు అంధ విశ్వాసముతో దేనిని నమ్మమని చెప్పదు. విషయజ్ఞానముపొందమని చెప్పును– అట్టి జ్ఞానమును పొందుటకు సద్గురునియొద్ద చేరి ఆత్మను గురించి వినవలయును–ఇందును గురించి శ్రుతి యిట్లు బోధించుచున్నది.

శ్రుతి :- "ఉత్తిష్ఠత! జాగ్రత, ప్రాప్యవరాన్నిబోధత!
క్షురస్యధారా! నిశితా దురత్యయా దుర్గం పథ స్తత్క-
వయోవదంతి॥". (కఠోపనిత్ తృతీయావల్లీ)

తా॥ లెమ్ము; మేలుకొనుము; శ్రేష్ఠులగు గురువులను పొంది బోధింపబడుము. మంగలికత్తి వాడికంటే యెక్కువ వాడి గలదియు, పొందుటకశక్యమగు నదియు నగు (బ్రహ్మపదము) కఠినమైన మార్గమని జ్ఞానులైన వారలు చెప్పుచుండిరని శ్రుతి మూఢజీవులను జ్ఞానమార్గమును తెలిసికొనుడని ప్రబోధించుచున్నది. (నమ్ముమని చెప్పుట లేదు.)

శ్రుతి :- "ఆత్మావారే ద్రష్టవ్యో, శ్రోతవ్యో, మంతవ్యో, నిధి
ధ్యాసితవ్యః"॥

తా॥ ఆత్మ దర్శింపతగినది. (అట్లు దర్శించుటకు సాధనమేమన:-) దాని స్వరూపమును గురించి (సద్గురువులవలన) వినతగినది. (వినిన విషయము) మననము చేయతగినది. (అట్లు మననముచే చిత్తమునందు ప్రసన్నమైన) ఆత్మనిధి ధ్యాసనము చేయతగినది. అనగా శ్రవణ, మనన, నిధి ధ్యాసనములద్వారా ఆత్మ దర్శింపతగినది గాని కేవలము అంధవిశ్వాసముచే పొందతగినది కాదు. అంధవిశ్వాసమునకు కారణము అది అజ్ఞానము దుఃఖమునకు మూలము. అజ్ఞానము పోవలయునని జ్ఞానమును పొందుటయే మార్గము. అంతకుమించి వేఱొక గత్యంతరము లేదు. అట్టి జ్ఞానమును ప్రసాదించునదే వేదము. గనుక వేదమునే యుపాసించి జ్ఞానమును పొందుటయే బుద్ధిమంతుని లక్షణము.

పాశ్చాత్య చరిత్ర కారులచే వ్రాయబడిన మానవ చరిత్రను విమర్శింపుచూ అందలి లోపములను జూపుచు, అనుకూలాభిప్రాయములు గల పాశ్చాత్య విద్వాంసుల వాక్యములను వివరింపుచు, మన వేదశాస్త్ర పురాణాది గ్రంథములలో చెప్పబడిన విధమున కాలనిర్ణయములను జేయుచు, ఆర్యులయొక్కయు, ఆర్యావర్తముయొక్కయు యదార్థ చరిత్రమును, బుద్ధికి దోచినంతవరకును వ్రాసి ఆంధ్ర లోకము ముందు బెట్టుచుంటిమి. బుద్ధిమంతులగు పండితులిందుగల లోపము

లను జూపిగాని లేక తాము సరిజేసి వేరు గ్రంథమును బ్రకటించిగాని భారతీయుల యదార్థ చరిత్రను నిర్మించుటలో దోడ్పడుదురుగాక యని ప్రార్థించుచుంటిమి.

జగత్సృష్టి కథనము సవిస్తరముగా తెలియనిది వైదిక వాఙ్మయము మనకు సమన్వయింపదు. అందువలన భారతీయుల శాస్త్రములలో నేశాస్త్రమును తీసి చూచినను అందు సృష్టికథనము ప్రాధాన్యత వహించి ప్రథమముననే చెప్పబడియుండును. తర్క-వ్యాకరణాదులే గాక ఆయుర్వేదము, మను ధర్మశాస్త్రము, పురాణములు మొదలైన వన్నియు సృష్టివిషయము, లయవిషయము, తిరిగి సృష్టిజరుగుట మొదలగువానితో ప్రారంభించి పిమ్మట ఉద్దేశింపబడిన శాస్త్రము బోధింపబడును. గనుక ముందు సృష్టివిధానమును దెలుసుకొనుట మనకు ముఖ్యావసరము. అందువలన యీ గ్రంథమున

మొదటిభాగము : బ్రహ్మాండసృష్టిని బోధించును

రెండవభాగము : మానవసృష్టిని బోధించును

మూడవభాగము : కలిరాజ వంశావళి నిచ్చి కలిశకమును దృఢపరచును.

యీ ప్రకార మీ గ్రంథ మెనిమిది భాగములుగ వ్రాయబడి దేనికది ప్రత్యేక గ్రంథముగా చేయబడినది. ప్రతివారును సృష్టిక్రమమును దెలుసుకొనుట కిందలి మొదటి రెండుభాగము లుపకరించును. గనుక దీనిని ముందుగా తెలిసికొనిన భారతీయ వాఙ్మయమంతయు సమన్వయ మగునని మనవిచేయుచున్నాము.

ఇట్లు
కోట వెంకటాచలం
గ్రంథకర్త

విజయవాడ
15-5-1949

# స్వవిషయము

నాకు చిన్నతనమునుండియు (అనగా 12 వ స॥రము వయసు నుండియు) దేశచరిత్రలు, కథలు, పురాణములు చదువుటయందు మిక్కిలి యాసక్తి. అట్టి గ్రంథ మేదికనిపించినను దాని నాసాంతము చదువక విడచువాడను కాను – చిన్నప్పటినుండియు దైవభక్తిగలిగి ప్రతివారము యింటిలో రామభజన చేయుచుండుటయు, రామకోటి వ్రాయుటయు, నిత్య ప్రాతఃకాలస్నానమును, సంధ్యావందనాదు లొనర్చుకొనుటయు, ప్రతి హరికథకు హాజరై కథపూర్తియగువరకు శ్రద్ధగా వినుచుండుటయు, తటస్థించుచుండెడిది. పురాణములనుచదువుట యందెక్కువాసక్తి కలిగియుండుటచే శ్రీమద్భాగవతాది పురాణములను, భారత, శ్రీమద్రామాయణాది యితిహాసములను చదువుట తటస్థించినది. పిమ్మట వైరాగ్యోదయమై పెద్దల నాశ్రయించి మొదట మంత్రానుష్ఠానము, పిమ్మట యోగాభ్యాసము, ఆపైన వేదాంత విచారణయందాసక్తి గలిగినందున హూణవిద్యకుస్వస్తిచెప్పి పరమార్థ సాధనలయందు నిమగ్నుడనైతిని 1902 సం॥రం లగాయితు 1904 సం॥రం వరకు బందరు కాపురస్థుడును, యుపశమశీలుడై, మౌనియై నిరంతర బ్రహ్మనిష్ఠుడై యుండిన శ్రీ తలారి రంగదాసుగారి సాంగత్యమున గడుపబడినది. 1904 సం॥రం లగాయితు 1911 వరకు తరుచుగాను, ఆపిమ్మట సకృతుగాను శ్రీ పాలావజ్ఝుల నాగభూషణంగారి సాంగత్యము లభించినది. 1911 సం॥రములో శ్రీశ్రీశ్రీ చిదానంద సరస్వతీ స్వాములనెడి యతీంద్రుల ఆశ్రయము లభించినది. వీరు అవధూతలు. అతివర్ణాశ్రమాచారులు. అనశనదీక్షగలవారు. నియతాహారులై స్వాభావిక ఫలాహారులై యుండిరి. వీరి యనుగ్రహముననే యీ గ్రంథకర్త స్వాభావిక ఫలాహారుడై యిరువదియైదు సం॥ రములు నియతాహారుడై కాలక్షేపము చేయుగలిగెను.

ఈశ్వరానుగ్రహముచే ఉపనిషత్తులు, శ్రీమద్భగవద్గీత, యోగవాసిష్ఠము, బ్రహ్మసూత్రములు, మొదలైన గ్రంథముల పరిచయము గలిగి వాటిని పెద్దలవద్ద వ్యాఖ్యానములతో శ్రవణము చేయుట తట

స్థించినది. అట్లు శ్రవణముచేయబడిన విషయమును మననము చేయుచు అనుష్ఠాన యోగ్యతను సంపాదించు నిమిత్తం జన్మస్థానమైన కృష్ణామండలములోని బందరు పట్టణమున గొడుగుపేట యందుండిన మేడయింటిని వదలి బందరుపట్టణమున కారుమైళ్ళ దూరమునగల "చిన్నాపుర" మనెడి, చిన్న పల్లెగ్రామమునకు రెండుఫర్లాంగుల దూరమున బందరు బాటప్రక్కను యకరమున్నర మెరకగరువుభూమిని సంపాదించి అందు "ఆనందాశ్రమ" మను పేరున యొక పర్ణశాలను నిర్మించి 1911 సం॥రం లగాయితు సకుటుంబముగా నివసింపుచు 1923 సం॥రము వరకు (పండ్రెండు సం॥రములు) అక్షర లక్షగా గాయత్రీ మంత్రానుష్ఠానంబును, శ్రుతి, స్మృత్యాది బహు గ్రంథావలోకనంబును, పరమార్థ సాధనానుష్ఠానంబు లొనర్పబడినవి. బహు వస్తు సమన్వితమై అతి వ్యయప్రయాస సాధ్యంబైన కృత్రిమాహార విధానము పరమార్థసాధనమునకు ప్రతిబంధకమని స్వాభావికాహారము నభ్యసింప మొదలిడి గోక్షీరములతో నొక సంవత్సరమును, నారికేళాహారమున నాలుగు సంవత్సరములును, పచ్చిగోధుమపిండి, ఫలములు మొదలైనవాని నాహారముగాగొని కొంతకాలమును, మొత్తము 1911 సం॥రం లగాయతు 1935 సం॥వరకు యిరువదియైదు సం॥రములు నియతాహారముతోడను, పురాణ గ్రంథపఠనముతోడను పరమార్థ సాధనానుష్ఠానములతోడను గడుపబడినది. 1906, 1907 సం॥రములలో బిపిన్‌చంద్రపాలుగారి యుపన్యాసముల వినినతోడనే స్వదేశివస్తు వ్యాపారమును ప్రోత్సహించుచు ప్రజలలో యుపన్యాస రూపమున ప్రచారమొనర్చుట తటస్థించినది. 1908 సం॥రములో బందరు జాతీయ కళాశాల స్థాపన సందర్భములో కీ॥ శే॥ శ్రీ కోపల్లె హనుమంతరావు పంతులుగారి యుద్యమమున యుడుతాభక్తిని సేవజేయుట తటస్థించినది. 1909 సం॥రమునుండి పరమార్థ చింతోద్రేకముతో ఆప్త మిత్రుడగు శ్రీ పాలావర్ఘుల నాగభూషణంగారితో కలిసి బందరు సమీపమున సముద్రప్రాంతమునగల "కర" అగ్రహారమునగల దేవాలయములో కొంతకాలమును భాగవత గ్రంథపఠనము చేసియుంటిమి. ఆపిమ్మట దేశాటనముచేయ సంకల్పించి వుభయులము కాలినడకను నైజాము

# ఆర్య విజ్ఞానము



గ్రంథకర్త:

తన 27వ సం॥ వయసున కౌపీనధారియై దేశాటనముచేయు

నపుడు తంజావూరులో 1912 సం॥న తీయబడిన ఛాయాపటము.

లోని వరంగలు, మంథెన, వగయిరా ప్రదేశములకును, కడప, కర్నూలు, బళ్ళారి జిల్లాలలోని హంపి, విరూపాక్షము, మద్రాసు వగయిరా ప్రదేశములకు రైలుమీదను పరమార్థాన్వేషణమున యాత్రచేసి కొంతమంది పెద్దలను దర్శించుట తటస్థించినది. ఆత్మ బాంధవుడగు శ్రీ పాలావర్ఝుల నాగభూషణుని చరిత్ర వేఱుగా వ్రాయబడునుగాన యిచ్చట హెచ్చుగా వివరింపలేదు. 1911 సం॥ర మున చిన్నాపురమున ఆశ్రమస్థాపన విషయము పైన దెలుప బడినది. ఆ సంవత్సరముననే కాశీయాత్ర చేయుట తటస్థించినది. 1912 సంవత్సరములో కాలినడకను కౌపీనధారినై మౌనవ్రత మవలంబించి దక్షిణ దేశమును తూర్పునుండి బయలుదేరి రామే శ్వరమునకు జని, పిమ్మట తోతాద్రి, వానమామల జియ్యంగారిని దర్శించి (విశిష్టాద్వైత పీఠము) కన్యాకుమారి వరకును, అచ్చటనుండి పశ్చిమముగా తిరిగి అనంతశయనము మీదుగా ఉడిపి క్షేత్రమును (మధ్వపీఠము) దర్శించి అరణ్యప్రాంతములంబడి నడిచి మైసూరు రాష్ట్రములోని "శృంగగిరిని" దర్శించి (అద్వైతగురుపీఠము) బెజవా డకు జేరుట తటస్థించినది. శృంగగిరిలో తురీయాశ్రమ స్వీకారము చేయుటకు పీఠస్థులను ప్రార్థించితినిగాని వృద్ధుడగు దత్తత తండ్రిగారు జీవించి యుండగా తురీయాశ్రమ స్వీకారము వలదని శ్రీ శ్రీ శ్రీ చంద్రశేఖర భారతీ స్వాములవారు వారించిరి. కాని దత్తత తండ్రి గారు చనిపోయి యిప్పటికి ముప్పది సంవత్సరములైనను నేటికిని తురీ యాశ్రమము సంప్రాప్తించినది కాదు. దైవయోగము మునుముందెట్లుం డునో తెలియదు. ఈ యాత్రలో త్రిపీఠములను దర్శించుట తటస్థించి నది. 1915 సం॥ రములో "అద్వైతబోధినీ"యను వేదాంత గ్రంథము వ్రాయబడి 1922 సం॥ రములో ముద్రింపబడినది. 1924 సం॥ రములో చిన్నాపురమును వదిలి విజయవాడలో గృహనిర్మాణ మొనర్చి నివ సించి యుండిన కాలములో నా బాల్యమిత్రులునూ, ప్రకృతి పత్రిక ట్రస్టీలునూ అయిన శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య పంతులుగారు స్వాభావిక ఫలాహారములు బహుమంది కాచరణ సాధ్యములుగా నుండులాగున మీ యనుభవములను జేర్చి నొక గ్రంథమును వ్రాయు

డని ప్రోత్సహించగా "నిర్విచారజీవనము"ను గ్రంథమును వ్రాసి యుంటిని దానిని వారే తమ ప్రకృతి పత్రిక తరఫున అచ్చువేయించి అమ్మించి యుండిరి.

ఆర్యులను గురించియు, వారి యుత్పత్తికాల దేశములను గురించియు, మన సాంప్రదాయాను సారముగా మన గ్రంథముల ననుసరించి యూహాపోహాలతో నిమిత్తం లేకుండా స్పష్టమైన శాస్త్రీయ వాక్య ప్రమాణములతో నొక గ్రంథము వ్రాయవలయునను సంకల్పము చాల్తా కాలమునుండియు కలిగి యున్నందున అందుకై ప్రయత్నించుచుండిన సందర్భమున శ్రీ తిలకు మహాశయులచే వ్రాయబడిన ఆర్యుల ధ్రువనివాసము, వేదకాల నిర్ణయములను గ్రంథములను జదువుట తటస్థించగా అందు వారుజూసిన శాస్త్ర విరుద్ధ యూహాపోహాలకు చాల చింతించి వానికి సమాధానముగా "ధ్రువనివాస ఖండనము"ను నొక భాగమును వ్రాసి యీ ఆర్యవిజ్ఞానమను గ్రంథమున చేర్చియుంటిని. ఆర్యుల యుత్పత్తి, దేశ, కాలములను, నాగరికత మొదలుగాగల వివరములతో "ఆర్య విజ్ఞాన" మను పేరున యెనిమిది భాగములుగా నీ గ్రంథము వ్రాయబడి ఆంధ్రలోకము ముందు పెట్టబడినది. ఇందు చూపబడిన కాల నిర్ణయ మపారముగా నున్నదని అన్యథా భావమును పొందకుందురుగాక!—

పరమాత్మ అనాది, అనంతము. జీవులనాది, అనంతము. ప్రకృతి అనాది, అనంతము. సృష్టి, కాలము, అనాది అనంతములు. కాని పాశ్చాత్య విద్యావాసన గలిగిన మన ఆధునిక బుద్ధులలో నీఅనాది, అనంత శబ్దార్థములు విచారణకు వచ్చుటలేదు. దేశచరిత్రలు వ్రాయునప్పుడు పాలిత జాతులయొక్క యుత్కృష్టత నంగీకరింప నిష్టములేని పాశ్చాత్య చరిత్ర కారులు మన నాగరికతను, చరిత్రను నిన్నమొన్నటి దిగ జెప్పిన చెప్పవచ్చును. లేక వారిబుద్ధి మూడువేల సం॥ రముల కన్న నెక్కువ కాలము నూహింపలేని కారణముననను కావచ్చును. కాని అనాదికాలమునుండి వంశపరంపరా వచ్చుచుండిన సదాచారముల బురస్కరించుకొని యైనను హైందవ చరిత్ర కారులు నిత్యమును తామాచరించెడి వైదిక, లౌకికర్మలయందును విధిగా తమచే చేయ

బడుచుండిన దేశ, కాలసంకీర్తనారూపమైన సంకల్పములను పురస్క-రించుకొనియైనను కాలగణనమును విచారణకు దెచ్చుకొని తమచే వ్రాయబడు చరిత్రలయందు మాట మాత్రముగానైనను సూచింప జాలరైరి. అనంతమైన కాలములో యీ కోట్లు, అర్బుదములు అని చూపబడిన లేఖ యొక కనురెప్పపాటు కూడా కానేరదు-పరమాత్మ కాలస్వరూపుడై సృష్టిస్థితిలయముల చేయుచుండును-తిథి, పక్ష, మాస, ఋతు, అయన, సంవత్సరాత్మకంబైన మూర్తియే యీ కాలపురుషుని స్వరూపమని శాస్త్రము లుద్ఘోషించుచున్నవి. గనుక సంకుచిత దృష్టిని విడిచి విశాలదృష్టి నవలంబించి అనంతమైన కాలములో యిట్టి సృష్టులనేకములు వచ్చుచు పోవుచుండునని శ్రుతి, యుక్తి, అనుభవములతో పెద్దలవలన తెలుసుకొని తరించుట ప్రతి వానికిని కర్తవ్యము.

ఇందు లోపములున్నట్లు కనిపెట్టిన సత్పురుషులు నాకు తెలియజేసిన వాటిని వెంటనే సవరించుకొందును. శాస్త్ర విశేషముల నెఱింగిన పెద్దలు వానినెరింగించిన మరుముద్రణమున జేర్చుకొందును.

ఆర్య విజ్ఞానమను యీ గ్రంథముయొక్క ప్రథమభాగమైన "బ్రహ్మాండ సృష్టివిజ్ఞాన"మనెడి భాగమును వ్రాయుటకు శాస్త్రగ్రంథముల నిమిత్తము కోరినవెంటనే వారిజ్యోతిష గ్రంథములనన్నింటిని నాకొసంగిన శ్రీ పర్వతం లక్ష్మీనారాయణరావు జ్యోతిషిగారికి నా కృతజ్ఞతా వందనములు.

బందరులో ఇన్కంటాక్సు ఆడిటరుగానుండి పార్టీలతో నిరంతరము వ్యవహారనిమగ్నుడై యుండియు, కోరినవెంటనే బందరునుండి విజయవాడకు వచ్చి యిందలి పటములను గీయుటలో అనేకసార్లు నాకు సాయపడిన చి॥ ముష్టి వెంకటశాస్త్రికి నా యాశీస్సులు.

గ్రంథమంతయు వ్రాయబడి అచ్చుకు సిద్ధముచేయబడినది. ముద్రింపించి ప్రచారములోనికి దెచ్చెడిభారము ఆంధ్రలోకమునందుగలదు.

గాంధినగరం - విజయవాడ,
హూణ 15—5—1949.
(కలి ౫౦౫౦.)

ఇట్లు,
కోట వెంకటాచలం,
గ్రంథకర్త.

# ఆనందాశ్రమ ప్రశంస

ఈ గ్రంథకర్త కృష్ణాజిల్లా బందరుతాలూకాలోని "చినాపుర" మను గ్రామమున "ఆనందాశ్రమ" మను పేరున నొక ఆశ్రమమును నిర్మించుకొని అందు పరమార్థ సాధనానుష్ఠా నంబు లొనర్చుకొను చుండిన కాలము నందొకానొక దినంబున బందరులో హైస్కూలులో ఉపాధ్యాయులుగ చాలాకాలముండి నిత్యము సాయంకాలము భక్తులకు శ్రీ భగవద్గీతోపన్యాసముల నిచ్చుచు కాలమును గడపు చుండిన వారును, బ్రహ్మచర్య దీక్షను వహించి వివాహము నొల్లక త్యజించినవారును, చివరి కాలమునకు తురీయాశ్రమమును స్వీకరించి ఆంధ్రదేశమున సంచారము చేయుచు కోరినచోట నెల్లను శ్రీ భగవద్గీతోపన్యాసముల నిచ్చి ప్రజలయందు భక్తి ప్రపత్తులను, ఆత్మజ్ఞానమును కలుగజేసి యిటీవల ఒక సం॥ రము క్రిందట సిద్ధిపొందిన "శ్రీశ్రీశ్రీ వెంకట్రామశర్మ" గారు వారిమిత్రు లొకరితో కలిసి 1913 సం॥ రములో గ్రంథకర్తగారి కతిథులగు మహాభాగ్యము తటస్థించినది. ఆ సందర్భమును పురస్కరించుకొని శ్రీ వెంకటరామ శర్మగారి మిత్రులైన శ్రీ "యన్. యస్. యన్. వి. నరసింహాచారియార్" గారు తమ గ్రామమును చేరిన పిమ్మట ఆశ్రమమును వర్ణించుచు "నవరత్నములు" అను పేరున తొమ్మిది పద్యముల గీర్వాణ భాషలో రచించి పంపుచూ నొక ఉత్తరమును కూడను వ్రాసియుండిరి. ఆ యుత్తరము, నవరత్నము లనబడు పద్యములు దిగువ నీయబడినవి —

## ఉత్తరము నకలు

శ్రీకృష్ణాయనమః

ఓ ద్విజోత్తమా!

రూప రహితుండును, సకల కల్యాణగుణ పరిపూర్ణుండును, సర్వ రక్షకుండునగు, జగదీశ్వరుని సృష్టి చిత్రంబుల వర్ణింపనేరి తరము! అస్మద్గురు వరేణ్యులగు శ్రీ వేదమూర్తులైన బ్రహ్మశ్రీ వెంకట్రామ

శర్మగ్గారితో పుష్కరోత్సవ కర్తవ్యమునకై కదళీ పురంబునకు వెంబడింపనుద్యుక్తుండనై యిలు వెడలిన తక్షణమే యాల కాపరికుల స్త్రీ యొకతె దధిక్షీరంబుల తట్టను శిరంబున నిడుకొని నాకెదురుగ వచ్చుచుండె. ఆహా? యేమి నా భాగ్యము! నా జీవిత కాలములో నిదివరకెన్నడిట్టి శుభశకునము గానలేదే! ఇందులకు గారణమేమి! భవిష్యద్విశేషమునకు గేవలము సచ్చిదానంద స్వరూపుండైన పరమేశ్వరుడేయని, చింతలెల్ల బాసిన పరుని చందంబున నమితానంద భరితుండనై, సత్వరమున సద్గురు సన్నిధానంబునం జేరిన మానవుని పగిది వర్ణనాతీతమగు నాసంతసమును వెల్లడిసేయ కూరకుంటిని. ఇట్లుండ నింతలో "శివగంగ" యను రమణీయంబగు స్థానంబును జేరితిమి. అంత నచ్చోట "కోపావేశముగల దినకరుని" తీక్ష్ణతచే మిగుల డస్సి, మలయ మారుతమువంటి వాయువును తన స్వాధీనము జేసిన నొక వృక్షము "మీ శ్రమను బాపి సౌఖ్యము నిడెదనని" దయాహృదయురాలైన మాతవలె నెదురుగ గాన్పించుచుండె, జననియాజ్ఞను మీరరాదను లోకోక్తి ననుసరించి యచ్చోట కొంత తడవు వేచియుంటిమి. ఇంతలో భాస్కరుని తీక్ష్ణత "ప్రథమ కోపావేశము" తగ్గెను. సాయంసమయంబు దనవిధికృత్యమును నెరవేర్చుటకు వచ్చుచున్నట్లు గాన్పించెను. అంత మాగురుశ్రేష్ఠులైన వెంకట [illegible] నుడివిరి. "మనమీ రోజున కదళీపురంబున కేగుట దుర్ఘటము. [illegible] నయుస్కాండయ్యెను, కరతలామలకమైన మార్గమునే [illegible]చున్నను, [illegible] గరిష్ఠుండునగు "[illegible]" [illegible] చిన్నా పురంబను గ్రామంబు [illegible]. ఈ రేయి యచ్చోటనుండి రేపటిరోజున [illegible] కేగవచ్చును. మా గురువరేణ్యు [illegible] మాడ్కయానంద [illegible] మహనీయ గుణగరిష్ఠులగు జగద్గురు [illegible] సామాన్యుల నెన్నడును [illegible] యశోవిశారదులై యుండిన [illegible] సందర్శన ప్రాప్తి నాకు లభించునని [illegible],

సత్వగుణ ప్రధానులగు తమ సన్నిధానమునకు వచ్చుచుండుటచే నట్టి యోగ్యతను సూచించు కోమలమైన జల్లని బిల్లుగాలులు తమ గ్రామ సమీపమున కొలువుగొల్చి యుండు ద్వారపాలకులవలె తమ విధులను నెరవేర్చుచు మమ్ముల నానందమగ్నుల జేయుచు– "యిదియే వేంకటాఖ్యుని" యానందాశ్రమమని గుర్తుజూపె. అంతట తమ యశోవిశాలమున శమితానంద భరితుండనై నాసంతసమునకు హేతువే మరచి కేవలమిది పరమాత్మయొక్క నిర్హేతుకజాయమాన కటాక్షమేయని లోలోన యద్భుత పడుచుంటిని. ఆహాహా! భగవద్విలాసము దృగ్గోచరముగదా! నేను ప్రథమ మందిట్టి మహనీయుని జూచుట తటస్థించునని యూహామైనను చేసియుంటినా? యని యచ్చెరువొంది నింతలో ప్రథమమందు నేను గాంచిన శుభశకునమును జ్ఞప్తికి దెచ్చుకొంటిని. వేయేల యిట్టి నామహాద్భాగ్యమునకు యస్మద్గురువరేణ్యులగు జగద్గురు వేంకట్రామ శర్మన్గారే కర్తలు. మద్విరచితమైన "నవరత్నములను" హూణభాషా పద్దెములను తమ యాజ్ఞానుసారముగా నాంధ్రభాషలోని "చంపకమాలలుగ" రచింపించి కొలదికాలములోనే బంపుకొనుచున్నాను.

ఇట్లు, సజ్జన విధేయుడు,
N. S. N. V. Narasimha Chariar

---

# "Heaven's Light be our Guide"

## THE NINE FLORID GEMS

1 How Great Thy powers O Mighty Lord
Beyond the parts to press by a bard
How sweet Thy Creations wondrous work
Poets feeble to paint it is dark.

2 How sweet the way from Sivaganga
Across the meadows pleasant and raw —
Through the paths of streamlets' gleeful sounds
Where Nature pretty ov'r surrounds.

3 What world of panorama there lives
Where birds of all feathers share their joys
Fresh field of atmosphere hides their pelf
Extending their cash — chest high as gulf.

4 How smooth and lovesome streamlets there glide
Where candid joys for-ev'r abide
Joy of glimmering hope in the mind
Reckons on no pious souls to bind.

5 Powerless are words and brains sterile
To describe nature's astounding guile
Tasteless are notions however bright
To think of God's greatest work aright.

6 How cheerful the sleep of Living fields
On nector-water in constant grace
Melody and Fortune where full reign
As if the stormy threatening rain.

7 How lofty palmyra trees there look
And the fruit pretty the mind full took
Lies their every forlorn swain's lot
Despite the terrible days too hot.

8 How sweet thy hamlet Chinnapuram
Where sunshine of pleasure doth full come
Answer to the same thine pious thought
Heaven to aspire the sinner's lot.

9 What words can tell of story sacred
On earth what man but thee makes all glad
For ev'r Charity be thine home
Lord Virtuous Venkatachalam.

N. S. N. V. NARASIMHA CHARIAR

బ్రహ్మశ్రీ దర్భా వేంకటకృష్ణమూర్తిగారు, (M.A.L.T
(సంస్కృత తెలుగుపండిట్ - వి. ఆర్. కాలేజి, నెల్లూరు) వ్రాసిపంపిన

## తేటగీతి - నక్షత్రమాలిక

" ఆదిపూరుష ! దేవ ! మహానుభావ !
అద్వితీయంబనంతంబు నప్రమేయ
మద్భుతంబు ననిర్వాచ్యమైన నీదు
సృష్టి మాహాత్మ్య మెన్న నే నెంతవాఁడ !

* * * *

రమ్యమని విని చిన్నాపురమ్ముఁజూడఁ
బయనమైనాఁడ నొక్క ప్రభాతవేళ
నిండువేడుక శివగంగనుండి కదలి
స్వర్గసీమను మఱపించు మార్గమెల్ల
ఎందుఁజూచినఁ గనులకు విందొనర్చు
పచ్చతేఁ బచ్చికబయళ్ళు పైరుపంట
పిల్లకాలువలందందు వెల్లివిరియు
వన్నెవన్నెల పిట్టలు బారుదీఱి
పలుసికూయుచు నవ్యక్తమధుర ఫణితి
గొంకెఱుంగక కంపలఁ గోఱికతినుచుఁ
గమ్మతెమ్మెరలకు యధేచ్ఛమ్ముగా వి
హార మొనరించు చానంద మనుభవించుఁ
బ్రకృతి రమణీయతకుఁ బారవశ్యమొంది

* * * *

నయనపర్వంబొనర్చెఁ జిన్నాపురమున
అవ్యయానందదంబు మీయాశ్రమంబు
ఏపుమైనున్న సత్ఫలవృక్షములును
అల్లిబిల్లిగఁ బెనఁగొన్న మల్లియలను
మండువేసవినేనియు నెండబాధ
గావరాకుండ హాయినెంతేనిఁ గొల్పు

అచటి మధురోదకమునకు నమృతమొనయె?
పావనంబందు స్వచ్ఛంద జీవనంబు
కోటికొక్కఁడు గల్గునే? కోట నెంక
టాచలమ! నిన్నుఁబోలు కృతార్థుఁడెందు.

దర్భా వేంకటకృష్ణమూర్తి
4–4–1940

## గ్రంథకర్త వంశకధనము.

జననము :- స్వస్తి శ్రీపార్థివ నామసం॥ర వైశాఖ శు ౭ (సప్తమి) జయవారం. కలిశకం ౪౯౮౬ సం॥ (క్రీ॥ శ 1885 సం॥ యేప్రియలు 21-వ తేదీ.

జన్మస్థలం :- కృష్ణాజిల్లా నూజివీడు డివిజన్‌లో చేరిన మధునాపుర అగ్రహారం.

జననీజనకులు :- చల్లా సుబ్బారాయుడుగారు + అన్నపూర్ణమ్మగారు.

జనకవంశం :- ౧. చల్లా వెంకట్రామయ్యగారు + రామమ్మగారు.
|
౨. యీ పరదేశయ్యగారు + రామలక్ష్మమ్మగారు.
|
3. యీ సుబ్బారాయుడుగారు + అన్నపూర్ణమ్మగారు
(నలుగురు సోదరులు) |

గోత్రం :- భారద్వాజస గోత్రం— గ్రంథకర్త (యిద్దరు సోదరులు పలుగురు సోదరీలతో)

శాఖ :- కృష్ణయజుశ్శాఖ - (అంతశ్శాఖ-వెలనాటి వైదికశాఖ)

సూత్రం :- ఆపస్తంబ సూత్రం—

యీ గ్రంథకర్త చల్లావారి వంశమునుండి బందరు గొడుగుపేట లోని కోట నిత్యానందంగారికి దత్తత వెళ్లియున్నాడు.

దత్తత తల్లిదండ్రులు:- కోట నిత్యానందంగారు + లక్ష్మీదేవమ్మగారు.
దత్తత వంశం:-

౧. కోట లింగాజ్యోస్యులుగారు + నర్సమ్మగారు.
|
౨. యీ వెంకటాచలమయ్యగారు + నాగమ్మగారు.
|
౩. యీ నిత్యానందంగారు + లక్ష్మీదేవమ్మగారు.
|
దత్తుడు-గ్రంథకర్త. దత్తతకాలము కలిశకం ౪౯౯౪
యీ వెంకటాచలం + సీతారామమ్మ (క్రీ॥శ॥ 1893-94సం॥)
|
కుమాళ్ళు ముగ్గురు, కుమార్తెలు నలుగురు

విజయవాడ,
15—5—1949
కలి. ౫౦౫౦ సం॥

ఇట్లు,
**కోట వెంకటాచలం**
గ్రంథకర్త.



## ఈ గ్రంథము వ్రాయుటకు చూడబడిన గ్రంథములు

సంస్కృతము అండ్ తెలుగు :

౧. ఋగ్వేదము (విద్యారణ్య భాష్యముతో); ౨. తైత్తరీయ సంహిత; ౩. మనుస్మృతి: ౪. యాజ్ఞవల్క్యస్మృతి; ౫. శ్రీమద్భగవద్గీత; ౬. సూర్యసిద్ధాంతం; ౭. భూభగోళ దీపిక; ౮. బ్రహ్మాండపురాణం (సంస్కృతం అండ్ తెలుగు); ౯. శ్రీమద్భాగవతం (సంస్కృతం అండ్ తెలుగు); ౧౦. దేవీభాగవతం; ౧౧. హరివంశం; ౧౨. విష్ణుపురాణం; ౧౩. వాయుపురాణం; ౧౪. మత్స్యపురాణం; ౧౫. భారతం; ౧౬. శ్రీమద్రామాయణం; ౧౭. బ్రహ్మసిద్ధాంతం; ౧౮. వేదభూమి; ౧౯. ఆయుర్వేదశిక్ష; ౨౦. ఆంధ్రమహాసామ్రాజ్యము - ప్రథమభాగం (నడింపల్లి జగన్నాథ రావుగారిది); ౨౧. హిందువుల ఆధిక్యము; ౨౨. ఖురాన్ షరీఫ్ (చిలుకూరి నారాయణరావుగారి తెలుగు); ౨౩. శతపథ బ్రాహ్మణం;

౨౮. అష్టోత్తర శతోపనిషత్తులు; ౨౯. శంకర విజయము (శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు); ౩౦. కలియుగరాజ చరిత్రము. యింకను యితర గ్రంథములు సందర్భానుసారముగా నాయాచోట్ల ప్రమాణముగా నీయబడియున్నవి.

ఇంగ్లీషు గ్రంథములు :

1. The Aryavartic Home and its Arctic Colonies 2. Vedic Culture 3. Hindu Superiority 4. Manava-rahasyam (by Sri Kalyanananda Bharati Swamiji) 5. Vivekananda Lectures 6. Holy Koran (English Translation by Moulana Mahammad Ali 7. Do by Prof. Seal 8. Ingarsal's Lectures 9. Holy Bible 10. Fragments of a faith forgotten (by G.R.S. Mead, B.A., M.R.A.S) 11. Curruptions of Christianity (by Prof. Priestely) 12. India and what can it teach us (by Max-Muller) 13. Myths and Legends of Babylonia & Assyria. 14. Myths and Legends of Egypt 15. The Civilisation of China. 16 History of Rome 17. Encyclopaedia Brittanica 14th Edition 18. Ancient Greece 19. Glimpses of Mesanic History 20. The Hidden Life in Free Masonry, 21. Epochs of the History of Bharat Varsha (by Sri Kalyanananda Bharati Swamiji) 22. Life of Nietzsche 23. Secret Doctrine By Madam Blavetsky 24. Alberuni's India (By Sachau) 25. Tavernier's Travels in India 26. The early History of India (By Vincent A. Smith) 27. Travels of Fahien in India and Ceylon 28. Ancient India By S. Krishnaswamy Iyyangar 29. Ancient India as described by Ptolemy (By M. C. Crindle) 30. Ancient India By Maagesthenes 31. Vedic India (By Z. A. Ragozin) 32. Ancient India and Colonies in the Far-East Vol. I. (by R. C. Mazundar 33. India & China 3 . India and Central Asia 35. Ancient India (by E. J. Rapson) 36. The Ancient East. 37. The Puranas (By Wilson) 38. Wilson's English Translation of Rig-Veda 39. Keith's Translation of Taithiriya Samhita 40. The Rashtrakutas and their times

from 750 A.D. to 1000 A.D. (by Anant Sadasiva Altekar, M.A., L.L.B.,D.Litt. 41. Prof. Weber's History of Indian Sanskrit Literature 2nd Ed. 42. History of Indian Sanskrit Literature (By Prof. Arthur A. Macdonell. 43. Lapworth's Intermediate Text Book of Geology 1899. 44. Dana's Mannal of Geography 1873.45. Pre-Historic India (by V. Rangacharya, Vol. I) 46. Ancient- Amêrica (by Baldwin) 47. Vedic India (by Prof. Rangacharya Vol II 1937) 48.History of the Parsees (by Mr. Karaka) 49.Darwin's Law of Natural Selection 50. The Religion of the Hindus (By Dhirendra Nath Pal) 51. Annals and Antiquities of Rajasthan (by Col. James Tod Vol. II Ed. 1880 52. Annals of Marwar (by Col. Tod) 53. The Colas (by K. A. Nilakanta Sastry 54. Pre - Historic Civilisation of the Indus Valley (by Sir William Meyer Lectures 1935) (by Rao Bahadur K. N. Dikshit, M.A. Ed. 1939) 55. The Dynasties of the Kali Age. (by Pargiter Ed. 1913) 56. Ancient Dekkan (by K. V. Subrahmanya Iyyer) 57. The age of Sankara (by T. S. Narayana Sastry, B.A.,B.L.,) 58. Long Missing Links 59. The Wisdom f China and India (by Lin Zutang 8th printing 1942) 60. History of India (by Mahamahodhyaya Haraprasada Sastry) 61. Downfall of Hindu India (by C. V. Vaidya, 62. The Mysterious Universe (by Sir James Jeans, M. A., Ed. 1933) 63. Sri Harsha of Kanauj (by K. M. Panikkar, Ed. 1922) 64. A Brief History of the Indian People (by W. W. Hunter Ed. 1881) 65. Early History of the Dekkan (by Bhandarkar 3rd Ed. 1928) 66. Hindu America (by Chamanlal) 67. Pre-Historic India (by Panchanan Mitra, Ed. 1923)

యింకను యితర గ్రంథము లనేకములు చూడబడినవి.

# వి ష య సూ చి క

# ఆర్య విజ్ఞానము



గ్రంథకర్త:

( వయస్సు 64 సంవత్సరములు )

ఓమ్

# ఆర్య విజ్ఞానం ౧

# బ్రహ్మాండ సృష్టి విజ్ఞానం

మానవబుద్ధి వికసించిన కాలదియు తన నావరించి యుండెడి యీ బ్రహ్మాండముయొక్క పుట్టు పూర్వోత్తరములను దెలిసికొన వల యుననెడి సంకల్పము కలుగుచున్నది. అందుకొరకాతడు శాస్త్రజ్ఞాన మును బొంద ప్రయత్నించును. అట్టి బ్రహ్మాండ సృష్టి వివరములను శాస్త్రరీత్యా యిందు బొందుపరచుచున్నాము.

## ౧. సృష్టిక్రమము

నిర్గుణ, అఖండ, అద్వితీయ, నిత్య, నిర్మల, స్వయంప్రకాశ, సత్య, జ్ఞాన స్వరూపమైన పరమాత్మనుండి యీ జగత్సృష్టి జరిగిన వివరములు దిగువ తెలుపబడినవి.

# సమష్ట్యాత్మకమైన సృష్టి

పరమాత్మ

అవ్యక్తము

1. కాలము
2. స్వభావము
3. జీవాదృష్టభూతమైన కర్మము

మహత్తు

అహంకారము

సాత్త్వికాహంకారము — ఇంద్రియాధిష్ఠానదేవతలు + మనస్సు

రాజసాహంకారము — జ్ఞాన కర్మేంద్రియములు

తామసాహంకారము — పంచతన్మాత్రలు — పంచ మహాభూతములు — జ్ఞానేంద్రియ గోళములు — కర్మేంద్రియ గోళములు

పై అన్నిటి కూడికవలన విరాట్ (సమిష్టి స్వరూపము)

స్వరాట్ (సృష్టి కున్ముఖమైన వ్యక్తత)



# ౨ బ్రహ్మాండ స్వరూపము - వివరములు




ఇట్లు పరమాత్మనుండి క్రమముగా నేర్పడిన జలముసర్వ వ్యాప్తమై యుండగా పరమాత్మయొక్క తేజస్సువలన నా జలము నందు స్వర్ణమయములైన అనేకకోట్ల యండములేర్పడెను. అట్లనంతముగా యేర్పడిన యండములలో మనము నివసించుచున్న బ్రహ్మాండమును గురించిన వివరములను శ్రుతి, స్మృతి, పురాణేతిహాసములను, జ్యోతిశ్శాస్త్ర సిద్ధాంతములను, చిరకాలము పరిశీలించికుదిర్చినసమన్వయ భావము నీ దిగువబొందు పరచుచున్నాము. బ్రహ్మాండ స్వరూపము పాఠకులకు సులభముగా బోధపడుట కొరకు శాస్త్రములలో వర్ణింపబడినటుల బ్రహ్మాండ స్వరూపపటము నొకదానిని వివరములతో వ్రాసి యిందు చేర్చడమైనది. దీనిని చదువునపుడు ప్రతి విషయమును పటమునజూచి గుర్తించుచూ చదివిన బ్రహ్మాండ స్వరూపము ప్రతి వాని మనమునందును యంకితమగును. (సెంటరు పటమును చూడుడు)

పైన చెప్పబడిన విధముగా నేర్పడిన యండముయొక్క లోపలి ప్రదేశము చీకటితో నిండియుండగా ఆ పరమాత్మయొక్క తేజస్సు మూర్తిత్వమునొంది అనిరుద్ధుడనెడినామముచే వ్యవహరింపబడి తేజస్సుతో ప్రకాశించెను, ఇందుకు ప్రమాణము.

శ్లో॥ "తదండమభవద్ధైమం సర్వమంతస్తమోవృతం"
"తత్రానిరుద్ధః ప్రథమంవ్యక్తీ భూతస్సనాతనః"

(సూర్యసిద్ధాంతం గోళాధ్యాయం)

అట్టి సనాతన స్వరూపుడైన పరమాత్మ ప్రకృతివల్ల మూర్తీ భవించిన వానివలెనుండి నాయండమును తన తేజోమహిమచే ప్రకాశింపజేసినందువలన హిరణ్య గర్భుడనియు, సూర్యుడనియు సవిత యనియు పరంజ్యోతి యనియు మొదలుగాగల శబ్దములచే వేదముల యందు వ్యవహరింప బడుచున్నాడు. ఇందుకు ప్రమాణము.

శ్లో॥ "హిరణ్య గర్భోభగవా నేషచ్ఛందసి పఠ్యతే।
ఆదిత్యోహ్యాది భూతత్వాత్ప్రసూత్యా సూర్య ఉచ్యతే॥
శ్లో॥ పరంజ్యోతిస్తమః పారే సూర్యోయం సవితేతిచ
పర్యేతి భువనాన్యేష భావయన్ లోకభావనః!

(సూ. సి. గోళాధ్యాయం)

అట్టి పరమాత్మయందున్న అనిర్వాచ్యమైన శక్తిలో యొక స్వల్పాంశము జగత్సృష్టికొరకు బ్రహ్మగానేర్పడెను. ఆ బ్రహ్మ సకల శక్తులుగలవాడై సర్వవేదములను శాస్త్రములను బొందినవాడై యీ బ్రహ్మాండ మధ్యమందుంచబడిన వాడాయెను. అనేక జన్మపరిపాకముచే గొప్ప తపోయోగాదులను బొంది మహామహిమాఢ్యుడైన యొక పుణ్యజీవుడే జగత్సృష్టికొరకు బ్రహ్మగా నేర్పడినాడు. ఆ బ్రహ్మ దేవుడు జగత్సృష్టి చేయదలచినవాడై ధ్యానయోగ బలమున పరిపూర్ణాహంకారమును బొంది తన యాత్మవలన ఆకాశాదిభూతములను సూర్యచంద్రాది గ్రహములను, అనేక యితర తేజోమండలములను చరాచరాత్మకమగు ప్రపంచమును వేదోక్త సాంప్రదాయాను సారముగా గుణకర్మ విభాగము ననుసరించి దేవాసుర మానవాది వర్గములను సర్వజీవకోటిని చాతుర్వర్ణ వ్యవస్థతో కలుగజేసిన వాడాయెను—

(మనుస్మృతి ౧ - ౧ ౪॥ావరకు శ్లోకములు సూ. సి. గోళాధ్యాయం ౧. ౧౭)

సువర్ణమయమగు అట్టి బ్రహ్మాండంబు ఊర్ధ్వభాగంబున భూలోక భువర్లోక, సువర్లోక, మహర్లోక, జనలోక, తపోలోక, సత్యలోకంబు లనియెడు సప్తలోకంబులనున్నూ, అధోభాగంబున అతల, వితల సుతల, రసాతల, తలాతల, మహాతల, పాతాళంబులనియెడు సప్త పాతాళలోకంబులనుం గలిగి పరస్పరాభిముఖముగా సంఘటితమైన కటాహద్వయమువలెనే సమఘన వృత్తంబగు గోళాకృతిగానున్నది. అట్టి బ్రహ్మాండంబునందు సమమధ్య ప్రదేశంబున ఆకాశకక్ష్యయను పేరుగలపరిధివృత్త మొకటిగలదు. అదియెవ్యోమకక్ష్యయనంబడును. దాని నడుమ నక్షత్రకక్ష్యయున్నూ అందులో చక్రవాళ పర్వతాగ్ర సంచారియై మేషాదిద్వాదశ రాశిఘటితమై, శని, గురు, కుజ సూర్య, శుక్ర, బుధ, చంద్ర గ్రహము లొకదానికి దిగువనొకటిగా గలిగి అందుకుదిగువ సిద్ధ, విద్యాధరాదుల స్థానములను గలిగి నక్షత్ర గణోపేతమై వృత్తాకారమైన జ్యోతిశ్చక్రము ప్రకాశించుచున్నది. అదియె 'భగోళ' మనబడును. అట్టి భగోళ మధ్యమున్న ఆకాశమందు భూగోళము బ్రహ్మాండ సమమధ్య ప్రదేశస్థమై పరమాత్మ యొక్క ధారణాశక్తివలన ధరియింపబడి నిలిచియున్నది. (అదియే 'భూగోళ' మనబడును) ఇందుకు ప్రమాణము—

శ్లో॥ బ్రహ్మాండ మేతత్సుషిరం యత్రేదం భూర్భువాదికం
కటాహద్వితయంచైవ సంపుటం గోళకాకృతిః !

(సూ. సి. గోళాధ్యాయం శ్లో ౨౮.)

శ్లో॥ "బ్రహ్మాండ మధ్యే పరిధి ర్వ్యోమ కక్ష్యాభి ధీయతే,
తన్మధ్యే భ్రమణం భానాం తదధోధః క్రమా త్తథా !! "

(సూ. సి గో. అ. శ్లో. ౩౦)

శ్లో॥ "మందామరేడ్య భూపుత్ర సూర్యశు క్రేందు జేందవః !
పరిభ్రమం త్యధోధ స్థా సిద్ధ విద్యాధరా ఘనాః !!

(డిటో శ్లో. ౩౧)

శ్లో॥ "మధ్యేసమంతా దండస్య భూగోళో వ్యోమ్నితిష్ఠతి !
బిభ్రాణః పరమాం శక్తిం బ్రహ్మణో ధారణాత్మికాం !!"

(డిటో శ్లో. ౩౨)

# బ్రహ్మాండ పటము వివరములు

నెం ౧ రుగా చూపబడిన బ్రహ్మాండ పటములో చుట్టునూ బహిః ప్రదేశమందు నేర్పరచిన వృత్తము స్వర్ణమయమగు బ్రహ్మాండ కటాహము. దాని సమమధ్య ప్రదేశమందు పైనుండి దిగువకు కనుబడుచుండే రేఖ మహామేరు పర్వతము. (ఈ రేఖకే మేరుశేఖయనియు మేరు పర్వతమనియు పేర్లు) అందుపైనుండి దిగువకు అర్ధ చంద్రాకారముగా కనుబడుచున్న పదునాలుగు రేఖలు సత్యలోకాది చతుర్దశ భువనములు ఆయా ప్రదేశములయందా యాలోకముల పేర్లు వ్రాయబడియున్నవి.

శ్రుతి :—"సప్త ఇమేలోకా యేషుచరంతిప్రాణాః" (తైత్తిరీయ మహానారాయణమ్)

తా॥ జీవుడు యీ యేడు (ఊర్ధ్వ) లోకములలోను సంచరించుచున్నాడు.

ఈ బ్రహ్మాండమందు ప్రసిద్ధములై (30) ముప్పది స్థానవిశేషములునూ పదకొండు అవాంతర లోకములునూ గలవు. అవన్నియు పదునాలుగు లోకములలోను చేరినవేయై యున్నవి.

పటమునెత్తి మీదనుండి దిగువకు చదువుడు

సత్యలోకమునకు పైనవున్న వృత్తములు మొదలైన వాని వివరము—

1. నిరామయస్థానము — ఇది ముక్త స్థానము.

2. త్రిఖండ సోపానము — ఇందులోని మూడు సోపానములలో 1 వసువులు, 2 రుద్రులు, 3 ఆదిత్యులు అను పితృదేవతలు నిరామయస్థాన సంరక్షకులుగా నుందురు.

3. కారణ బ్రహ్మలోకము — చతుర్ముఖ బ్రహ్మనివాసము.

4. శ్రీనగరము — ఆది విద్యాస్థానము లేక మూలప్రకృతి స్థానము.

5. మహాకైలాసం— ఉమాసహితుడైన శివుని స్థానము.

6. కారణ వైకుంఠం— లక్ష్మీసహితుడైన విష్ణుస్థానము.

I సత్యలోకములో—

7. పురాణపురం — విద్యాధరులస్థానము.

II తపోలోకములో—

8. అంజనావతీపురం — సాధ్యులు మొదలైన వర్గములు.

III జనలోకములో—

9. అంభావతీపురం — సనకసనందనాదులైన ఋషులు.

IV మహర్లోకములో—

10. జ్యోతిష్మతీపురం — సిద్ధాదులు

V సువర్లోకము లేక స్వర్గలోకములో—

11. అమరావతీపురం — దేవేంద్రుడు మొదలుగాగల దేవతాదులు.

VI భువర్లోకములో— (ఇది ఖగోళమునకు సంబంధించిన గ్రహ నక్షత్రాదిగాగల లోకము.)—

12. రథంతరపురం — విశ్వకర్మ — (దేవశిల్పి)

VII భూలోకము. (ఇది రెండుభాగములు) ౧ భూగోళము (పై భాగమున బ్రహ్మాండమునకు సమమధ్యమునగల గోళము.)

మానవులు—

౨ మహాభూమి (యిది భూగోళమునకు అయిదుకోట్ల బ్రహ్మాండ యోజనముల దూరమున దక్షిణముగా నున్నది.)

సప్తసముద్రములు సప్తద్వీపములు దీనియందున్నవి. దీని మధ్యమందుండునది జంబూద్వీపము యిది నవఖండములుగా విభాగింపబడి యున్నది. యిందు దక్షిణముననున్నది భరతఖండము. దీనిలో పదమూడవదియగు స్థానవిశేషము.

13. భరతపురం.

ఈ భరతపురమందు స్వాయంభువ మనువువారి పరివారముతో అనేకులైన పుణ్యాజీవులు, ఋషులతోను గూడియుండి లోకములను పరిపాలించుచు ధర్మాధర్మములను పాలించుచుండును.

మహాభూమిమీదనుండు సప్తద్వీపములను చుట్టుకొని ౧ చలాచల ౨ చక్రవాళ ౩ లోకాలోక పర్వతములను మూడు పర్వతములు స్వర్గలోకమువరకు వ్యాపించియున్నవి. ఇవి వెలుతురును జొరనీయని పొరలు. వీని వివరములు ముందు విస్తారముగా నీయబడినవి.

అధోలోకములు యేడు. వీనికి పాతాళలోకములనిపేరు. ఇవి మహాభూమికి దిగువనున్నవి.

VIII అతల లోకము (పిశాచాది వర్గములకు నివాసము.)

IX వితలలోకములో

14. అలకాపురం-కుబేరుడు గుహ్యకులతోనివసించుచున్నాడు.

15. యోగినీపురం — మయుడు రాక్షసులతోనుండును.

X సుతలములో (ఇందు బలిచక్రవర్తి రాక్షసులతో నివసించుచున్నాడు)

16. వైవస్వతపురం — యముడు, నరకాదులు (పాపజీవులు యాతనల ననుభవించుచుందురు)

XI రసాతలములో

17. పుణ్యపురం — నిఋతిస్థానము - భూతాదివర్గములు

XII తలాతలములో

18. ధనిష్ఠాపురం — భేతాళుడుండును యక్షులను వర్గమువార లుందురు.

19. కైలాసపురం — రుద్రానుచరులతో రుద్రుడుండును.

XIII మహాతలములో

ఇది పితృదేవతలకు నివాసము.

XIV పాతాళములో

20. శ్వేతద్వీప వైకుంఠము — నారాయణుడును యేకాంత భక్తులు నుందురు.

21. మేరువునంటి అధోభాగమందు త్రిఖండసోపానము ఇందు ౧ అనంగజీవులు ౨ ప్రేతగణములు ౩ యాతనాదేహులు అనెడి పాప జీవులుందురు.

22. నిరాలంబసూచ్యగ్రస్థానము-(దిగువనుండు ఆఖరుస్థానము) అముక్త పాపులుండు స్థానము. చిరకాలమునుండి నరకదుఃఖముల ననుభవించుచుండిన మహా పాతకులుండు స్థానము. (ద్విజులు భోజనానంతరం ఉత్తరాపోశనలో ఉదకప్రదానము చేయుచున్నది వీరికే.)

23. భూలోకమునందుగల మేరురేఖను బరివేష్టించుకొని సకర్ణికా అష్టపత్రయుక్తమై వెలుపట నేడు రేఖలతో చేరి ప్రకాశింపుచున్నది. భూచక్రము

(భూభగోళ దీపిక ౭ పుట చూడుము.)

24. భూచక్రమును చుట్టుకొని జ్యోతిశ్చక్ర ఆధార కక్ష్యలను ఆనుకొని దిగువ మహా భూమిమీదనువున్న సప్తసముద్ర, సప్తద్వీపములను చుట్టి యుండునది. "చలాచలపర్వతము"

25. చలాచల పర్వతమును చుట్టుకొని జ్యోతిశ్చక్ర ఆధార కక్ష్యలను అంటియుండినది చక్రవాళ పర్వతము.

26. చక్రవాళ పర్వతమునకు వెలుపట జ్యోతిశ్చక్ర ఆధార కక్ష్యలను కప్పుకొని ఊర్ధ్వధ్రువస్థాన పర్యంతమున్నూ, దిగువ మహా భూమిమీదనుండి చక్రవాళ పర్వతమును చుట్టుకొని యుండునది లోకాలోక పర్వతము.

27. భూచక్ర మధ్యమునగల బిందుస్థానమునందుండి నిర్గమించి ఊర్ధ్వముఖముగా బోయెడు మేరురేఖయందు పరిదృశ్యమానమగు బిందువు అధోధ్రువస్థానము. ఇదియె యామ్యధ్రువస్థానమనిన్ని వ్యవహారింపబడుచున్నది. (దక్షిణధ్రువము)

28. ఆచాయను జ్యోతిశ్చక్రోపరి ప్రదేశమునందు ప్రకాశింపుచున్న బిందువు, ఊర్ధ్వ ధ్రువస్థానమనిన్ని, ఉత్తర ధ్రువస్థానమనిన్ని వ్యవహారింపబడుచున్నది. (ఉత్తర ధ్రువము)

29. ఈ యుభయ ధ్రువస్థానముల సంబంధించి చీర్కుమువలె యొప్పుచున్న ఆధారకక్ష్యాద్వయమున కట్టబడిన్ని సప్తకక్ష్యా వృత

మైన భూచక్రమును చుట్టి ప్రకాశింపుచుండునది భచక్రము (లేక ఆకాశకక్ష్య)

30. భచక్రము యొక్క మధ్య ప్రదేశమునందుగల వృత్తము "భూగోళము" ఇదిగాక యితర స్థాన విశేషంబు లనంతముగాగలవు. పైన తెలుపబడిన పదునాలుగు లోకములున్నూ వాటిపేర్లతోసహా గూఢార్థముతో పనిషత్తునందు వ్యవహరింపబడి యున్నవి.

N. B. భూగోళమునకు వక అంగుళము 'పరిధి' (రేడియసు)గా పెట్టుకొని చుట్టినయెడల అదే బిందువునుండి బ్రహ్మాండమును చుట్టుటకు ముప్పదిమైళ్ళు "పరిధి" (రేడియసు)గా తీసుకొనవలసియుండును.

ఒక గంటకు నాలుగు మైళ్ళ చొప్పున నడువగలిగిన యొక మనుష్యుడు విరామములేకనే రాత్రింబగళ్ళు నడచుచు ప్రయాణము చేసినాడనుకొనిన రెండు లక్షల పై చిల్లర సంవత్సరములకు "అండభిత్తిని" చేరును.

ఒక గంటకు రెండువందలమైళ్లు వేగమున రాత్రింబగళ్లు ఆగకనే యొక విమానము భూమధ్యమునుండి బయలుదేరిన నాలుగువేల సంవత్సరములకు అండభిత్తిని అనగా బ్రహ్మాండము యొక్క బయట ఆవరణను) చేరగలదు.

సూర్యసిద్ధాంతం గోళాధ్యాయం శ్లో॥ ౨౮ ల॥ ౨౯

శ్లో॥ "దిశో రవిర్ది వా నాథో జ్ఞాసి తా రార్కవాకృతిః !
పృథివ్యాదిభ్య ఏతేషాం మార్గజాస్తేపి స్తద్వశాత్ !!
శ్లో॥ ద్వాదశభాత్మాఖ్యం, ఖం, విభజ్యరాశీస్సృనే కుర్యామ్ !
చంద్రం సప్తవింశతి నక్షత్రాణ్యా పిచతారాశ్చ !!
శ్లో॥ ప్రాక్సృష్ట్వా యానికర్మాణి నామరూపాణి నారద !
తాన్యేవ ప్రతిపద్యంతే సృజ్యమానాముహుర్ముహుః!! యిత్యాది

తా॥ దిశలు, సూర్యుడు, నక్షత్రములు, గ్రహాదులు' పృథివ్యాదులున్నూ తత్స్వరూపమైన భగోళము పంౘ్రెండు రాశులుగా విభాగింపబడిన్ని చంద్రుడు, యిరువదియేడు నక్షత్రములున్నూ, తారలున్ను, మొదట సృష్టింపబడి యే యే నామరూపాదులతో వ్యవహరింపబడెనో

ఆ ప్రకారమే ప్రతిసృష్టియందున్ను తిరిగి తిరిగి సృష్టింపబడుచు నాయా నామరూపములనే పొందుచున్నవి.

"బ్రహ్మాండ భూర్భువాది లోకనక్షత్ర, గ్రహతారాదయః సర్వేగోళాకారాః"

(సూ. సి. గోళాధ్యాయం.)

తా॥ బ్రహ్మాండము, భూర్భువాదిలోకములు పదునాలుగున్నూ నక్షత్రములు, గ్రహములు, తారలు, సమస్తము గోళాకారములుగా (అనగా గుండ్రముగా, సమఘన వృత్తములుగా) నున్నవి.

సోమ సిద్ధాంతమందు :—

"నక్షత్రాణిచ, తారాః అగస్త్యసప్తర్ష్యాదయః పూర్వసృష్టి వదేవనిర్మితాః విశ్వస్యసమస్త ప్రపంచస్యాపి భూమేర్వార్కస్యవా, విభానం పూర్వసృష్టివదేవ కల్పయామాస। దేవాసురమనుష్యాణాం సిద్ధానాంచ యథాక్రమమేవ।"

తా॥ నక్షత్రములు తారలు, అగస్త్య నక్షత్రము, సప్తర్షి మండలం మొదలైనవన్నియు పూర్వ సృష్టిలోవలెనే సృష్టింపబడినవి. విశ్వమంతయు, భూమి, సూర్యుడు మొదలైన వన్నియు పూర్వ సృష్టిలోవలెనే కల్పింపబడినవి. దేవా సుర, మానవ, సిద్ధాదులైన గణములన్నియు పూర్వ సృష్టిలోని క్రమమువలెనే సృజింపబడినవి.

---

## ౪ అవాంతర లోకములు ౧౧

నె ౧ రు పటమును చూడుము. అందులో స్వర్గలోకమున 11 అవాంతరలోకములు గలవు.

౧. భూగోళ బిందువునకు నుపరిప్రదేశంబున ఊర్ధ్వధ్రువస్థాన పర్యంతముగల జ్యోతిశ్చక్రాంతరాళ ప్రదేశములో మేరురేఖయందు ప్రకాశించుచుండిన వృత్తము "సూర్యలోకము." (ఇది సూర్య దేవత యుండు లోకముగాని సూర్యగ్రహ మండలంకాదు)

౨. దానికి పై భాగమందు "చంద్రలోకము" (ఇది చంద్ర దేవతయుండు లోకముగాని చంద్రగ్రహ మండలముకాదు.)

౩. దానికి పైన చూపబడినది "అంగారకలోకము" (అంగారక గ్రహమండలము వేరు.)

౪. దానికి పైన "బుధలోకము" (బుధగ్రహముకాదు. బుధ గ్రహాధి దేవత నివసించెడి లోకము.)

౫. దానికి నవ్యవహితముగా పైన "గురులోకము" (గ్రహము వేరు.)

౬. దానికి పైన "శుక్రలోకము" (శుక్రగ్రహమండలం వేరు.)

౭. దానికి పైన "శనైశ్చర్యలోకము" (శనిగ్రహమండలం వేరు.)

౮. ఆ పైన "రాశ్యధిదేవతాలోకము"

౯. అందుకుపైన "నక్షత్రదేవతాలోకం"

౧౦. దానిపైనున్నది "సప్తఋషిలోకము"

౧౧. అందుపైన "ఊర్ధ్వధ్రువలోకము"

ఇదిగాక అనేక యితర అవాంతరలోకములుంగలవు. అవన్నియు సాధారణవ్యవహారోపయుక్తములుకానందున. వానిని తెలిపియుండలేదు.

పురాణములలో గ్రహదేవతా లోకములు చెప్పబడిన చోట గ్రహములను చెప్పినటుల భావించి క్రింద సూర్యుడు ఆపైన చంద్రుడు అని చెప్పబడగా పురాణ ఋషులకు ఖగోళజ్ఞానము లేనటుల కొందరు వ్రాయ సాహసించుచున్నారు. విమర్శకుల ఖగోళజ్ఞాన శూన్యతయే యిందుకు కారణము. పురాణములు కేవలము భూగోళ, ఖగోళములను గురించి చెప్పుట కుద్దేశింపబడినవికావు. ప్రస్తావనశమున ఉటంకింపులుగా పురాణములు చెప్పిన వానిని నాయా విషయములకు సంబంధించిన శాస్త్రములను చూచి సమన్వయించుకో వలయును. పురాణములలోని ముక్కకు ముక్కగా తీసికొని అర్థంచేసి పురాణ ఋషులయందు తమ అజ్ఞానము నారోపించుట మహాదోషము.

నె ౧ రు పటములో బ్రహ్మాండ మధ్యమునగల వృత్తము. సమఘనవృత్తాకారమైన భూగోళము.

భూగోళ వృత్తమును చుట్టికనుపించెడి యేడువృత్తములతో కూడి చక్రాకారము గానుండినది "భూచక్రము" అనగా భూగోళ మధ్య బిందువునుండి చలాచల పర్వతము చివర వరకు పరిధిగా నేర్పరచి గీయబడిన వృత్తమున్నూ అందిమిడియుండిన భూగోళముతో మిగత వృత్తములున్నూ కలిసి యేర్పడినది "భూచక్రము" (నె2 రు పటమును చూడుము) భూచక్రమునకు పైనగల ఆకాశకక్ష్యలో గ్రహనక్షత్రాది జ్యోతిస్సులతోగూడి ప్రకాశించునది. "భచక్రము" లేక జ్యోతిశ్చక్రం.

నెం. ౨ రు భూచక్రము



## ౫. భూచక్రము (నెం. ౩ పటము చూడుడు)

భూగోళము, భూచక్రము అనునవి రెండును వేరువేరు స్థితిగలవి గాని యొకటికాదు. ఈభేదము తెలియులేని కొందరు భూచక్రమని చెప్పిన చోటుల భూగోళముగా భ్రమించి ప్రాచీన ఋషులకు భూమి గోళాకారముకాదు చక్రాకారమని చెప్పుచుండిరి. ఆకాశమందుగల జ్యోతిశ్చక్రమునకు లోపలనిమిడి దిగువ భూగోళముచుట్టూ చలాచల పర్వతము దాటువరకు ఆవరణము నేర్పరచి చెప్పబడినది భూచక్రము. అట్టి భూచక్రమునుదాటి తూర్పు పడమరలను లోకాలోకపర్వతము వరకు జ్యోతిస్సుల (సూర్యచంద్రుల) ప్రకాశముండును. ఆ కిమ్మట అనగా లోకాలోకపర్వతము వద్దనుండి తమోభూమి, ఇచ్చట యెల్లప్పుడును చీకటిగానే యుండునుగాని వెలుతురు చొరనేరదు.

సూర్యప్రకాశముగలిగి చక్రవాళపర్వతమువరకుగల జ్యోతిశ్చక్రములోనిమిడి యుండునది భూచక్రము.

సూర్యప్రకాశము లేక యెల్లప్పుడును తమస్సుతో (చీకటితో) గూడి లోకాలోకపర్వతమును దాటి బయటయుండునది-తమోభూమి. భూగోళముమధ్య బిందువునుండి తూర్పు పడమరల చక్రవాళ పర్వతమంటువరకు భూచక్రమని చెప్పబడినది. గనుక భూగోళమువేరు భూచక్రమువేరు. దేనిని చెప్పినపుడు దానినే అర్థముచేసుకోవలయును గాని రెంటిని యేకము చేయగూడదు.

---

## ౬. లోకములమధ్య దూరములు

భూమధ్య బిందువునుండి :

| | |
|---|---|
| ౧. సూర్యలోకము (ఇవి లోకములుగాని గ్రహములు కావు. గ్రహాధి దేవతలుండు స్థానములు) | ౧. లక్ష బ్రహ్మాండ యోజనములు ౧ బ్ర॥ యో = 30 ఇంగ్లీషు మైళ్లు 533 గజముల 1 అడుగు లేక 30 $\frac{10}{33}$ ఇంగ్లీషు మైళ్లు. |

| | | |
|---|---|---|
| ౨. చంద్రలోకము | ౨. | ల॥ బ్ర॥ యో॥ |
| ౩. అంగారకలోకము | ౩. | ,, |
| ౪. బుధలోకము | ౫. | ,, |
| ౫. గురులోకము | ౭. | ,, |
| ౬. శుక్రలోకము | ౯. | ,, |
| ౭. శనిలోకము | ౧౧. | ,, |
| ౮. రాశ్యధిదేవతాలోకము | ౧౨. | ,, |
| ౯. నక్షత్రదేవతాలోకము | ౧౩. | ,, |
| ౧౦. సప్తర్షిలోకము | ౧౪. | ,, |
| ౧౧. ధ్రువలోకము | ౧౫. | ,, |

భూమధ్య బిందువు (Centre of the Earth) నుండి

| | | |
|---|---|---|
| ౧. స్వర్గలోకము | ౧౩ లక్షల | బ్ర॥ యో॥ |
| ౨. ధ్రువలోకము | ౧౫ | ,, |
| ౩. మహర్లోకము | ౧ కోటి ౧౫ లక్షల | ,, |
| ౪. జనలోకము | ౩ కోట్ల ౧౫ ల॥ | ,, |
| ౫. తపోలోకము | కో॥ ౭-౧౫ ల॥ | ,, |
| ౬. సత్యలోకము | కో॥ ౧౫-౧౫ ల॥ | ,, |
| ౭. అండభిత్తివరకు (బ్రహ్మాండమునుచుట్టినగోడ) | కో॥ ౨౪-౫౦ ల॥ | ,, |
| ౮. అండభిత్తి బయటకు | కో॥ ౨౫-౫౦ ల॥ | , |

(బ్రహ్మాండపురాణం ఉపసంహారపాదం బ్రహ్మలోకవర్ణనఘట్టం

భూమధ్య బిందువునుండి "సూర్యలోకమువరకు" భువర్లోకమ
౧ లక్ష యో॥ సూర్యలోకము లగాయతు ధ్రువలోకమువరకు స
లోకము ౧౪ లక్షల యోజనములు. భూలోక, భువర్లోక, సువ
కములు, కృతకములు, అనగా చేయబడినవని అర్థము. ఇవి ప్రళ
కాలమందు నశించును. సువర్లోకమునకు పైన మహర్లోకము కొ
నశించి కొంత నిలచియుండును. ఆ పైన జనలోక,తపోలోక,సత్యలో
ములు నశింపకయుండును. ఇవి బ్రహ్మ జీవితాంతమునగాని నశింప

(విష్ణు పురాణం ౩-౧౪౯)

పై పదునాలుగు లోకములు మూడు వర్గములుగా విభజింపబడి శాస్త్ర గ్రంథములయందు వ్యవహరింపబడుచున్నవి, అవి. ౧. స్వర్గ, ౨. మర్త్య, 3. పాతాళములని పేర్లు. నె ౧ రు పటములో చూడుము.

౧. స్వర్గమన :— సువర్లోక, మహర్లోక, జనలోక, తపోలోక, సత్యలోకములు అండభిత్తి వరకు.

౨. మర్త్యలోకమన:— మధ్యనుండిన భూలోక, భువర్లోకములు. భూలోకములోని భాగమైన 'మహాభూమి'యను దానికికూడా మర్త్య లోకమను వ్యవహారముకలదు.

3. పాతాళమన:— అతల, వితల, సుతల, రసాతల, తలాతల, మహాతల, పాతాళములు చేరియున్నవి.



## ౪. స్వర్గాది యూర్ధ్వలోకములు

నెం ౧ రు పటమును చూడుడు.

సువర్లోకము:— భువర్లోకమున కుపరిభాగముననుండు లోకము సువర్లోకము. దీనినే సువర్లోకమని, స్వర్గమని పిలచెదరు. ఈ స్వర్గ లోకములోనే ఏకాదశ అవాంతరలోకములుగలవు. స్వర్గములో ఆరు మాసములు పగలుగాను, ఆరుమాసములు రాత్రిగాను వుండును. వారి రోజు మనకు సంవత్సరమగును. అందు దేవతలు నివసించెదరు. దానికి అమరావతిపురము రాజధాని. అందు ఇంద్రుడు, దేవఋషులతోను, దేవతావర్గముల ప్రముఖులతోను గూడి రాజ్యము జేయుచుండును. ఆ లోకమును బొందెడి పుణ్యజీవులకు జరుపవలసిన కృత్యముల నెర వేర్చుచు వేదోక్త ప్రకారముగా ధర్మ పరిపాలన జేయుచున్నాడు. జ్యోతిష్టోమాదియజ్ఞకర్మల నొనర్చిన వారికాలోకనివాసము ప్రాప్తించును అని వేదములు చెప్పుచున్నవి. ఇందు దేవతలు నివసించెడి ప్రదేశమునకు దేవలోకమనియు, జీవులు పుణ్యఫలానుభవమును జేసెడి ప్రదేశమునకు స్వర్గమనియు పేర్లు.

శ్రుతి:— "స్వర్గకామోయజేత" స్వర్గమును కోరువాడు యజ్ఞము చేయుగాకయని యర్థము. అది కర్మ భూమికాదు. భూలోకములో వేదోక్తకర్మల నాచరించిన పుణ్యజీవులకా స్వర్గము లభించును. వారి వారికి విధింపబడిన ధర్మముల నాచరించుచు అహింస, సత్య, శౌచాది గుణములు గలిగి ధర్మమార్గానుగతులైన యితర మ్లేచ్ఛజాతులలోని పుణ్యపురుషులు వారివారి కర్మఫలానుసారమైన జాతియందు నీభారత వర్షమందుబుట్టి క్రమక్రమముగా వేదోక్తకర్మల నాచరించి, తత్ఫలము పొందుట కేర్పడిన స్థానము. పుణ్యకర్మల ఫలము క్షీణించిన వెంటనే తిరిగి భూలోకములో వారివారి పూర్వకర్మవాసనానురూపమైన జాతుల యందు పుట్టుచుందురు.

స్వర్గము సర్వజీవులకు సుఖానుభవప్రదేశము. ఇంటనుండి సమస్త వస్తువులను తీసికొని వనమునకు వెళ్ళి అచ్చట కొన్నిరోజులు సుఖముగా కాలమును జరిపి తీసుకొనివెళ్లిన సామగ్రి అయిపోగానే తిరిగి ఇంటికిచేరు మనుష్యులవలెనే భూలోకమందు తాముచేసిన పుణ్యముల ననుభవించి పుణ్యము క్షీణించిన వెంటనే తిరిగి భూలోకమునకు వచ్చుచుందురు. ఇది భూలోకములోని సమస్తజీవులకు వారి వారిచే సలుపబడిన శాస్త్రీయమైన పుణ్యఫలముల ననుభవించుట కేర్పడిన స్థలము కర్మభూమియైన భారతవర్షమందుబుట్టి వారి వారి వర్ణాశ్రమముల ననుసరించి వేదోక్తకర్మల నాచరించువారికి ప్రాప్తిస్థానము. వేద కర్మల నెరుగనివారుగాని, వేదబాహ్యములైన ఇతర మతావలంబకులు గానిఅహింస, సత్య, దయాదులగు సద్గుణములతోగూడి సంసారయాత్ర జేయువారందరకు స్వర్గములో వారి వారి కర్హములైన స్థానములుగలవు. ఆపిమ్మట వారు కర్మ భూమియందుబుట్టి వేదోక్త కర్మాచరణమున క్రమముక్తినొందు సాధనల జేయుచుందురు.

దేవతలకు ముదిమిలేదు. వారి నేత్రములయందు రెప్పపాట్లు లేవు. వారు కామరూపులు — (కావలసిన రూపమును బొందగల గలవారు)గా నుండి స్వేచ్ఛగా చరింపుచుందురు. వారికి సంతతి అభివృద్ధిలేదు. ఈశ్వరాజ్ఞవల్ల కొన్ని కాలవిశేషములయందు సంతతి

కలుగుచున్నది! వారికి పుట్టినవారు దేవయోనులని పిలువబడుచుందురు. వారు యీక్రింది వివరింపబడిన పది వర్గములుగానున్నారు.

(౧) విద్యాధరులు, (౨) యక్షులు, (3) గంధర్వులు, (౪) పిశాచులు, (౫) భూతములు, (౬) అప్సరస్సులు, (౭) రక్షస్సులు, (౮) కిన్నరులు, (౯) కింపురుషులు లేక గుహ్యకులు (౧౦) సిద్ధులు.

ఈ దేవయోని గణములు వేరువేరు లోకములందు వసింపుచున్నారు. దేవతలుయెల్లప్పుడు భూలోకమునకువచ్చి నివసించకూడదు. విశేష కాలములయందును విశేష దేశములయందును వసింపవచ్చును. మన సంవత్సరము అనగా 3౬౦ అహోరాత్రములు దేవతలకొక అహోరాత్రమగును. మన ఉత్తరాయణము ఆరుమాసములు దేవతలకొక పగలు మన దక్షిణాయన మారుమాసములు దేవతలకొక రాత్రి అట్టి అహోరాత్రములు 360 దేవతలకొక సంవత్సరము. అట్టి సంవత్సరములు 12000 అయిన దేవతల కొక యుగము.

పై ప్రకారము యింకను అధిక పుణ్యముచేసిన పుణ్య జీవులు మహర్లోక, జనలోక, తపోలోక, సత్యలోకములను బొందుచుందురు. సత్యలోకమును బొందిన వారలు తిరిగిపుట్టరు. అచ్చట బ్రహ్మదేవుని వలన జ్ఞానమును బొందినవారలై బ్రహ్మతోకూడా ముక్తులగుదురు.

శ్రుతిః— "బ్రహ్మణాసహాముచ్యతే"

(బ్రహ్మాండ పురాణం, లలితోపాఖ్యానం, వ్యాసఖండం, ౫ అధ్యాయం అగస్త్య హయగ్రీవ సంవాదము చూడుడు.)

---

# ౭ (అ) దేవతలు

కశ్యప ప్రజాపతికి "అదితి"యను భార్యయందు పుట్టినవారు దేవతలు. ఈ దేవతలు అనాది కాలమునుండియు సృష్టితో వచ్చుచు ప్రళయముతో పరమాత్మలో లీనమగుచు పునస్సృష్టియందు తిరిగి వచ్చుచుందురు. వీరి నివాసము స్వర్గలోకము. ఈ దేవతా నామము లన్నియు అధికారిక స్థానములు. ఈ స్థానముల నలంకరించెడివారు అధిక పుణ్యజీవులు క్రొత్తగా పుణ్యజీవులు వచ్చి యీ అధికార స్థానముల నలంకరించు వరకును లోగడవున్నవారే నాయాస్థానముల నలంకరించి యుందురు. గనుక దేవత లెప్పుడునుండువారేనని గ్రహింపవలెను.

ఈ దేవతలనెట్లు స్తోత్రముచేసిన వారు మానవుల కోర్కెల ననుగ్రహించెదరో వారిని ప్రసన్నులనుగా చేసుకొనగల స్తోత్రముల తోను, వారికి సోమరసమును నేతిని నర్పించుటతోను, వారిని గురించి చేయబడు యజ్ఞ విధానముల సూచించుటతోను వేదములయందు మొదటి భాగమును, విషయ వాంఛలు లేక విరాగులైయుండెడి జీవులు ఇహాలోక పరలోక సంబంధములనువీడి ముక్తినిపొందెడు మార్గమును ఉపనిషద్రూపమైన రెండవ భాగమునను. అనుగ్రహింపబడినది.–

అదితియొక్క రెండవ కుమారుడు "అర్యమ"యను దేవత. ఈ దేవత మానవులను కర్మలయందు ప్రేరేపించి ఫలము నిచ్చుచుం డును. (ఋగ్వే ౧౪౭౨. సూక్తం. ౧౩-౧౬ ఋక్కులు.) ఇతనికి చర్షణులను వారలు పుత్రులు. వారివలన భూలోకమున మానవజాతి స్థిరపడినది. అంతటితో మనుష్యులు భూలోకమును విడిచి స్థూలశరీర ములతో స్వర్గాది లోకములకు బోవుశక్తి లోపించినది.

కశ్యపాది ప్రజాపతులు దేవతావర్గములోని వారలు. వారలే మానవులకు మూలపురుషులై భూలోక సంబంధమైన సృష్టినిచేసి యుం డిరి–మానవులకు దేవతలకు మూల పురుషులొకరేయై యున్నందున ఉభయులు బాంధవులై యుండిరి. దేవతలకు స్థానము స్వర్గలోకము. మానవులకు నివాసస్థానము భూలోకము. దేవతలు సూక్ష్మదేహులు

మానవులు స్థూలదేహులు. శ్రుతి "యువోర్హిః సః సఖ్యాపిత్రాణి సమానో బంధు ఋతతస్యవిత్తం"

తా॥ దేవతలైన మీరును, మానవులమైన మేమును, భక్తి చేయుటవలనగాక ఒకేతండ్రివలన పుట్టిన వారమగుటచే బంధువులము (స్వాయంభువుని సంతానము.)

(ఋగ్వే ౭-౫ ౨-౨ లేక ౭-౫-౭౨-౨)

స్వాయంభువునకు "మొదటి అర్యుడు"అను నామమును వేద మాతయే యొసంగినది. లోకమంతయు నాతని సంతానముతోడనే నిండినది. గనుక భూలోకములోని మానవులందరు "ఆర్యులే" గాని యితరులుగారు.

వేదోక్తాచారముల ననుసరించెడి వారు "ఆర్యులు"

వేదోక్తాచారమునొదిలి కేవలము కామమోహితులై స్వేచ్ఛాచారముల ననుసరించెడివారు "అనార్యులు లేక దస్యులు"

కశ్యపప్రజాపతికి :—

ప్రథమ భార్యా "అదితి"యందు బుట్టినవారు దేవతలు

" రెండవ భార్యా "దితి" " దైత్యులు

" ఏడవ భార్యా "సురస" " యాతుధానులు

మొదలు గాగలవారందరు "కశ్యపుని" సంతానమైనందున అన్ని వర్గములవారును సోదరులు. పరస్పర విరుద్ధ స్వభావులైనందున యొకరికి మరొకరు శత్రువులైరి. ఇట్టి దేవాసురవర్గములు ఆది సృష్టియందు ప్రత్యేకముగా సృజింపబడియుండగా యీ వర్గములన్నియు లేవనియు, మానవ జాతిలోని మంచివారందరు దేవతలనియు, చెడ్డవారు రాక్షసులనియు కొందరును, రాక్షసులు, భూతములు, పిశాచులు అను మానవ జాతులు ఆర్యావర్తమున మొదట గలరనియు వారిని తరిమి ఆర్యులు యీ దేశము నాక్రమించిరని కొందరును యీ ప్రకారము మనము నివసించెడి యీ భూగోళము తప్ప యితర లోక

ములు, అందలి జీవవర్గములు లేవని చెప్పుచు మన వాఙ్మయమందుగల సమస్తలోకములకు సర్వజీవవర్గములకు యీ భూగోళమే ఆధారభూతమని తాము నమ్ముచు యితరులను నమ్మునట్లు బోధింపుచూ కూపస్థమండూక న్యాయమును తమయెడ సార్థకపరుచుకొను వారలు కొందరునుగలరు. న్యాయమైన సమన్వయ బుద్ధితో మన శాస్త్రములను పండితులయొద్ద నధ్యయనముచేసి యీ విశాలావకాశమందుగల అనంతలోకములను, అనంతముగాగల జీవసముదాయములను వారివారి స్వభావములను, ధర్మములను తెలిసికొనుట శ్రేయము.

బ్రహ్మాండములోని చేతనాచేతన రూపంబైన సమస్తము జీవమయంబైయున్నది. నదులు, పర్వతములు మొదలయిన అచేతనములలోను జీవులుగలరు. దేవతలు సర్వజగత్తులోను నిండియుండిరి. చేతనాచేతనాత్మకంబైన సమస్త జగత్తును దేవతాశక్తివలననే పని చేయుచున్నది. నదులు పర్వతములు, గ్రహములు, వృక్షములు మొదలైన వానికన్నిటికిని అభిమాన దేవతలుండిరి. మానవుల యింద్రియములను వాటివాటి కార్యములయందు నియమించుచుండినవారు ఇంద్రియాధిష్టాన దేవతలు. హిమవంతునికి పార్వతి పుట్టినదనిన స్థూలరూపముగా కనబడు హిమాలయపర్వతమునకు అనగా పాషాణమునకు మనుష్యాదులు పుట్టినట్టు లెంచరాదు. హిమాలయమునభిమానించి దానికధిష్ఠాన దేవత హిమవంతుడను పేరుతో నున్నాడనియు ఆ దేవతకే పార్వతి పుట్టినదనియు తెలుసుకొనవలెను. "యాశ్చ దేవతా యే తస్యాం ప్రతివసంతి, ఏతాభ్యశ్చ నమోనమః ప్రాచ్యై దిశే" ఇత్యాది.

తా॥ ఈ తూర్పుదిక్కునందే దేవతలైతే నివసించుచుండిరో వారలకొరకు నమస్కారము, ఈ ప్రకారమున్ని దిక్కులయందుండు దేవతలకు ద్విజులు మూడువేళల తాముచేయు సంధ్యావందనములో నిత్యము సర్వదిక్కులనుండు దేవతలకు నమస్కరించుచున్నారు.



# పితృదేవతారాధన

దేవాసురాదులుగాక "పితృదేవతలను" వేఱొక దేవతావర్గము బ్రహ్మవలన సర్గాదియందు సృజింపబడినది. "దేవసర్గము" అనుదానిలో చేరిన యెనిమిది విధములైన వర్గములలో మొదటిదైన దేవతావర్గము నకు పిమ్మట రెండవదిగానీ పితృదేవతావర్గము సృజింపబడినది పాతాళ లోకములలోని మహాతలము వీరికి నివాసము. వీరు సూక్ష్మదేహులు. వీరలు అంగీరసప్రజాపతికి "స్వధాదేవి" యను భార్యయందు గలిగిరి. వీరలు మానవుల కత్యంత పూజనీయదేవతలు. వీరలెప్పుడును మానవ సంతానములయొక్క క్షేమమునారయుచుందురు. వీరిని గురించి కొన్ని వివరములు తెలుపడము ప్రస్తుతము కాదు.

పితృదేవతలను మనము శ్రాద్ధకర్మలయందు వేదమంత్రములచే స్తోత్రముచేయుచు ఆరాధించుచున్నాము. వీరిలో రెండు వర్గములు గలవు. శోభనదేవతలు, శ్రాద్ధదేవతలుననువారు. ఉపనయనము, వివాహము మొదలైన శుభకర్మలయందారాధింపబడువారు "శోభన దేవతలు" ఉపనయనమందు "నాందీ శ్రాద్ధమని"న్ని (నాంది ముఖ మని వాడుకలో నందురు) వివాహమందు "స్థాలీపాకమని"న్ని పేర్లతో పితృదేవతలకు శ్రాద్ధకర్మల నాచరింతురు. ఆ సమయములో పితృ కార్యములందుపయోగింపబడు పెసలపప్పు, మినుపగారెలు, మధుర పదార్థము అరిశలును పెట్టబడుచున్నవి. నైష్టికులుగానుండు వారీ వంటలో భుజింపరు. ఇట్టి శుభకార్యములయందారాధింపబడువారలు "శోభన దేవతల"నబడు పితృదేవతలు. శ్రాద్ధకర్మలు అనగా మృతు లయిన తల్లిదండ్రులకు, ఇతర బంధువులకు ప్రతి సంవత్సరమునందును చేయబడు శ్రాద్ధముల (తద్దినములు) యందారాధింపబడు పితృదేవత లకు "శ్రాద్ధదేవతల"ని పేరు.

తద్దినములు పెట్టడము, మృతులైన మన బంధువులకు గనుక మనమిచటవారి నుద్దేశించి పెట్టుచున్న అన్నాదులు వారికెట్లుముట్టును? కాశీకి వెళ్ళిన తండ్రిపేరుతో యిచ్చట బ్రాహ్మణులకు పెట్టిన అన్నము

వానికి ముట్టుచున్నదా ? యని అనేకులు ప్రశ్నించుచుండుట మనము తరుచు వినుచున్నాము. వారికి సమాధానముగా యీ శ్రాద్ధకర్మల రహస్యము వివరముగా నిచ్చుట చెప్పబడుచున్నది.

జీవులు బ్రహ్మజ్ఞానమును బొంది ముక్తులగువరకు యీ భూలోకమందు జన్మించుచు, కర్మానుగతులై మృతులైన పిమ్మట యిచ్చట చేయబడిన పుణ్యాపాప కర్మలకు తగినలోకములను బొందుచు తిరిగి కర్మానురూపమైన శరీరములను దాల్చుచుందురు. పుణ్యకర్మలు చేసి పుణ్యములు సంపాదించినవారు పుణ్యలోకములైన స్వర్గాదిలోకములనుబొందుటయు, పాపముచేసిన వారు నరకాదిలోకముల నొందుటయు, అట్టి పుణ్యాపాప కర్మలు క్షీణింపగా తిరిగి వారివారి గుణ కర్మాను రూపమైన శరీరములను బొందుచుండుటయు తటస్థించుచున్నది. ఇట్లు కర్మవశమున యొక లోకమునుండి వేరొక లోకమునకు బోవు జీవునకు సహాయార్థముగా వారి పుత్రులు వారి నుద్దేశించి భూలోకమందు జేయు శాస్త్రీయమైన దాన ధర్మాదులను వారికందిచ్చుటకు తగిన ఉద్యోగి వర్గము సృష్టింపబడి అందునిమిత్తము నియమింపబడియుండిరి. "వారే పితృదేవతలు" ఆ విషయము శ్రుతి యందిట్లు వినబడుచున్నది.

శ్రుతి:– "సఈక్షత తేమేనులోకా, లోకపాలాన్ను సృజా ఇతి" (ఐతరేయం. ౧.3)

తా॥ "ఆ పరమాత్మ లోకములను, లోకపాలకులను సృజించెను."

ప్రతి సంవత్సరము మనము చనిపోయిన మన తల్లిదండ్రులు మొదలైన వారి నుద్దేశించి యీ పితృదేవతల నారాధించెదము. శ్రాద్ధములలో మనము పితృదేవతల నారాధించి మన తల్లిదండ్రులకు పెట్టబడుచున్న పిండములను వారికందజేయువలయునని వారిని ప్రార్థింతుము. వేద మంత్రములచే పిలువబడినవారై వారు శ్రాద్ధ కర్మల యందు పిలచినది తడవుగా దయచేసి మనము పితృస్థానములో నియ

మించినభోక్తయైన బ్రాహ్మణునియందు వాయురూపులై యావేశించు దురని మంత్రమందు జెప్పబడినది. మనము భోక్తలైన బ్రాహ్మణుల నారాధించడమనగా వారి నావేశించియున్న పితృదేవతలనే యారా ధించుచున్నామన్నమాట. భక్తి శ్రద్ధలతో మనచే జేయుబడిన పూజలవలన సంతోషించినవారై యా శ్రాద్ధములవలన గలుగు పుణ్యఫలమును చనిపోయిన మన తల్లిదండ్రాదులైన జీవులెచ్చట యేలోకములో యేరూపములోనున్నను లేక యీ భూలోకములోనే తిరిగి జన్మించియున్నను. వారి కందజేయుబడును. పాపకర్మల ఫలము ననుభవించుచుండిన యాజీవులు యీ పుణ్యఫలము జేరగానే వారి కష్టములు కొంతవరకుగాని, అంతయుగాని (మనచేజేయుబడు శాస్త్రీయ దానధర్మాదుల ఫలానుసారముగా) యుపశమించి వారికి సుఖము చేకూరును. దేశాంతరమువెళ్ళి, ద్రవ్యము లేక కష్టము లనుభవించు చుండినమన తండ్రిగారిపేరున మనము యిచ్చట పోస్టాఫీసులో చెల్లింప బడిన మనిఆర్డరు సొమ్ముటుల వారినిజేరి, వారి కష్టమునుండి తరించుట కక్కరకు వచ్చునో, ఆ ప్రకారముగానే మనచే భూలోకములో చనిపోయిన వారిని గురించి చేయబడు శాస్త్రీయ ధర్మములు పితృ దేవతలద్వారా వారికి వెంటనే చేర్చబడి వారికి సుఖము గలిగించును.

ఉదాహారణము:— ఒకడు చనిపోగా నా జీవుడు నరకములో బాధలు బొందుచున్నాడనుకొనుడు. వాని కుమారుడుగాని, మను మడుగాని, లేక వాని కర్మచేయుట కేర్పడిన కర్తగాని వాని నుద్దే శించి చేయు శాస్త్రీయమైన శ్రాద్ధకర్మల ఫలమును దానధర్మముల ఫలమును వెంటనే వానికందజేయుబడి వాడనుభవించుచుండిన దుఃఖము నుండి విముక్తుడగుట తటస్థించును. చనిపోయిన యొకడు పుణ్యాపాప లోకములను దాటి భూలోకములో పశు, పక్ష్యాది రూపమున జన్మించి యున్నాడనుకొనుడు. వాని వంశములోనివారు వాని నుద్దేశించి పితృ దేవతల నారాధించి చేయుబడిన కర్మఫలము వెంటనే పితృదేవతల వలన నాజీవునికి చెందజేయుబడి యాతనాత్మకమైన యాపాపశరీరము పడిపోయి (అనగా అచ్చటచచ్చి) ఆ జీవుడు పాపమునుండి తరించి

పుణ్యలోకములకుగాని, పుణ్యజన్మ అనగా మానవజన్మకుగాని వెళ్ళి పోవును. మానవ శరీరములోనేయుండి దరిద్రమనుభవించు వానికి హఠాత్తుగా ధనము సంప్రాప్తమగును. ధనవంతునికి ఐశ్వర్యము హెచ్చును. ఈ ప్రకారము శ్రాద్ధములవలనను, శ్రాద్ధకాలములో మనచే జేయబడు దానములవల్లను శరీరమును వదిలి వెళ్ళిన జీవులే లోకములోనుండినను వారి కత్యంత యుపకారము చేయగలుగుదుము గాన సత్పుత్రుడైన వానికి తల్లిదండ్రులకు పైలోకములలో సుఖమును గలుగజేయుటకు పితృదేవతారాధనకన్న యితరమైనది వేరొకటిలేదు. లోకములో తమ కుమారులకు ఆస్తిని సంపాదించి యిచ్చుటకు తల్లి దండ్రులనేక పాపముల కొడిగట్టి ధనము నార్జించి తాము బుద్ధిపూర్వకముగా దానధర్మమేమియు చేయకనే చనిపోవుదురు. వారి సంపాదన యంతయు యీ లోకములోనే విడిచి వెళ్ళిరిగదా ! వారికితర లోకములలో యీ ధనమేమియు సహాయపడదు. తమ కష్టార్జిత ధనమును ధర్మరూపమున మార్చుకొని వారుతీసుకొని పోవుటకును అజ్ఞానము వలన ప్రయత్నించి యుండలేదు. ఆ ధనమంతయు కుమారులపరం చేయబడినది. కుమారులైనను తండ్రి కష్టార్జిత ధనమును (వారి నుద్దేశించి ఆ జీవులనిమిత్తముచేయబడు దానధర్మములను వారికి చెందజేయుట కేర్పడిన యుద్యోగులైన) "పితృదేవతల" నారాధించి దానధర్మముల నాచరించి యితరలోకములలో వారికి సుఖముగలుగ జేయు నిమిత్తముపయోగించుట న్యాయము. మనముజేయు శుభాశుభ కర్మలన్నియు చనిపోయిన మన వంశీకుల నందరను ఉత్తమలోకములను పొందింపజేయుట కుద్దేశింపబడి చేయబడునట్లు మనము చేసెడిసంకల్పములోనే నిముడ్చబడియున్నది. తమచే జేయబడు కర్మలస్వరూపమును అవి నాచరింపబడు విధానమును తెలియక యాచరింపబడుచున్నను వాని ఫలము తమ పూర్వపు వంశీకులకుచెంది వారికి సుఖము గలుగ జేయునట్టి కర్మతంత్ర మంతయు మన మహర్షులచే కూర్చబడినది. కర్మలస్వరూపమును తెలిసిజేయుట ముఖ్యము, "జ్ఞాత్వాకర్మాణికుర్వీత" కర్మలను తెలిసికొని చేయవలయునని వేదమాత ఆదేశించుచున్నది.

అట్లు తెలిసికొనలేని మూఢునిచేత చేయబడు కర్మగూడనూ వ్యర్థము గాక సత్ఫలము నొసంగునటుల అనుగ్రహింపబడినది. మనచే జేయబడు కన్యాదాన సంకల్పములో నేమిచెప్పబడుచున్నదో చూడుడు. "మయాసహదశపూర్వేషాం, దశాపరేషాం, మధ్యంశానాం,పితౄణాం నరకాదుత్తీర్య శాశ్వతి బ్రహ్మలోకే నివాససిద్ధ్యర్థం కన్యాదాన మహంకరిష్యే," అని సంకల్పించుచున్నాము. అనగా "నాతోసహా, గడచిపోయిన పదితరములవారును, రాబోవు పదితరములవారును (ముందు 10, రాబోవునవి 10, తానొకటి వెరశి 21 తరములు) వెరశి నావంశంలోని యిరువదియొక్క తరములలోని పితరులు(తల్లిదండ్రులు) నరకమునుండి తరించి శాశ్వతముగా బ్రహ్మలోకములో నివసించుటకుగాను యీ కన్యాదానము నాచేజేయబడుచున్నది"యని సంకల్పించుచున్నాడు. మనచే జేయబడు శుభాశుభ కర్మలన్నియు, మన పితరులు పాపలోకములనుండి తప్పించుకొని పుణ్యలోకములకు బోవునిమిత్తమే యైయున్నది. వాటిని వదలుట మహాపాతకము.

ఒకప్పుడు శ్రీశంకరాచార్యస్వాములవారు కాశీయాత్రబోవుచు దారిలో నొక మర్రిచెట్టుక్రింద మకాముచేయగా ఆ రాత్రి నాచెట్టు నాశ్రయించియున్న బ్రహ్మరాక్షసి వారిని బలుకరించి వారిని అయ్యా! "మీరు సంవత్సరములోని ఆషాఢ, కార్తీక, మాఘ, వైశాఖ, మాసములలోని పూర్ణిమలయందు సముద్రస్నానము చేసినందున కలిగిన పుణ్యఫలమును నా కొసంగిన నాయీ పాపజన్మపోయి నేను సుఖింతు"నని యాచించగా వారట్లనుగ్రహించి వాని నుద్దేశించి సంకల్పించి వానికా పుణ్యమును ధారపోయగా నాతని కారూపముబోయి వెంటనే పుణ్యలోకములను బొందినటుల వినుచున్నాము. చరత్కారుడను ఋషి వివాహమాడక బ్రహ్మచారిగానుండి యొకనాడొక యరణ్యములో సంచరించుచుండగా నాతని పితరులు యొకానొక పాప కర్మచే యొకచెట్టు కొమ్మనుబట్టి తలక్రిందుగా వ్రేలాడుచుండిరనియు, యోగశక్తిగల వాడగుటవలన జరత్కారుడు వారిని జూడగలిగి యట్లు వ్రేలాడుచుండుటకు కారణమడుగ వారలు నతనితో నిట్లనిరి "మా

వంశములో జరత్కారుడను వాడొకడుపుట్టి యున్నాడు. వాడు వివాహమాడి సంతానమునుగని పుణ్యకర్మలాచరించినగాని మాకీ పాపవిముక్తిగలుగదు. వాని సహాయము మాకత్యావసరము. దయచేసి నీవు వానిని కలుసుకొని వెంటనే వివాహమాడి మమ్ముద్దేశించి పుణ్యకర్మలాచరింపుమని చెప్పుము" అని యర్థింపగా వెంటనే జరత్కారుడింటికి వెళ్ళి వివాహమాడి సంతానముబడసి పితృదేవతారాధనలు జేయుచు అనేక పుణ్యకార్యంబులు వారి పితరుల నుద్దేశించి చేయగా నాతని పితరులు పుణ్యలోకంబులను బొందినట్లును భారతమున తెలియుచున్నది. ఇదిగాక సగరాత్మజులు అరువదివేలమంది మహాపురుషావమానంబున నశించి నరకమును బొందగా వారి నుద్ధరించుటకు తపస్సు చేయుచు వారి కుమారుడు మృతినొంద వారిమనుమడగు "భగీరథుడు" తపంబొనర్చి గంగను స్వర్గమునుండి భూలోకమునకు శివుని యనుగ్రహంబున దెచ్చి తన తాతల భస్మరాసులమీద బ్రవహింపజేయగా వారందరును పాపలోకంబులనుండి తరించి పుణ్యలోకంబులకు పోయిన కథ పురాణ ప్రసిద్ధము. మనకప్రత్యక్షముగానున్న లోకములను, అచ్చటి విషయములను, దెలుసుకొనుటకు శాస్త్రముతప్ప మనకు వేరొక గత్యంతరంలేదు. గనుక శాస్త్రానుసారముగా బద్ధులమై కర్మల నాచరించి శ్రేయస్సునుబొందుటయే మానవులకు విధియైయున్నందున కుతర్కంబులకు దిగక శాస్త్రవిధి ననుసరించుట ధర్మము. ఎవరి స్థితిగతుల ననుసరించి వారికి తోచినంతవరకు శ్రద్ధతో కర్మలను శాస్త్రవిధి చొప్పున నాచరించుచుండ వలయునుగాని మానదగదు—

శ్రుతి :— "యది పితృలోకకామోభవతి, సంకల్పాదేవాస్య పితరస్సముత్తిష్ఠంతి! తేనపితృలోకేన సంపన్నో మహీయతే" !!

(ఛాందోగ్యం. ౮-౨-౧)

తా॥ "పితృలోక కాముడు తన సంకల్పముచే తన పితరుల నుద్ధరించుచున్నాడు. అందువలన పితృలోకమును పొందువాడగును."

శ్రుతి :— "కర్మణాపితృలోకః" (బృహదారణ్యకం-)

తా॥ "కర్మవలన పితృలోకము జయింపబడును"

శ్లో॥ "మనో హైరణ్యగర్భస్యయేమరీచ్యాదయస్సుతాః!
తేషాంఋషీణాం సర్వేషాంపుత్రాః పితృగణాః స్మృతాః!!
(మనుస్మృతి 3-౧౯౪)

తా॥ హిరణ్యగర్భునిచే సృజింపబడిన మనుప్రజాపతి, మరీచి మొదలగు పదిమంది ఋషులను సృజించెను. ఆ మరీచి మొదలగు వారలచే యీ పితృదేవతలు సృజింపబడిరి —

౧. విరాట్పుత్రులగు "సోమసదులు" సాధ్య దేవతలకు పితరులు (మను 3.౧౯౫)

౨. మరీచి మహర్షిచే సృజింపబడినవారును ప్రసిద్ధులును అగు "అగ్నిష్వాత్తులు" దేవతల యొక్క పితరులు— (మను ౧౯౫)

3. అత్రిమహాఋషి యొక్క పుత్రులగు "బర్హిషదులు" అను పితృదేవతలు దైత్య, దానవ, యక్ష, గంధర్వ, ఉరగ, రాక్షస, సుపర్ణ, కిన్నర, వర్గములకు పితరులు— (మనువు 3. ౧౯౬)

౪.1. భృగుపుత్రులైన "సోమపులు" బ్రాహ్మణులకు పితృదేవతలు
2. అంగిరస పుత్రులైన "హవిర్భుజులు" క్షత్రియులకు ,,
3. పులస్త్య పుత్రులైన "ఆజ్యపులు" వైశ్యులకు ,,
4. వసిష్ఠ పుత్రులైన "సుకాలులు" శూద్రులకు ,, (మను 3.౧౯౭)

౫. 1. అగ్నిదగ్ధులు 2. అనగ్నిదగ్ధులు, 3. సోమపులు, 4. బర్హిషదులు 5. అగ్నిష్వాత్తులు, 6. సౌమ్యులు, వీరలును బ్రాహ్మణులకు పితరులుగానే యెఱుగవలయును.— (మను 3.౧౯౯)

ఇప్పుడు యే పితృగణములు ముఖ్యముగా చెప్పబడిరో ఆపితృగణముల యొక్క పుత్రపౌత్రాదులే యీ లోకమునందు నిండిన వారలుగానున్నారు. మను 3.౨౦౦

మరీచి మొదలగు దేవ ఋషులవలన (లేక ప్రజాపతులవలన) పితృదేవతలును, ఆ పితృదేవతలవలన దేవాసురాదులును, ఆ దేవతల వలన యీ చరాచరములు క్రమముగా గలిగెను. (మను 3.౨౦౧)

శ్రుతి :— "తస్మాచ్చదేవాబహుధా సంప్రసూతాః" !!

తా॥ "ఆపితృదేవతలవలన అనేకవర్గములైన దేవాదులుపుట్టిరి" అని వేదవాక్యముకూడా చెప్పుచున్నది.

దేవతలకు శరీరములున్నవి. అవి బహుసూక్ష్మములు—

పితృకర్మలయందు షడంగములుగలవు. అవి యిప్పటికిని శ్రాద్ధములయందాచరించుచునే యున్నాము. ఎట్లనగా !

౧. "దేవలోక స్థితజీవస్య ఫలప్రాప్త్యర్థం— అగ్నౌకరణం
౨. "స్వర్గస్య" ,, నిమంత్రిత బ్రాహ్మణభోజనం
౩. "యమలోకస్థితస్య" ,, పిండప్రదానం
౪. "నరకలోకస్థితస్య" ,, వికిరం
౫. "మనుష్యలోకప్రవిష్టస్య" ,, భోక్తృదక్షిణాదానం
౬. "అసురలోకప్రాప్తస్య" ,, భూరిభోజనం

"ఇత్యేతానికర్తవ్య తావిధ్యుక్తాని"
ఈపై ఆరింటిని విధ్యుక్తముగా చేయతగినది.
పై విషయమునకే యింకొక వాక్యము :—

"అగ్నౌకృతేన దేవస్థా, స్వర్గస్థావిప్రభోజనాత్ ।
యమస్థాపిండదానేన, వికిరాన్నరకస్థితాః ।
దక్షిణామర్త్యలోకస్థాః । అసురాభూరిభోజనాత్ ।
పితరస్తృప్తిమాయాంతి|షడంగంపైతృకంతతః॥" (కారికావృత్తిః)

తా॥ మన పితరులకు ఫలప్రాప్తినిమిత్తం చేయబడుచున్న శ్రాద్ధకర్మలయందు చేయవలసిన శ్రాద్ధ విధానము ఆరువిధములు :—

౧. దేవలోకమును పొందినవారికి— అగ్నౌకరణం
౨. స్వర్గమును పొందినవారికి— నిమంత్రిత బ్రాహ్మణభోజనం
౩. యమలోకమును పొందినవారికి— పిండప్రదానమున్నూ
౪. నరకములలో నుండినవారికి— వికిరము
౫. భూలోక, భువర్లోకములను పొందినవారికి— భోక్తలకుదక్షిణాలు
౬. అసురలోకములైన అతలాది అధోలోకములను పొందినవారికి— { అనేకమంది బ్రాహ్మణులకు భోజనము పెట్టుట

పైఆరు అంగములచేతను శ్రాద్ధమును పెట్టుటవలన పితృదేవతలు తృప్తిని పొందినవారలై మన తల్లిదండ్రాదులైన జీవులు యేలోక

మందుండురో నాయా లోకములలో వారికి శ్రాద్ధఫలమునిచ్చి వారి కుత్తమగతులు కలిగించెదరు. గనుక పితరులను గురించి శ్రాద్ధములు చేయుట మానరాదు. శ్రాద్ధములను వదలిన యెడల చనిపోయిన మన బంధువుల కెట్టి యుపకారమును చేయనివారమై కృతఘ్నతా దోష మును పొందుదుము. ఈ విషయమునే శ్రీ భగవద్గీతకూడా చెప్పుచు న్నది. "పతంతి పితరోహ్యేషాం లుప్తపిండోదక క్రియాః"

తా॥ పిండోదకక్రియలు లేనివారై వీరి పితరులు వారివారి స్థానములనుండి భ్రష్టులై అధోగతిని పొందుచున్నారు.—

ఇదిగాక "ఆచారకాండ" యందీవిధముగా చెప్పబడియున్నది — "నచలోకాంతరస్థితస్య మృతస్య జీవస్య ఏకశ్చ్రాద్ధఫలలాభః। సర్వజ్ఞత్వాది సామర్థ్య విశిష్ట వస్వాదిదేవతాః శ్రాద్ధకర్మణి కర్తృభిః పుత్రాదిభిః పిత్రాది అధిష్ఠాతృ రూపేణ ఆరాధితాః సంతః స్వాశ్రి తాన్ పిత్రాదీన్ యత్రకుత్ర స్థితానపి శ్రాద్ధ ఫలేన సంయోజయంతీతి ఉపపత్తేః। కించకర్తౄన్ పుత్రాదీన్ అపిఫలేన ఘటయంతి। యథా మాతాగర్భపోషణాయ అన్యదత్త దోహదాన్నపానాది నాస్వాయ ముప భుంక్తేసాతృప్తాసతి, స్వజఠరగత మపత్యం తర్పయతి। దోహదాన్నప్రదా యినశ్చ ప్రత్యుపకార ఫలేన సంయోజయతితత థైవ అత్రాపి। తస్మాత్ నైమిత్తికాని అపి అవశ్యం కర్తవ్యాని ఏవశ్రేయః కామిభిః ఇతిసిద్ధం॥"

తా॥ "ఈ శ్రాద్ధఫలలాభము, లోకాంతర స్థితుడైన మృతజీవు నికి మాత్రమేకాదు సర్వజ్ఞత్వ సామర్థ్యములుగల వసురుద్రాదిత్య దేవ తలు దేవపితృ స్థానములయం దారాధింపబడుచున్న భోక్తల నావే శించియుండి పూజలను పొందినవారై మృతజీవులే లోకములయందు న్నను, శ్రాద్ధఫలములను వారికి కలుగజేయుదురు. ఇతరుల వలన నీయ బడిన అన్నపానాదులవలన తాను తృప్తిని పొందుటయేగాక గర్భములో నుండిన శిశువు నేవిధముగా గర్భిణీస్త్రీ పెంచుచు తన కన్నపానాదు లిచ్చినవారికి కృతజ్ఞతా సూచకముగా ప్రత్యుపకారమును గలుగజేయు చున్నదో ఆ ప్రకారమే యిచ్చటను సమన్వయించుకోవలెను. అందు వలన శ్రాద్ధకర్మల శ్రేయస్కాముడైనవాడు ఆచరించుచుండవలయును."

# ౨ మర్త్యలోకము

భూలోకము, భువర్లోకము రెండును చేరి మర్త్యలోకమని వ్యవహారము.

అందు భూలోకము:— 1. మహాభూమి అనియు 2. భూగోళము, అనియు రెండు భాగములుగా నున్నది. మహాభూమిని మర్త్యలోకమను పేరునకూడను పిలచెదరు.

ఇందుకు శ్రుతి ప్రమాణము:— (తై॥ బ్రా. కాం. ౧ ప్ర. పా ౧. అను. ౩. మం. ౬)

శ్రుతి:— "ఆపోవా ఇదమగ్రే సలిలమాసీత్। తేన ప్రజాపతి రశ్రామ్యత్। కథమిదం స్యాదితి। సోఽపశ్యత్। పుష్కరపర్ణం తిష్ఠత్॥"

తా॥ ప్రథమమున ఇదంతయు నీరుగానుండెను. తాను సృష్టి చేయుదలచిన (జగత్తునుగురించి) ప్రజాపతి తపస్సు చేసెను. (లేక ఆలోచించెను.) ఆ నీటిమీదవున్న పుష్కర పర్ణమును చూచెను.

"సోఽమన్యత। అస్తివైతత్। యస్మిన్నిదమధి తిష్ఠతీతి। సవరాహోరూపం కృత్వోపన్యమజ్జత్। సపృథివీమధ ఆర్ఛత్। తస్యా ఉపహత్యోద మజ్జత్। తత్పుష్కర పర్ణేఽప్రథయత్। యదప్రథయత్। తత్పృథివ్యై పృథివిత్వమ్"॥ (తై॥ బ్రా. ౧-౧-౩-౬)

శ్రీ విద్యారణ్య భాష్యం:— "సోఽమన్యత ఇత్యాది.

"తచ్చ (తత్ పుష్కర పర్ణం) దృష్ట్వా। మనస్యేవ మతర్కయత్। యస్మిన్నాధార ఇదం సనాళం పద్మపత్ర మధిశ్రిత్యతిష్ఠతి। తద్వస్తు కించిద ధస్తాదస్త్యేవేతితర్కయిత్వా చసప్రజాపతిః వరాహోభూత్వాతదీయం రూపంచ సమ్యక్కృత్వా। తస్యపద్మపత్ర నాళస్య సమీపే జలమధ్యే నిమగ్నోభూత్। మగ్నశ్చాసౌ। అధస్తాత్। భూమిం ప్రాప్తవాన్। తస్యాః। భూమేః సకాశాత్। కియతీమపి ఆర్ద్రాం మృదం స్వదంష్ట్రా ప్రథక్కృత్య। సలిలస్యోపరి ఉన్మజ్జనం కృతవాన్। తచ్చమృద్రూపం తస్మిన్ పుష్కరపర్ణే ప్రసారితవాన్। యస్మాదియం మృత్తికాప్రథితా తస్మాత్ పృథివీనామ సంపన్నం"॥

తా॥ (కాండముతో వున్న) ఆపుష్కర పర్ణమునకు లోపల యొక ఆధార ముండవలెనని తర్కించి ఆ ప్రజాపతి వరాహరూపమును ధరించి పుష్కరపర్ణ సమీపమున మునిగి దిగువనువున్న భూమిని పొందినవాడాయెను. (ఇదియే మహాభూమియని తెలియవలెను) ఆ (మహా) భూమినుండి కొంత తడిమట్టిని తన దంష్ట్రచేత కొట్టి వేరుచేసి నీటి పైభాగమునకు తెచ్చిన వాడాయెను. ఆ మృత్తును ఆ పుష్కర పర్ణమున్నందు ఉంచెను. దేనినట్లు ఉంచెనో అది పృథివీ నామమును పొందెను. (ఇదియే భూగోళము)

మహాభూమినుండి భూగోళము మధ్యకు అయిదుకోట్ల బ్రహ్మాండ యోజనములు దూరము. (1 బ్ర॥ యో॥ $= 30 \frac{10}{33}$ పై చిల్లర యింగ్లీషు మైళ్ళు) పురాణములలో యీ రెంటియొక్క భేదము తెలియునటుల ప్రత్యేకముగా వర్ణనలు కనుపించటంలేదు. క్రీస్తుశక ప్రారంభ కాలమున బైబిలులోని సృష్టి కధనమునకు వ్యతిరేకముగ నుండెడి. యితర లిఖితాధారములనెల్లను క్రైస్తవ పాదరులు నాశనము చేయించిరి. అట్టి గ్రంధములు భారత దేశములో విస్తారము గాగలవని తెలిసి వానిని నాశనముచేయ సంకల్పించి ఐరోపా ఖండమునగల పరస్పర విరుద్ధాభిప్రాయములతో కూడి అన్యోన్య శత్రువులుగా నేర్పడి యొకరినొకరు చంపుకొనుచుండెడి క్రైస్తవ శాఖలన్నియు భారత దేశములోని ప్రాచీన గ్రంధములను నాశనముచేయు తలంపుతో యేకమై భారత దేశమునకు తమ యేజంట్లను పంపి యిచ్చట వారి శాఖలను స్థాపించి అనేక ప్రాచీన గ్రంధములను ప్రోగుచేసి తగులబెట్టిరి. పురాణ వ్రాత ప్రతులను సంపాదించి అందు మధ్యమధ్య కొన్ని భాగముల తొలగించి వాటికి సమన్వయము కుదరనట్లుగా చేసిరి. హూణులు, మహమ్మదీయులు చెలరేగి అనేక గ్రంధభాండారము లగ్నికాహుతి జేయుబడినవి. ఆ పిమ్మట ఈస్టిండియా కంపెనీవారి పరిపాలన ప్రారంభకాలమున నాయుద్యమము తిరిగి ప్రారంభించి మన దేశములోని పురాణ వ్రాతప్రతులను తమ రాజకీయాధికారమును, పలుకుబడిని యుపయోగించి సంపాదించి వాటిని కాపాడు నెపమున వాటియందు కొన్ని శ్లోకము లచ్చటచ్చట

తీసివేయబడియు కొన్నిచోట్ల అక్షరములు పొల్లులు మార్చబడియు
అర్థభేదము కలుగునట్లును, పరస్పర విరుద్ధముగా నుండునట్లును, కొన్ని
చోట్ల విషయ సమన్వయము కుదరకుండు నట్లొనర్పబడిన దనెడి ప్రవా
దము గలదు. దీనికితోడు ప్రతులు వ్రాయువారికి పురాణములలోని
విషయ సమన్వయ జ్ఞానము లేనందువలన వారి బుద్ధికి సమన్వయము
కుదరనిచోట్ల సవరణలు చేయుటవలనను, వ్రాత పొరబాట్లవలనను
లోపము లేర్పడి పురాణములలోని విరుద్ధార్థములకు అవకాశము కలిగి
నది. మహాభూమి, భూగోళములను, నారెంటియందునుగల జంబూ
ద్వీపముల వర్ణనలయందును యీ దోషము కనుపించుచున్నది. అందు
మహాభూమియని చెప్పబడిన శ్లోకములే తీసివేయబడినవి. అందువలన
వ్రాయువారికిని, ప్రథమముద్రణకాలమందు గ్రంథమును పరిశీలించిన
వారికిని సమన్వయము కుదరనందున యెట్లో అతుకులుపెట్టి మహాభూమి,
భూగోళముల తేడాలు తెలియకనే రెంటిని యొక ముద్దగాచేసి యొక
దానికే సరిపుచ్చిరి. భూగోళాధ్యాయమున యీ రెండువర్ణనలు కను
బడుచున్నందున రెండును పరస్పరవిరుద్ధములుగ దోచుచున్నవి.
భూగోళమును వర్ణించునపుడు మహాభూమికి చెప్పబడిన పంచాశత్కోటి
విస్తీర్ణము కనుబడును. పంచాశత్కోటియనగా యేబదికోట్ల యోజన
ములు విస్తీర్ణమని అర్థము. యేబదికోట్ల యోజన విస్తీర్ణము మహా
భూమిదిగాని భూగోళముది కాదు. ఈమహాభూమి, భూగోళముల తేడా
లను తెలిపెడి భాగమును క్రైస్తవశక ప్రారంభ శతాబ్దములలోనే
పురాణగ్రంథములనుండి తొలగించినటుల కనుపడుచున్నది. జ్యోతిష
సిద్ధాంతులుకూడను వీటికి సమన్వయము కుదరనందున మన అల్పత్వ
మును తెలుసుకొనుటకుగాను పురాణములలో భూగోళము యేబదికోట్ల
యోజనములు విస్తీర్ణముగానున్నటుల చెప్పబడినదని పురాణములను
సమర్థించుటకుగాను సమన్వయమును వ్రాసిరి. కాని మహాభూమి
యొకటి వేరుగానున్నటుల వ్రాసియుండినవారుకారు. పురాణములను
జాగ్రత్తగా పరిశీలించగా మహాభూమియొక్క వర్ణనయు, భూగోళ
వర్ణనయు రెండును ఒక్క భూగోళమునకే వర్తించునటుల గనుపడును.

ఈ రెండును పరస్పర విరుద్ధములు. మహాభూమి భూగోళముల భేదము వివరింపబడిన శ్లోకములందుండి తీసివేయబడినట్లు మనకు స్పష్టముగా గోచరించును. గనుక యిప్పుడు పురాణములలో మనకు గోచరించు చున్నవిధమున రెండు వర్ణనలు విడివిడిగా వ్రాసిచూచిన భూగోళము గాక యేబదికోట్ల విస్తీర్ణముగలిగినట్టిన్ని, లక్షయోజన విస్తీర్ణముగల జంబూద్వీపములోగూడి, నవఖండములుగా విభజింపబడినట్టిన్ని మనువులకు భూలోకఋషులకు నివాసస్థానమైనట్టిన్ని యొకభూభాగము మన భూగోళమునకు దక్షిణముగానున్నటుల గోచరించును. దానికి సంబంధించిన వివరములు యీ గ్రంథములో సమగ్రముగా నీయబడినవి. చూడుడు- మహాభూమియను పేరుమాత్రము మనకు పురాణములలో దొరకదుగాని, దాని విస్తీర్ణము, అందుగల సప్తద్వీపములు, సముద్రములు విస్తీర్ణములతోసహానున్నూ, అందలి ప్రతిద్వీపములోని ఖండ విభాగములు, పరిపాలించెడి రాజులు అందందుగల ప్రజలు, వారిలోని భేదములు, అచ్చట పర్వతములు, నదులు, అరణ్యములు మొదలుగా గల వివరములన్నియు పురాణములలో ప్రత్యేకముగా వర్ణింపబడి యున్నవి. భూగోళముమీదగలవని వర్ణింపబడినవానికి, మహాభూమి మీద వర్ణింపబడినవానికి చాలా తేడాగలదు. రెంటికి యెట్టిసంబంధము లేదు. పురాణములలో నష్టమైపోయినను వేదములో "మహాభూమి" యొక్కటిగలదను విషయము మనకు స్పష్టముగా దెలియుచున్నది. ఆ మంత్రము యీ ప్రకరణ ప్రారంభమున విద్యారణ్య భాష్యములో సహా వ్రాయబడినది.

భారతదేశమున క్రైస్తవపాదరులాచరించిన దుర్మార్గమును గురించి "లూయిజకోలియటు" అను ఫ్రెంచి విద్వాంసునిచే లోగడ శతాబ్దములో వ్రాయబడిన వాక్యములిక్రింద నీయబడినవి.

"The Rev. Fathers, Jesuits, Fransiscans, Sranger missions and other Corporations unite with touching harmony in India to accomplish a work Vandalism, which it is right to denounce as well as to the learned

world as to orientalists. Every Manuscript, every Sanskrit work that falls into their hands is immediately condemned and consigned to flames. Needless to say that the choice of these gentlemen always falls from preference upon those of highest antiquity, and whose anthenticity may appear incontestable.............

Every new arrival receives a formal order, so to impose of all that may fall into his hands. Happily, Happily the Brahmins do not open to them the secret stores of their literary wealth, philosophic and religious."

(Vide Louise Jaccoliot's "Bible Lelndi" and Vide mr. N. Chidambara iyar's Varahamihira's Brihat-Samhita, English translation, Introduction P. 2. foot note.)

తా॥ పవిత్రులైన క్రైస్తవ ఫాదరీ సంఘమువారును, జెసూయిటు సంఘమువారును, ఫ్రాన్సిస్కేన్స సంఘమువారును, శ్రాంగరుమిషను మొదలుగాగల క్రైస్తవమత సంఘములువారును పరస్పర మతద్వేషులైనను అందరును ఏకకార్యోన్ముఖులై భారత వర్షములోని ప్రాచీనమత గ్రంధములను, యితరములైన మతదృష్టాంతరములనున్నా నాశనము చేయుటకు దురుద్దేశ్యముతో యేకీభవించిరి. ఈ దురాగతము ఆశియా ఖండపు ప్రాచీన వాజ్మయ పరిశోధకులైన పాశ్చాత్య పండితులచే మాత్రమేగాక ప్రపంచములోని పండితులందరిచేతను గర్హింపతగినది. ఈ దురాగతులవలన భారత వర్షములో వారిచేతికి జిక్కిన ప్రతి ప్రాచీన వాజ్మయ సంబంధవ్రాత ప్రతియు, ప్రతి సంస్కృత గ్రంధము నిషేధింపబడి అగ్నికాహుతి చేయబడినవి. నిర్దిష్టమైన ప్రమాణ గ్రంధముగా నంగీకరింపదగిన అధిక ప్రాచీన గ్రంధములనన్నింటిని తగులబెట్టుటయే నీపెద్దమనుష్యుల ముఖ్యాశయము. క్రైస్తవ

మత ప్రచారమునకు భారత దేశమునకు పంపబడు ప్రతివానికిని వానికి భారత దేశములో చేతికందిన ప్రతి ప్రాచీన గ్రంధమును తగులబెట్ట వలసినదిగా యుత్తరువులు చేయబడి పంపబడుచుండిరి అదృష్టవశమున భారత దేశములోని బ్రాహ్మణులు తమ వేదవేదాంగాద్యులైన మత గ్రంధములనుగాని, వారి బహుళతత్త్వ శాస్త్రాదులనుగాని యీ దుష్టుల కందనీయక కాపాడుకొనుట పరమానంద దాయకము, అని వ్రాసియున్నాడు.

## ౧. మహాభూమి లేక మర్త్యలోకము



(౧౪ వ పటము)

వలన కొన్ని గ్రంథములలో అతలాది యధోలోకములలో చేర్చిన్ని కొన్నిటిలో భూలోకముగా (భూగోళసహితమైన దానినిగా)ను వర్ణింప బడియున్నది. దీనిని మర్త్యలోకమని కూడా పిలచెదరు. ఈ మహా భూమిమీదనే సప్తసముద్రములును సప్తద్వీపములును గలవు. పురాణ ములలో పంచాశత్కోటి (అనగా యేబదికోట్ల) విస్తీర్ణ భూమండల మని వర్ణింపబడినదిదియే. లక్షయోజన విస్తీర్ణ 'జంబూద్వీపము' దీని యందే గలదు.

మర్త్యలోకము లేక మహాభూమికి మధ్య ప్రదేశమున లక్ష యోజనములు విశాలముకలదై జంబూద్వీపమనియెడు నొకద్వీపము గలదు. ఆ జంబూద్వీపము, నడుమప్రదేశమందొకటియు, ప్రాగా ద్యష్ట దిశలయందెనిమిదియు వెరశి తొమ్మిది ఖండములుగా విభజింప బడియున్నది.

(నె 4 వ పటమును చూడుడు)

## జంబూద్వీప నవఖండములు అందు నివసించేడి జీవులు

| | |
|---|---|
| ౧. దైవఖండము | ౧. దేవతలు |
| ౨. గభస్త్య ఖండము | ౨. భూతములు |
| ౩. పురుష ఖండము | ౩. కిన్నరులు |
| ౪. భరత ఖండము | ౪. మానవులు |
| ౫. శరభ ఖండము | ౫. సిద్ధులు |
| ౬. గంధర్వ ఖండము | ౬. గంధర్వులు |
| ౭. తామ్ర ఖండము | ౭. రాక్షసులు |
| ౮. శేరు ఖండము | ౮. యక్షులు |
| ౯. ఇందు ఖండము | ౯. పన్నగులు |

పైవిషయమును గురించిన ప్రమాణ వచనములు:—

బ్రహ్మాండపురాణం—ప్రథమాధ్యాయం—అగస్త్యం ప్రతిహయగ్రీవోక్తిః

శ్లో॥ "తజ్జంబూరతి విస్తీర్ణా సర్వభోగైశ్చ సమ్మితా।
మధ్యాది పూర్వమారభ్యవిభక్తా నవధాక్రమాత్।
దైవంగ భస్త్యంపురుషం భరతం శరభం తథా।
గంధర్వ తామ్రమ శేరూచాప్యైం దవంహినవాదితః॥
నవస్వే తేషు ఖండేషు దేవా భూతాశ్చకిన్నరాః।
మానవాస్సిద్ధ గంధర్వా రాక్షసా యక్ష పన్నగాః॥
తత్తద్గణాధి పాశ్చైవ పరివారగణైస్సహా।
భుంజానా వివిధాన్ భోగాన్ స్వస్వకర్మ సముద్భవాన్॥

అంశులోననే పంచమాధ్యాయములో:-

మేరోస్తు యామ్యదిగ్భాగే భూమామ్యాం వైవస్వతో మనుః।
మానవైశ్చ సమాకీర్ణో భూబుషి ప్రవరైర్యుతః॥
భరతాఖ్య పురేరమ్యే తత్ర వైవస్వతస్థితిః"॥

పైశ్లోకములలో మహాభూమిమీదగల జంబూద్వీపములోని నవఖండ విభాగము చెప్పబడినది. ఆ జంబూద్వీపమునకు దక్షిణముగా నున్న భరతఖండములోని భరత పురమున వైవస్వతమనువు భూబుషు లతోడను, మానవులతోడను నుండియున్నటుల చెప్పబడినది మహా భూమిమీది జంబూద్వీపమునకును భూగోళముమీది జంబూద్వీపము నకును విశేష భేదముగలదు.

## ౨ మహాభూమిమీది జంబూద్వీపము

౧. లక్ష బ్రహ్మాండయోజనముల విస్తీర్ణము. మిగతా మహా భూమిమీద గల ద్వీపములకన్న చిన్నది.

౨. భరతఖండమున మానవులతోను భూబుషులతోడను గూడి వైవస్వత మనువు నివసించును. యింకను మిగతఖండములలో దేవయోనులైన వారలును నివసించెదరు.

౩. ఈ ద్వీపములోని విభాగములకు ఖండములని పేరు.

౪. ఇచ్చట శీతోష్ణాదులు హెచ్చుగా నుండక నీరెండవలె నుండి సదా వెల్తురు గలిగియుండును. దివారాత్రి భేదము లేదు.

భూగోళముమీది జంబూద్వీపము ౧. నాలుగువందల పన్నెండున్నర బ్రహ్మాండ యోజనములు విస్తీర్ణము లేక 2544. 45 చిన్నయోజనములు. మిగతా భూగోళముమీద ద్వీపములకన్న పెద్దది.

౨. ఇచ్చట భరతవర్షమున వేదోక్తకర్మలనాచరించెడి మానవులు నేటివరకును నివసించుచున్నారు. మిగత వర్షములలో పుణ్యఫలముల ననుభవించుచుండెడి యితర వర్గములు సృష్ట్యాదియందు నివసించిరి. ఇప్పుడు క్రమక్రమముగా మానవులలో వేద బాహ్యులైన వారలు వసించుచుండిరి.

౩. ఈ ద్వీపములోని విభాగములకు వర్షములని పేరు.

౪. శీతోష్ణాదులు హెచ్చుగా గలిగియుండును. దివారాత్రము లుండును.

మహాభూమియందలి నవఖండముల యందుగల జీవులకు అధికార పురుషులున్నూ, సిద్ధఋషులున్నూ వారివారి గణములకు అధిపతులు మొదలైన సమస్తమైనవారును సపరివారులై వారివారి కర్మఫలానుసారము భోగముల ననుభవించుచు ఆనందముతో కాలము పుచ్చుచుందురు. అచ్చట భరతఖండము నందుండెడి భరతపురమున వైవస్వతమనువు భూఋషులతో గూడుకొని సపరివారుడుగా నివసించుచున్నాడు. అదే పేరుతో మనము నివసించెడి యీ భూగోళ సమమధ్యనుండెడి నిరక్షరేఖ కుత్తరభాగము (అనగా ఉత్తరార్ధ భూగోళము)ను జంబూద్వీపమునిన్నీ అందీకర్మభూమియైన భరతవర్షములో సింధునదికి తూర్పున వైదిక ధర్మానుసారులైన ఆర్యులు నివసించుచుండిన ఆసేతుహిమాచలము గాగల భూమిని భరతఖండమనిన్నీ వ్యవహరించుకొనుచున్నాము. ప్రాచీన భారతవర్షములో చేరి వైదికధర్మ దూరులైన

వారలు నివసించుచుండిన సింధు నదికి పడమరగల భూమికి మ్లేచ్ఛ స్థానమని పేరు. మన భూగోళము మహాభూమిమీదనున్న జంబూ ద్వీపమునకు పైన (ఉత్తరముగా) ఐదుకోట్ల యోజనముల దూరము నందున్నదని లోగడ తెలిపియున్నాము. భూలోకమనగా మహా భూమియు, భూగోళమును కలిపిన మొత్తం భూమి యావత్తును చేరియున్నది.

మహాభూమి మీదనున్న జంబూ ద్వీపము చుట్టును, యొక సముద్రమును, అదే తీరున ఆ సముద్రమునుచుట్టి యొక ద్వీపమును నెం. 3 రు పటమున జూపబడిన ప్రకారముగా సప్తద్వీపములు, సప్త సముద్రములును, యొకదాని నొకటిచుట్టికొని యున్నవి. వీటికి వెలపట చలాచల, చక్రవాళ, లోకాలోకములను మూడు పర్వతములుచుట్టు కొని యెగువను స్వర్గలోకము వరకు పోయియున్నవి. ఈ లోకాలోక పర్వతమునకు పిమ్మట సూర్యరశ్మి చొరనందున యెల్లప్పుడును చీకటితో కప్పబడియుండెడి 'తమోభూమి' చుట్టును, చేరియున్నది. ఆ తమోభూమిని దాటగానే 'అండభిత్తి'యనెడు కోటి యోజనముల మందముగల యొక స్వర్ణమయమగు గోడ బ్రహ్మాండమంతయు నావరించుకొని కోడిగుడ్డుకు చుట్టూ కప్పుకునియుండే పెంకువలెనే యున్నది. అందుగల ద్వీపసముద్రాది నామములున్నూ, వాటి విశాలములున్నూ పటమున చూపబడినవి. (నెం. 3 రు పటమును చూడుము.)

## 3. మహాభూమి స్థితద్వీప సముద్రములు

(నెం. 3 రు పటమును చూడుము)

బ్రహ్మాండ మధ్యమున దక్షిణమునుండి ఉత్తరముగా సుస్పష్టముల నూహింపబడిన మేరు రేఖనుండి మహాభూమిమీద తూర్పునగల అండభిత్తికిగాని లేక పడమరగల అండభిత్తికిగాని యేదియోయొక వైపుకు గలిగియుండిన కొలత 25 కోట్ల బ్రహ్మాండ యోజనములుదాని లెఖ్ఖ చూపబడుచున్నది. రెండువైపుల లెఖ్ఖ కలుపుకొనగా పంచా శత్కోటి (యేబదికోట్లు) విస్తీర్ణ భూమండలం అనుదానికి సరిపోవును.

| | | |
|---|---|---|
| ౧. జంబూద్వీపము | (౧) | లక్ష యోజనములు |
| ౨. లవణ సముద్రము | (౨) | ,, |
| 3. ప్లక్షద్వీపము | (3) | రెండు లక్షల యో॥ |
| ౪. ఇక్షురస సముద్రము | (౪) | ,, |
| ౫. కుశద్వీపము | (౫) | నాలుగు లక్షల యో॥ |
| ౬. సురాసముద్రము | (౬) | ,, |
| ౭. క్రౌంచద్వీపము | (౭) | ఎనిమిది లక్షల యో॥ |
| ౮. సర్పిసముద్రము | (౮) | ,, |
| ౯. శాకద్వీపము | (౯) | పదిహారు లక్షల యో॥ |
| ౧౦. దధిసముద్రము | (౧౦) | ,, |
| ౧౧. శాల్మలీద్వీపము | (౧౧) | ముప్పది రెండులక్షల యో |
| ౧౨. క్షీరసముద్రము | (౧౨) | ,, |
| ౧3. పుష్కరద్వీపము | (౧3) | అరవదినాలుగు ల॥ యో |
| ౧౪. శుద్ధజలసముద్రము | (౧౪) | ,, |
| ౧౫. చలాచల పర్వతము | (౧౫) | ౧౨౮ ల॥ యో॥ |
| ౧౬. చక్రవాళ పర్వతము | (౧౬) | ౨౫౬ ల॥ యో॥ |
| ౧౭. లోకాలోక పర్వతము | (౧౭) | ౫౧౨ ల॥ యో॥ |
| ౧౮. తమోభూమి | (౧౮) | ౧౨౫౦ ల॥ యో॥ |

లోకాలోక పర్వతమునుదాటి సూర్యరశ్మి చొరనందున లోకాలోక పర్వతమునకును అండభిత్తికిని నడుమనుండెడి ప్రదేశ మెల్లపుడు చీకటితోనుండును.

| | | |
|---|---|---|
| ౧౯. అండభిత్తి | (౧౯) | ఒకకోటి యో॥ మందము. |

మహాభూమియందున్న జంబూద్వీపముతో కలుపుకొని మహా భూమియొక్క విశాలము అనగా తూర్పునుండి పడమరకు, ఉత్తరము నుండి దక్షిణమునకు కొలత యేబదికోట్ల యోజనములు.

ఇందుకు ప్రమాణవాక్యములు :

బ్రహ్మాండపురాణం – పంచమాధ్యాయం.

శ్లో॥ "సర్వలోక ధరాక్రాంతో లోకాలోకాఖ్యపర్వతః ।
తతఃపరంతుతన్మధ్యే చక్రవాళ ప్రకాశతే॥

శ్లో॥ చలాచలాది స్తస్మాద్ధి పరంపరమభాస్వరః ।
తతోనంతరదేశేతు శుద్ధ శుద్ధ జలార్ణవః ॥

శ్లో॥ జలార్ణవా వ్యవహితం పుష్కరద్వీపముత్తమం ।
పుష్కరానంతరస్థానే వర్తతే క్షీరసాగరః॥

శ్లో॥ తస్మాత్పరం మహాభాగద్వీపం శాల్మలి సంజ్ఞకం ।
దధ్యర్ణ వస్తు తత్పశ్చాచ్ఛాకద్వీపం తతః పరం॥

శ్లో॥ తత ఆజ్యార్ణవోజ్ఞేయో యదంతే క్రౌంచసంస్థితః ।
క్రౌంచద్వీపానంతరే తుసురాయాస్సాగరస్తతః॥

శ్లో॥ కుశద్వీపంతు విజ్ఞేయం తత్పశ్చాదిక్షుసాగరః ।
పశ్చాత్తస్యతుంభాగే వై ప్లక్షద్వీపం విరాజతే॥

శ్లో॥ ప్లక్షానంతరతో విప్ర యఆస్తే లవణార్ణవః ।
తస్యావ్యవహితస్థానే జంబూద్వీపం ప్రకాశతే॥

శ్లో॥ ఏవం ద్వీపసముద్రైస్తు శోభితేయం మహామునే ।
పంచాశత్కోటి విస్తీర్ణావర్తతే కూర్మపృష్ఠవత్ ॥

శ్లో॥ లక్ష యోజనమాత్రేణ జంబూద్వీపం తుగణ్యతే ।
తథాద్విగుణ వృద్ధ్యాతుగణనే కుంభ సంభవ॥

శ్లో॥ ద్వీపాబ్ధి సమసంఖ్యాకై ర్యోజనై స్తత్రలక్ష్యతే ।
తత్ర పంచోత్తరావింశత్కోటయస్తు కుభాగగాః॥

శ్లో॥ శిష్టాస్సర్వేతమో భూమ్యాం నిర్ణీతా వై సమాసతః॥"

మహాభూమిమీద శీతోష్ణాదులు హెచ్చుగా లేకయుండు ననియు, దివారాత్ర కాలభేదములేక యెల్లప్పుడును సాయంసమయ వెలుతురును గలిగియుండుననియు చెప్పబడినది—

కాశీఖండము ౨ర అధ్యాయములో

శ్లో॥ "దివార్క-రశ్మయోయత్ర ప్రభాంతన్వంతినాతపం।
శశినశ్చన శీతాయ శిద్యోతాయ కేవలం॥
శ్లో॥ యత్రనజ్ఞాయతే కాలో గతోపిదనుజాదిభిః॥"

పై ప్రమాణములననుసరించి మహాభూమి యనునది మనము నివసించుచుండిన ఈభూగోళమునకు అయిదుకోట్ల బ్రహ్మాండయోజనములు (1 బ్ర॥ యో = $30\frac{10}{33}$ యింగ్లీషు మైళ్ళగును) దిగువనున్నది. సప్తసముద్రములు, సప్తద్వీపములు మహాభూమియందుండియున్నవి. ఆవిధముననే మన భూగోళముమీద నిరక్షరేఖకు దక్షిణమున లవణసముద్రమును, దానిని చుట్టి ఆరు ద్వీపములున్నూ, ఆరు సముద్రములున్నూ సృష్టి ప్రారంభకాలమున యేర్పడియున్నవి. పిమ్మట కాలమందవి నష్టమై లవణ సముద్రముచే నాక్రమింపబడి నామమాత్రావశేషమైనందున మనకిప్పుడు లవణ సముద్రముతప్ప యితరమేదియు గాన్పించుటలేదు. మహాభూమిమీద సప్తసముద్రములు, ద్వీపములు జంబూ ద్వీపముతో ప్రారంభమై యొకదాని కొకటి రెట్టింపుగానుండును. మన భూగోళము మీద సప్తసముద్ర ద్వీపములొకదానికంటె నొకటి చిన్నవిగానుండును. మహాభూమిమీద జంబూద్వీపము, ఉప్పు సముద్రము మిగత ద్వీప సముద్రములకన్న చిన్నది. భూగోళముమీద గల జంబూ ద్వీపము, ఉప్పు సముద్రము మిగతావానికన్న చాలా పెద్దది. ఈ భూగోళముమీద మనకు కనపడనందున వాటిని లేవనిగాని, అవి పురాణగాధలనిగాని నిరసత్యభావతో జూడరాదు. మన పురాణములు అసత్యకల్పనలతో నింపబడినవికావు. బహు పురాతన విషయములనుగూర్చి చెప్పునవైయున్నందున అల్పజ్ఞులమైన మన యూహలకందనంతమాత్రమున త్రోసివేయరాదు. వేదమునందుగూడను వాటిని గురించి వినబడుచునే యున్నది. ఇదిగాక జ్యోతిస్సిద్ధాంతగ్రంథములయందును శాస్త్రజ్ఞులు చెప్పియున్నారు. మనకు ప్రత్యక్షముగా కనుబడనివన్నియు లేవని చెప్పెడి వాదనలన్నియు కూపస్థమండూకన్యాయముననుసరించి అజ్ఞాన విలసితములని చెప్పవలసియున్నది. శాస్త్రములలో జెప్పిన చొప్పున నియమబద్ధుడై యోగాభ్యాసమొనర్చి తగిన ఆధ్యాత్మికశక్తుల నలవర్చుకొనిన ప్రత్య

క్షముగానే యావద్బ్రహ్మాండమును జూడగలుగుటయేగాక సృష్టిలోని యిట్టి యనేక బ్రహ్మాండములనుగూడను జూడగలుగుదురు. మన శాస్త్రములు దేనిని గ్రుడ్డితనముగా నమ్ముమని చెప్పవు. ప్రత్యక్షముగా జూచుటకు తగిన మార్గముల ననుగ్రహించుచున్నవి. ఆ ప్రకారము చూడ నేర్పుగలవారు చూడవచ్చును. అందు కసమర్థులైనవారు, అర్హులై చూడనేర్చినవారు చూచి చెప్పిన పెద్దలవాక్యములననుసరించుటయే శ్రేయము.

# ౪ మహాభూమి స్థితసప్త ద్వీప విశేషవిషయములు

| ౧<br>ద్వీపముల పేర్లు | ౨<br>పరిపాలించిన ప్రథమచక్రవర్తి | ౩<br>వర్ష విభాగములు | ౪<br>ప్రథమ రాజులు | ౫<br>పర్వతములు | ౬<br>నదులు | ౭<br>చాతుర్వర్ణ్యముల పేర్లు | ౮<br>అరాధితదైవము |
|---|---|---|---|---|---|---|---|
| ౧. మహాభూమి స్థితజంబూద్వీపం. | స్వాయంభువు మనువుకుమారుడు ప్రియవ్రతుడు - జ్యేష్ఠ భార్యా బర్హిష్మతి. కుమాళ్లు 7 గురు. ఏడు ద్వీపములకు అధిపతులైరి. జ్యేష్ఠుడు. యాగ్నీధ్రుడు - ప్రథమ చక్రవర్తి. | నవఖండముఉలుగా విభాగింపబడినది. నెరరు పటమును చూడుము. | | | | | |
| (మహాభూమి మీది)<br>౨. ప్లక్షద్వీపం. | మేధాతిథి. (ప్రియవ్రతుని రెండవకుమారుడు) యితనికి కుమార్లు | ౧ శాంతహయవ॥<br>౨ శిశిర వర్షం<br>౩ సుఖోదయ ,,<br>౪ ఆనంద ,, | వర్ష నామములు రాజనామముల వలననే కలిగినవి. వర్షశబ్దమును | ౧ గోమేధ<br>౨ చంద్ర<br>౩ నారద<br>౪ దుందుభి | ౧ అనుతప్త<br>౨ శిఖి<br>౩ విపాప<br>౪ త్రిదివ | ౧ ఆర్యక<br>౨ కురర<br>౩ విందక<br>౪ భావిన | చంద్రాకృతిగానుండు విష్ణువారాధిత దైవము |

| ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ |
|---|---|---|---|---|---|---|---|
| | ౭ గురు. | ౫ శివ ,,<br>౬ క్షేమక ,,<br>౭ ధ్రువ ,, | మినహాయించిన రాజనామమగును | ౫ సోమక<br>౬ సుమనో<br>౭ వైభ్రాజ<br>యింక ననేకములు గలవు. | ౫ క్లమ<br>౬ అమృత<br>౭ సుకృత<br>యింక ననేకములు గలవు. | | |
| మహాభూమి మీద ౩ శాల్మలద్వీపము. | వపుష్మంతుడు (ప్రియవ్రతుని మూడవ కుమారుడు.) | ౧ శ్వేత వర్షము<br>౨ హారిత ,,<br>౩ జీమూత ,,<br>౪ రోహిత ,,<br>౫ సుప్రభ ,,<br>౬ వైద్యుతి ,,<br>౭ మానస ,, | వర్షనామములే రాజనామములు | ౧ కుముద<br>౨ ఉష్ణ<br>౩ వలాహక<br>౪ ద్రోణ<br>౫ మహిష<br>౬ కంక<br>౭ కకుద్వంత | ౧ యోనిజ<br>౨ తోయ (లేక) యమాయామి<br>౩ వితృష్ణ<br>౪ చంద్ర<br>౫ శుక్ర<br>౬ నిర్వీర్య<br>౭ విమోహి | ౧ కపిలవర్ణ<br>౨ చారుణకవర్ణ<br>౩ పీతవర్ణ<br>౪ కృష్ణవర్ణ | విష్ణువు |
| మహాభూమి మీద ౪ కుశద్వీపము. | జ్యోతిష్మంతుడు (ప్రియవ్రతుని నాల్గవ కుమా | ౧ వేణుమాలవర్షం<br>౨ లంబన ,,<br>౩ ఉద్భిద ,, | డిటో | ౧ విద్రుమపర్వతం<br>౨ ద్యుతిమంత<br>౩ ఆదిత్య | ౧ శరా<br>౨ విధూతలేకపాప<br>౩ పవిత్ర | ౧ దమి<br>౨ శుష్మిణ<br>౩ స్నేహ | బ్రహ్మ |

| ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ |
| --- | --- | --- | --- | --- | --- | --- | --- |
| | రుడు.) | ౪ స్వైరథ ,,<br>౫ కపిల<br>౬ విధృతి<br>౭ భానుకర | డిటో | ౪ పుష్పవంత<br>౫ కుశాద<br>౬ హారానంద<br>౭ మందరాచల | ౪ సుమతి<br>౫ పాపహార<br>౬ హైమవతి<br>౭ విద్యుదంభ | ౪ మందేహ<br>దైత్య, దానవ, దేవ, గంధర్వ, యక్ష, సిద్ధసాధ్యాదులందరా దీవియందన్యోన్య స్నేహంబున వర్ణసంకరంబు లేక సంచరించుచుందురు. | బ్రహ్మ |
| మహా భూమి మీది<br>౫ క్రౌంచ ద్వీపము. | ద్యుతిమంతుడు<br>(ప్రియవ్రతుని అయిదవ కుమారుడు.) | ౧ మనోనుగవర్షం<br>౨ ఫివర ,,<br>౩ ఉష్ణ ,,<br>౪ అంధకార ,,<br>౫ ముని ,,<br>౬ కాళల ,,<br>౭ దుందుభి ,, | వర్ష నామములే రాజనామములు | ౧ క్రౌంచపర్వతం<br>౨ వామన<br>౩ అంధకార<br>౪ హాయ<br>౫ రక్త<br>౬ దివ<br>౭ పుండరీక | ౧ ఖ్యాతి<br>౨ కుముద్వతి<br>౩ గౌరి<br>౪ మనోజవ<br>౫ సంధ్యా<br>౬ రాత్రి<br>౭ ప్రపుండరీక | ౧ పుష్కర<br>౨ పుష్కల<br>౩ ధన్య<br>౪ తిష్య | రుద్రుడు |

| ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ |
|---|---|---|---|---|---|---|---|
| మహాభూమి మీది ౬ శాక ద్వీపం. | హవ్యుడు (ప్రియ వ్రతుని ఆరవ కుమారుడు) | ౧ జలద వర్షం<br>౨ కుమార ,,<br>౩ సుకుమార ,,<br>౪ మరీచక ,,<br>౫ కుసుమోద ,,<br>౬ సుమోద ,,<br>౭ మహాద్రుమ ,, | డిటో<br>డిటో | ౧ ఉదయపర్వతం<br>౨ జలధర ,,<br>౩ రైవత ,,<br>౪ అంభో ,,<br>౫ అంబికేయ ,,<br>౬ రమ్య ,,<br>౭ కేసరీ ,, | ౧ కుమారీనది<br>౨ సుకుమారీనది<br>౩ నలినీనది<br>౪ వేణుకి నది<br>౫ ఇక్షువు నది<br>౬ ధేనుక నది<br>౭ గభస్తి నది | ౧ మంగ<br>౨ మాగధ<br>౩ మానస<br>౪ మంద<br>మనుష్యులు ధర్మం బాగా నిపాతక మెరుగరు. అన్యోన్య వైరంబులు లేవు. వర్ణ సంకర మెరుగరు. | సూర్య భగవానుడు |
| మహాభూమి మీది ౭ పుష్కర ద్వీపము. | సవనుడు (ప్రియ వ్రతుని యేడవ కుమారుడు.) | ౧ వీరశేక మహా పీత వర్షము<br>౨ ధాతకీ ,, | ౧ మహావీర<br>౨ ధాతక | మానసోత్తర పర్వతం | నదులు లేవు. | వర్ణములులేవు. అందరు దేవతల వలె రోగ, శోకజరాదులు లేకుండురు. | బ్రహ్మ |

# ౪. బ్రహ్మాండయోజన వివరం

బ్రహ్మాండ పురాణములో చెప్పబడిన ప్రకారము పౌరాణిక యోజన వివరముల దిగువనిచ్చుచున్నాము. శ్రీమద్రామాయణము లోని యోజనముయొక్క కొలతకును దీనికి నత్యంత తారతమ్యము గలదు. రామాయణములోని యోజనమనగా ఐదు ఇంగ్లీషుమైళ్ళకు తక్కువ. ఈ కొలత మన భూమిమీద ప్రదేశమును కొల్చునది మాత్రం. బ్రహ్మాండ పురాణములోని యోజనమనగా ముప్పది యింగ్లీషుమైళ్ళ అయిదువందల ముప్పదిమూడు గజముల వక అడుగు అగును. ఈ కొలమానము బ్రహ్మాండమును కొలుచునది. ఆ వివరము బ్రహ్మాండ పురాణములో నిట్లు చెప్పబడినది.

| | |
|---|---|
| బాహ్యదృష్టికి జూడరాక భావమందు యూహామాత్రముచే గ్రహింపబడు సూక్ష్మమైన లేక సూర్యరశ్మిలో కనబడు సూక్ష్మ రజోరేణువు. | ౧ పరమాణువు |
| ౮ పరమాణువులు | ౧ త్రసరేణువు |
| ౮ త్రసరేణువులు | ౧ రథరేణువు |
| ౮ రథరేణువులు | ౧ వాలాగ్రము |
| ౮ వాలాగ్రములు | ౧ లిక్ష |
| ౮ లిక్షలు | ౧ యూక |
| ౮ యూకలు | ౧ యవ |
| ౮ యవలు నిలువుగా జేర్చిన | ౧ అంగుళం |

ఇది రెండున్నర యింగ్లీషు అంగుళములగును—

౧౨ అంగుళములు = ౧ వితస్తి (=౨½ యింగ్లీషు అడుగులు or 2½ feet)

౨౧ వితస్తులు = ౧ రత్ని (=17½ యింగ్లీషు గజములు)

౨౪ అంగుళములు = ౧ హస్తము (అయిదు యింగ్లీషు అడుగులు)

౪౨ అంగుళములు = ౧ కిష్కువు (యెనిమిది అడుగుల 9 యింగ్లీషు అంగుళములు)

౯౬ అంగుళములు = ౧ ధనస్సు లేక (చాపము) (=యిరువది యింగ్లీషు అడుగులు)

౨ ధనుస్సులు (లేక చాపములు) = ౧ నాళి

30 చాపములు = ౧ నల్వము

౨000 (రెండువేలు) చాపములు = ౧ గవ్యూతి

౮000 (యెనిమిదివేలు) చాపములు లేక (ఒకలక్ష అరువదివేల ఇంగ్లీషు అడుగులు) = ౧యోజనము { 30 మైళ్ళ 533 గజముల 1 అ॥ యింగ్లీషు మైళ్లు. అనగా $30\frac{10}{33}$ యి. మై.

౧000 (వేయి) యోజనములు = ౧ శక్రక్రోశాంతరము.

ఈ లెక్క ప్రకారం బ్రహ్మలోకముయొక్క దూరము చెప్ప బడునని బ్రహ్మాండ పురాణము. ఉపసంహారపాదము. బ్రహ్మలోక వర్ణన ఘట్టమున చెప్పబడినది.




(నెం, ౫ పటమును చూడుము)

## ౨ భూ గో ళ ము (నెం. ౯ పటమును చూడుము)

మనము నివసించెడి యీ భూగోళమును రెండు కక్ష్యలుగా నిరక్షరేఖ మీఁదుగా ప్రాచీన ఋషులు విభాగించిరి. అందు ఉత్తరార్ధ గోళమునకు 'దేవభాగమ'ని పేరు. దక్షిణార్ధగోళమునకు 'అసురభాగ' మని పేరు.

పైన చెప్పబడినటుల బ్రహ్మాండాంతర్వర్తియగు జ్యోతిశ్చక్ర సమమధ్య ప్రదేశమునందుండే ఆకాశమున యీభూగోళము స్థిరముగా నుండేలాగున భగవంతుని విచిత్రశక్తియగు ప్రకృతివలన యేర్పడి యున్నది. అట్టి భూగోళము పృధివ్యప్తేజో వాయ్వాకాశములనియెడు పంచ భూతాత్మకమైయున్నప్పటికి పృధివీ భూతాంశమెక్కువగా చేరి యుండుటవలన 'పృధివీ'యని పిలువబడుచున్నది. ఇదే తీరున వాయు లోకము, వరుణలోకము అగ్నిలోకములయందున్నూ నాయాభూతాం శము లధికముగా గూడియున్నందున నాయా భూతశబ్దములచేత వ్యవ హారింపబడుచున్నవి. భూగోళముమీఁద నుండు సమస్త చరాచరము లన్నియు పంచభూతములతో గూడియున్నవి. భూగోళమునందు సముద్ర నద,నదీ, తటాకాదులు జలాంశములు, పాషాణ, వృక్షాదుల పరస్పర రాపిడివలన పుట్టు కార్చిచ్చు తేజోంశము. భూగోళము మీఁదనుండే చరాచరాత్మకమైన సమస్తమునకు వాయువు ఆధారముగానున్నందున వాయ్వంశముతో చేరియున్నవి. గొప్పదైన ఆకాశము సమస్తమునకు బయట లోపల నిండియున్నందున ఆకాశాంశము. ఇటుల ఈ భూగోళ మంతటను పృధివీభాగము హెచ్చుగాను, మిగత భూతాంశములు తగ్గు గాను కూడియున్నవి. భూమియొక్క ముఖ్యగుణము గంధము (అనగా వాసన) తీపి, పులుపు, వగరు, చేదు మొదలైన ఆరురసములలోనున్నూ పృధివీ భాగమెచ్చుగా చేరియున్నది. ఇట్టి భూగోళము నిమ్మపండువలె సమఘన వృత్తముగానున్నదిగాని పలకవలె సమముగా నుండుటలేదు.

అనాది నుండియు వంశపారంపర్యముగా గురు శిష్య పరంపరా అధ్యయనము చేయబడుచు రాబడిన వేదశాస్త్రములయందు చెప్ప బడిన విషయములను నాయాకాలముల యందప్పటప్పటికి గొప్ప ఆచార్యులుగా నుండువారలు వారి గురువులవలన వారికి సంక్రమించిన

సత్యములను లోకులకు నాయా కాలములయందుండెడి మానవ బుద్ధుల కర్థమగునటుల వివరించుచు గ్రంధ రూపములుగా రచించి లోకుల కనుగ్రహించి పోవుచుందురు. అంతమాత్రముచేత వారా విషయములను క్రొత్తగా కనుపెట్టినటులెంచరాదు. సర్వశాస్త్రములు అనాదినుండియు ప్రకృతినుండియే ప్రతిసృష్టియందును, అందుకు నియమితులైయుండిన ఆధికారిక పురుషులవలన ప్రచారము చేయబడుచు ప్రళయకాలమందు లయించుచు తిరిగి సృష్టి ప్రారంభకాలముననే నాయా ఆధికారిక పురుషుల వలన బహిర్గతముకాబడి లోకమున ప్రచారితములగుచుండును. అట్టి ఆధికారిక పురుషులవలన ప్రచారములోనికి తేబడిన విషయములను గురు శిష్య పరంపరా పొంది నాకాలమందుండిన మనుష్యులకొరకు గ్రంధరూపముగా బొందుపరచ బడుచుండును. మన కాలముకు రాబడిన వారిలో నొకరగు శ్రీ భాస్కరాచార్యుల వారు తమ 'సిద్ధాంత శిరోమణి' యను జ్యోతిష గ్రంధము నందీవిధముగా జెప్పియున్నారు. (ఈయన కాలము క్రీ॥ శ॥ 486 సం॥ గాని కొందరిచే పొరబాటుపడి చెప్పబడిన క్రీ॥ శ॥ 1114 సం॥రం కాదు. నాచే వ్రాయబడిన "కలిశక విజ్ఞానం" అను గ్రంథమును చూడుడు.)

శ్లో॥ "యదిసమా ముకురోదర సన్నిభా భగవతీధరణీ తరణిః క్షితేః।
ఉపరిదూరతరోపి పరిభ్రమన్ కిమునరై రమరైరివ నేక్ష్యతే"॥

తా॥ ఇప్పుడు మనకు ప్రత్యక్షముగా కనుబడుచుండే యీ భూగోళము అద్దమువలె సమానమైన వృత్తముగానున్న పక్షమునందు యీ భూగోళమున కుపరిభాగమున కనుపడెడు సూర్యుడు (మహాభూమి యందుండు దేవతాదులకువలె) మనకేల యెల్లప్పుడునూ, యుదయాస్తమయములు లేక నొకేతీరున కనబడలేదు? అనగా సమముగా నుండక వర్తులముగా (సమఘనవృత్తముగా నిమ్మపండువలె) నీ భూగోళముండుటవలన నుదయాస్తమయములు తటస్థమౌచున్నవి"

శ్లో॥ "యదినిశాజనకః కనకాచలః కిముతదంతరగస్సనదృశ్యతే।
ఉదగయం ననుమేరుధాం శుమాన్ కథముదేతిచ దక్షిణభాగకే"

తా॥ పలకవలె సమముగానున్న భూమికి మధ్యమునగల మేరువును సూర్యుడు ప్రతిదినమున్నూ ఒకమాఱు ప్రదక్షిణము చేయుటవలన మేరువుచాటుకు సూర్యుడుపోయినప్పుడు అస్తమయమున్నూ, యివతలకు వచ్చినప్పుడుదయమున్నూ కలుగుచున్నదని చెప్పెడుపక్షమందు ఉత్తరాయణమునందు ఆ సూర్యునిమండలమును నడ్డగించుకొనియుండే మేరువు మనకేల కనుబడకపోవును ? ఆ మేరువు విశేషదూరముననుండుటవలన మనకు దృష్టిగోచరము కాలేదని చెప్పెయెడల దక్షిణాయనమందు సూర్యుడూ దక్షిణపుదిక్కున ఉదయించుచున్నాడు. గాన ఉత్తరదిక్కునవుండే మేరుసంబంధము సూర్యునకు బొత్తిగా కలుగనేరదుగదా! ఉదయాస్తమయములేలాగున తటస్థము కాగలవు ? అనెడి ప్రత్యుక్తివలన సూర్యుని ఉదయాస్తమయములకు నీ భూగోళము సర్వతోవృత్తముగా నుండడమున్నూ, యీ భూగోళముచుట్టున్నూ, సూర్యుడు తిరుగుచూ తాను కనుబడే ప్రదేశమును పగలుగాను, కనుపడని ప్రదేశమును రాత్రిగాను చేయుచున్నాడనడమే ముఖ్యకారణమని చెప్పి భూగోళమునకు సర్వతోవృత్తము సాధించినారు.

ఈ భూగోళము నె ౧ రు పటములో చూపబడినటుల సమఘనవృత్తముగా నుండుటవలన ఊర్ధ్వాధః ప్రదేశములను కనిపెట్టుటకు శక్యముకాదు. లంకాది నిరక్షప్రదేశములందుండెడి పట్టణవాసులున్నూ, సుమేరు (ఉత్తర ధృవము) బడబాముఖ (దక్షిణ ధృవము) లను ఉభయ ధృవములయొద్దనుండెడి దేవాసుర భాగములయందు నివసించువారలున్నూ తక్కిన ప్రదేశములయందుండెడి వారలున్నూ, అందరును తమంతట తాము ఈ భూగోళమునకు మీదుగానుండేలాగుననే నమ్ముచున్నారుగాని వేరుగాదలచుట లేదు. మీద చెప్పబడిన దేవభాగమునందుండు వారికి జ్యోతిశ్చక్రభ్రమణము ప్రదక్షిణముగానున్నూ ఆసుర భాగమందుండెడి వారికి అప్రదక్షిణముగానున్నూ, మనకుపరిభాగమున పశ్చిమముగానున్నూ జ్యోతిశ్చక్రము సంచరించుచున్నది. ఇట్లు మూడురీతులుగా సంచారము సమచతురశ్రముగా భూగోళముండినేని తటస్థముకానేరదు. ఈ విషయము సూర్యసిద్ధాంతమందు కంఠోక్తిగా చెప్పబడియున్నది.

# సూర్య సిద్ధాంతము గోళాధ్యాయములో

శ్లో॥ "ఉపర్యాత్మానమన్యోన్యం కల్పయంతిసురాసురాః!
అన్యేపిసమ సూత్రస్థామన్యంతేధ పరస్పరం !!"

శ్లో॥ భద్రాశ్వ కేతుమాల స్థాలంకాసిద్ధపురాశ్రితాః!
సర్వత్రైవం మహీగోళే స్వస్థానము పరిస్థితం !!

శ్లో॥ మన్యంతే ఖేయతోగోళ స్తస్యకోర్ధ్వం క్వవాప్యధః!
సవ్యంభ్రమతి దేవానాం అపసవ్యం సురద్విషాం !!
ఉపరిష్టాద్భగోళోయం వ్యక్షేపశ్చాన్ముఖం సదా !!

శ్లో॥ మధ్యేసమంతా దండస్య భూగోళోవ్యోమ్నితిష్ఠతి!
బిభ్రాణః పరమాంశక్తిం బ్రహ్మణోధారణాత్మికాం !!"

సో॥ సిద్ధాంతములో :

శ్లో॥ "సమంతాదండమధ్యేస్మిన్ భూగోళోవ్యోమ్నితిష్ఠతి!
సర్వాధారోపిసధృతో బ్రహ్మణా విశ్వరూపిణా !!

రోమక సిద్ధాంతములో :

శ్లో॥ కార్యంకారణ మధ్యస్థం భూర్మధ్యేండస్య సర్వతః!

వరాహమిహిర సిద్ధాంతమందు :

శ్లో॥ "పంచమహాభూత మయస్తారాగణపంజరే మహీగోళః!
ఖేయస్కాంతాంత స్థోలోహ ఇవావస్థితోవృత్తః!

ఆర్యభట సిద్ధాంతములో :

శ్లో॥ "వృత్తభపంజరమధ్యే కక్ష్యాపరివేష్టితః ఖమధ్యస్థః!
మృజ్జల శిఖివాయుమయో భూగోళస్సర్వతో వృత్తః !!"

దైవజ్ఞాభరణమున :

శ్లో॥ "బ్రహ్మాండ మధ్యస్థనభోంతరాళే పూర్వోక్త సంఖ్యాసహితస్సువృత్తః!
ఆధారశక్త్యాధృత ఏవధాతుర్గోళస్సదా తిష్ఠతిభూతధాత్ర్యాః!!"

<u>సిద్ధాంత శేఖరమందు :</u>

శ్లో॥ "నభస్యయస్కాంతమహామణీ నామంతస్థితో లోహగుడో యథాస్తే
ఆధారశూన్యోపిత దైవసర్వాధారో ధరిత్ర్యాః క్రమపవ.గోళః"

పై ప్రమాణములన్నియు భూగోళము సమఘన వృత్తమనియు అది బ్రహ్మాండమునకు మధ్యనున్నదనియు, యెట్టి యాధారములేక కేవలము పరమాత్మయొక్క ధారణాశక్తిచే ధరింపబడుచున్నదనియు, యేకగ్రీవముగా చెప్పుచున్నవి.

ఈ భూగోళము (భగోళవిభాగము చొప్పుననే) యెటు త్రిప్పి కొలచినను 3౬౦ భాగలు (degrees)గానున్నూ ౨౧, ౬౦౦ కళలుగా నున్నూ (1 డిగ్రీ = 60 కళలు). భారతీయులచే అనేక కోట్ల సంవత్సరముల క్రిందటనే విభజింపబడినది. (ఈ విభాగము "లంక" నుండి ప్రారంభించి చేయబడినది.

## ౨. జ్యోతిస్సిద్ధాంతయోజనము

చక్షురాది యింద్రియగోచరముగాని అతిసూక్ష్మమై, నాశరహితమగు వస్తువు పరమాణువని వ్యవహారింపబడుచున్నది.

౮ పరమాణువులు = ౧ రేణువు
౮ రేణువులు = ౧ కేశము
౮ కేశములు = ౧ యూక
౮ యూకలు = ౧ తిల
౮ తిలలు = ౧ యవ
౮ యవలు = ౧ మానాంగుళం
౧౨ అంగుళములు = ౧ మూర
౪౦౦౦ మూరలు = ౧ క్రోశము (చిన్నది)
౮౦౦౦ మూరలు = ౧ పెద్దక్రోశము
౪ చిన్నక్రోశములు=౧ చిన్నయోజనము
౪ పెద్దక్రోశములు = ౧ పెద్దయోజనము
౧ చిన్నక్రోశము= ౧ $\frac{11}{48}$ యి. మై.
౧ చిన్నయోజనము = ౪ $\frac{11}{12}$ యి. మై
౧ పెద్దక్రోశము=౨ $\frac{11}{24}$ ,,
౧ పెద్దయోజనము=౯ $\frac{5}{6}$ ,,

యీ ప్రకారము యోజన ప్రమాణమును నాయాస్థలముల యందు శాస్త్రానుకూలముగా నూహింపవలెను—

పై జ్యోతిశ్శాస్త్రయోజనమునకు ప్రమాణము,

శ్లో॥ "పరమాణురథోరేణుః, కేశ, యూక, తిలా, యవా. ।
క్రమాదష్టాష్టగుణితా మానాంగుళముదాహృతం॥

శ్లో॥ తద్ద్వాదశభవేద్ధస్తః క్రోశస్సద్ధస్త సంఖ్యయా ।
చతుస్సహస్ర సంఖ్యాకో యోజనం తచ్చతుష్టయం॥" (శిల్పశాస్త్రము)

## 3. భ గ ణ ప్ర మా ణ ము

| | | | |
|---|---|---|---|
| ౧ | గుర్వక్షరోచ్చారకాలము | = ౧ | వికళ |
| ౬౦ | వికళలు | = ౧ | కళ |
| ౬౦ | కళలు | = ౧ | భాగ (డిగ్రీ). |
| 3౦ | భాగలు (డిగ్రీలు) | = ౧ | రాశి |
| ౧౨ | రాసులు | = ౧ | భగణముఅనగా జ్యోతిశ్చక్రము. |

జ్యోతిశ్చక్రములోని మేషాది పన్నెండురాసులకున్నూ రాశి ౧కి ముప్పదిభాగల లేక డిగ్రీల చొ॥ 3౬౦ భాగలకు జ్యోతిశ్చక్రము సరిగా నేర్పరచబడియున్నది. అదే తీరున భాగ ౧కి ౬౦ కళల చొ॥ ౨౧,౬౦౦ యిరువదియొక్క వేయి ఆరువందలు కళలు నేర్పడుచున్నవి. ఈ మీాద చెప్పిన నిర్ణయము చొ॥ నాయాదేశప్రమాణములను గ్రహింపవలయును. - భూగోళముయొక్క అడ్డకొలత ౧౬౨౭ చిన్న యోజనములు. పరిధి అనగా చుట్టుకొలత, ౫౦౭౭-౭౧ చిన్న యో॥ క్షేత్రీకృతపరిమాణము (అనగా చతురం కట్టగా) ౭౨,౭౯,౪౯3-౭౭ చిన్న యోజనములు.

ఈ భూపరిధ్యాది యోజన పరిమాణము జ్యోతిశ్శాస్త్ర సమన్వయ లెఖ ప్రకారము సూర్యసిద్ధాంతము ననుసరించి వేయబడినది. యోజన పరిమాణములో కొంచెమెచ్చుతగ్గులు కల్పించుకొని ఆర్యభటాదులు కొంచెము భేదముగా వారి గ్రంథములయందు తెలిపియున్నారు. ఈ భేదము యోజన మానభేదమువలన కలిగినదేగాని వేరుకాదని తెలియదగినది. స్వల్పభేదములు పాటింపతగినవి కావు.

## ౪ దేవాసురభాగనిర్ణయం

సర్వతో వృత్తముగా నుండే ఈ భూగోళమునకు సమమధ్య ప్రదేశమునందుండు విషువన్మండల రేఖకు (నిరక్ష రేఖ లేక ఈక్వేటరుకు) త్తరభాగము అనగా ఉత్తరార్ధ గోళమంతయు జంబూద్వీపమని వ్యవహారింపబడియున్నది. ఈ అర్ధభాగమే దేవభాగము నం. ౫ రు పటమును చూడుడు. తక్కిన దక్షిణభాగమంతయు (అనగా దక్షిణార్ధ గోళము) సప్త సముద్రముల చేతను, ఆరు ద్వీపముల చేతను నావృతమై

యున్నది. అదియె ఆసురభాగమని చెప్పబడియున్నది. ఇందుకు ప్రమాణము.



(నెం. ౬ రు పటము)

శ్రీ భాస్కరాచార్యులవారు వ్రాసిన సిద్ధాంత శిరోమణియందు :

శ్లో॥ "భూమేరర్ధం క్షారసింధోరుదక్స్థం జంబూద్వీపం ప్రాహురాచార్యవర్యాః।
అన్యేర్ధేస్మిన్ ద్వీపషట్కస్యయామ్యే క్షారక్షీరాద్యంబుధీనాం నివేశః॥

తా॥ ఉప్పుసముద్రమున కుత్తరముగా నుండిన భూగోళములో అర్ధము అనగా (ఉత్తరార్ధగోళము) జంబూద్వీపమని ప్రాచీనాచార్యులు చెప్పియుండిరి. దక్షిణమున వున్న రెండవ అర్ధము అనగా దక్షిణార్ధగోళము మిగతా ఆరుద్వీపములకు లవణ,క్షీరాదిసముద్రము లేడింటికిని నెలవు, అని చెప్పియుండిరి. పూర్వాచార్యులు చెప్పినటులనే భాస్కరాచారి చెప్పుచున్నాడుగాని తాను కనిపెట్టినటుల చెప్పియుండలేదు. ఈవిధముగా పోగా అనాదినుండియు చెప్పబడుచున్నటుల తెలుసు.

ప్రాచీన ఋషులు భూగోళమును నిరక్షరేఖ మీదుగా అనగా అక్షముగా కోసి రెండు అర్ధగోళములుగా నొనర్చిరి. ఒకటి ఉత్తరార్ధగోళము. దీనికి చుట్టు నిరక్షరేఖయున్నూ నెత్తిమీద ఉత్తరధ్రువమునుగలవు. (నెం. ౬ రు పటమును చూడుము) రెండవది దక్షిణార్ధగోళము దీనికిని చుట్టు కోయబడినచోట నిరక్షరేఖయు, దిగువ దక్షిణము చివరదక్షిణధ్రువమునుగలవు. ప్రాచీనభూగోళముకు మధ్య చుట్టుగల నిరక్షరేఖకు దిగువనుగోళము చుట్టు లవణసముద్రముగలదు. ఆలవణసముద్రము 270 యోజనముల వెడల్పుగలిగియున్నటుల సూర్యసిద్ధాంతము స్పష్టముగా చెప్పుచున్నది. దానికి దక్షిణమున ప్లక్షద్వీపమును దానిని చుట్టి ఇక్షుసముద్రమును యిట్లే మిగతా ద్వీపములు సముద్రములును నొకదానినిచుట్టి యొకటి దక్షిణధ్రువము వరకునున్నటులచెప్పబడినది. (నెం౭రు పటమును చూడుడు) కొందరిమతమునలవణసముద్రమునకు దక్షిణమున మిగతా ద్వీపసముద్రములు పద్మకర్ణికను చుట్టబడిన దళములవలె నున్నటుల చెప్పబడినది. (నె౭రు, నె౭ అ.రు పటములను చూడుడు) ఉత్తరార్ధగోళమునకు దేవభాగమనియు, దక్షిణార్ధగోళమున కాసుర భాగమనియు పేర్లు.



(నెం. ౭ రు పటము)



(నెం. ౭ అ. పటము)

## ౫. భూగోళస్థితజంబూ ద్వీపవిభాగములు

(దేవభాగము లేక ఉత్తరార్ధగోళము.) నెం ౬ రు పటమును చూడుడు.

పైన చెప్పబడిన మనభూగోళమందలి జంబూద్వీపమందు భారతవర్షాదులైన నవవర్షములున్నూ, హిమవత్పర్వతాది యెనిమిది పర్వతములున్నూ కలవు. భూగోళము మీాది జంబూద్వీపమందిప్పుడు మనకు దృగ్గోచరమగుచున్న దేశభాగములను యిప్పటిపేర్లతో చదువరులకు సులభముగా గ్రాహ్యమగు నటుల నుదహరించుచున్నాము.

భూగోళసమమధ్యమున చుట్టబడియుండిన రేఖకు 'విషువన్మండలరేఖ' యనియు, 'నిరక్షరేఖ' యనియు (Equator=ఈక్వేటరు) పేర్లు. (నెం ౬ రు పటమును చూడుము) ఈ నిరక్షరేఖకు ఉత్తరభాగమంతయు భూప్రదేశముగా పూర్వముండియున్నది. నిరక్షరేఖ లగాయతు ఉత్తరధృవమువరకు గల ఉత్తరార్ధగోళమంతకు "జంబూద్వీపమని పేరు. జంబూద్వీపమని చెప్పబడిన దేశభాగములో చాలా భాగము యిప్పుడు సముద్రగామియైనది. క్రొత్తలంకలు పైకి తేలినవి.

కొన్ని పర్వత పంక్తులు పేరు లేకుండ మాయమైనవి. క్రొత్తపర్వత ములు పైకి మొలచివచ్చినవి. ప్రాచీనులు ఉత్తర, దక్షిణార్ధగోళము లుగా విభజించగా నవీనులు పూర్వపశ్చిమార్ధములుగా విభాగించిరి. పూర్వులు "లంక"నుండి విభాగించి అక్షాంశములును, యామ్యోత్తర రేఖలును లిఖింపగా నవీనులు "గ్రీనుచ్" మెరిడియనునుండి విభాగించి లెక్కించిరి. ఈ విధముగా భూగోళమంతయు తారుమారైనది. ఇట్టి స్థితిలో పూర్వము మనపురాణములలో కోట్లకొలది సంవత్సరముల నాటినుండియు వర్ణింపబడుచుండిన వర్ణనలు కాన్పించుచున్నందున నొకటి కొకటి సరిపడుచున్నటుల కనుపించుట లేదు. అట్లని మనము వానిని త్రోసివేయరాదు. ప్రస్తుతము ఉన్నవానిని తీసుకొని ప్రాచీనుల దారినే పోయి సమన్వయించుకొనుట మనవిధి. అంతేగాని పురాణములలోని వర్ణనల ప్రకారం నవీనుల దృష్ట్యా భూమిమీద కనుబడుట లేదు గనుక పురాణకర్తలకు భూగోళజ్ఞానము లేదని చెప్పుట హాస్యాస్పదముగనుండును. గోళవిభాగములో కలిగిన మార్పువలనను, పేర్ల మార్పువలనను, జలస్థల ప్రదేశములు తారుమారగుటవలనను, పూర్వమునకు యిప్పటికి భేదము కానవగునని గ్రహింపవలెను.

## ౬. దిక్కుల నిర్ణయం

జంబూద్వీపములో దక్షిణపుదిక్కున నిరక్షరేఖనంటి దిగువ లవణ సముద్రములో "లంక"యనుద్వీపమున్నటుల చెప్పబడినది. లంకకుత్తరమున గల భారతవర్షముకూడను జంబూద్వీపమునకు దక్షిణ మున నున్నటులనే చెప్పబడినది. దీనిని బట్టి దిక్కుల నిర్ణయము చేసిన లంక, భారతవర్షముల కెదురుగా నుండిన దిక్కు ఉత్తరమగును. అనగా ఉత్తరార్ధగోళమైన జంబూద్వీపములో భారతవర్షమున కెదురుగా నుండినది ఉత్తర అమెరికాఖండము. ఉత్తరార్ధగోళమును పరచినటుల ప్లాను వేసిన దక్షిణమున ఆసియాఖండము, ఉత్తరమున అమెరికాఖండములున్నట్లు మనకు కనుబడును. ఉత్తర అమెరికాలోని నిరక్షరేఖ కుత్తరమున గల ఉత్తరసముద్రములో "సిద్ధపురిగలదు. అది లంకనుండి తూర్పుగాగాని, పశ్చిమముగాగాని మొటుకొలచినను 180 డిగ్రీలవద్దనుండును. లంకనుండి తూర్పుకు 90 డిగ్రీవద్ద తూర్పుదిక్కు

నిన్ని లంకనుండి పడమరదిక్కుగా తొంబది డిగ్రీలవద్ద పశ్చిమదిక్కు నిన్ని లంకనుండి తూర్పుపడమరలుగాగాని నేరుగా ఉత్తరధ్రువము మీదుగాగాని నేదిక్కుగా బోయినను 180 డిగ్రీవద్ద ఉత్తరదిక్కునియు మనము తెలిసికొందుము - లంక, భారతవర్షములు మనకెదురుగా నుండునటుల పటమునుంచుకొని చూచిన మనకెదురుగా నున్నది దక్షిణము కుడిచేతిప్రక్కగా తూర్పు, ఎడమచేతిప్రక్కగా పడమర, నెత్తి మీద నున్న, "సిద్ధపురి" ఉత్తరం అగును.

## ౭. నవవర్ష నిర్ణయము

(నెం. ౯. ౮ పటమును చూడుము)

దక్షిణసముద్రతీరమున భారతవర్షము, పూర్వపశ్చిమ సముద్రముల పర్యంతము వ్యాపించియున్నది. దానినిచేరి యుత్తరమున హిమవత్పర్వతమున్నూ అందుకావల అదే తీరున కింపురుషవర్షమున్నూ పూర్వ పశ్చిమ సముద్రముల నంటియున్నది. దానికుత్తరమున హేమకూట పర్వతమున్నూ అందుకుత్తరమున హరివర్షమున్నూ దానికుత్తరమున నిషధపర్వతమున్నూ పూర్వ పశ్చిమ సముద్రముల నంటియున్నవి. ఇట్లు మూడు వర్షములున్నూ వాటినిచేరి మూడుపర్వతములున్నూ మేరువుకు దక్షిణభాగమందుంటున్నవి. ఉత్తర సముద్రతీరమును జేరుకొని కురువర్షమున్నది. అందుకు దక్షిణమున (ప్రాచీనుల దృష్ట్యా) శృంగవాన్ పర్వతమును, అందుకు దక్షిణమున హిరణ్యాకవర్షము, దానికి దక్షిణమున శ్వేతపర్వతము దానినంటి దక్షిణమున రమ్యాకవర్షము, దాని దక్షిణమున నీలపర్వతము యిట్లు యథాక్రమముగా మూడు వర్షములున్నూ, మూడు పర్వతములున్నూ మేరువు ఉత్తరభాగమందు పూర్వ పశ్చిమ సముద్రములనంటియున్నవి. పైన చెప్పబడిన ప్రకారం దక్షిణోత్తరములుగానుండు నిషధ, నీలపర్వతములకు నంతరాళ ప్రదేశమందు దక్షిణోత్తరాయితములుగా మూడు వర్షములు, రెండు పర్వతములును గలవు. వాటి వివరమెట్లన పూర్వసముద్రతీరమున భద్రాశ్వవర్షము, దానికి పశ్చిమమున మాల్యవత్పర్వతము, అందుకు పశ్చిమమున ఇలావృతవర్షమున్నూ, దానికి పశ్చిమ

మున గంధమాదనపర్వతమున్నూ అందుకు పశ్చిమమున పశ్చిమ సముద్రతీర పర్యంతం కేతుమాలవర్షమున్నూ గలవు. ఇలావృతవర్ష మధ్యమున ఉత్తరధ్రువ మేరువు ప్రకాశించుచున్నది. ఈ జంబూ ద్వీపమునకు చుట్టున్నూ లవణసముద్రము వలయాకారముగానుండుట వలన భూమధ్యమందున్న మేరువు (ఉత్తరధృవము)ను బట్టి భద్రాశ్వ, భారత, కేతుమాల, కురువర్షంబులుండు ప్రదేశంబులు వరుసగా వ్యవహార సౌలభ్యమునకుగాను, తూర్పు, దక్షిణము, పడమర, ఉత్తరము అని వ్యవహరింపబడినవి. ఇలావృతవర్షమధ్యంబునగల మేరురేఖ యీ భూగోళముయొక్క ఉభయపార్శ్వంబులయందును దూయబడియున్నది. భూగోళముయొక్క ఉత్తరార్ధగోళము లేక జంబూద్వీపమంతయు పూర్వము భూఖండముగానే యున్నదిగాని అందు సముద్రములేదు.

అందుపూర్వ సముద్రతీరమునగల భద్రాశ్వవర్షమున్నూ దానికి పశ్చిమమునగల మాల్యవత్పర్వతము పూర్తిగానున్నూ, ఇలా వృత వర్షములో తూర్పు పడమరలను చాలా భాగమున్నూ, గంధమాదన పర్వతము పూర్తిగానున్నూ, కేతుమాలవర్షములో హెచ్చు భూభాగ మున్నూ సముద్రగామియైనవి. మేరువుచుట్టునుండు భూప్రదేశము యిప్పుడు సముద్రముగా మారియున్నది.

జంబూద్వీపములో పడమరదిక్కున చాలాభూమి అట్లాంటిక్కు మహాసముద్రముగాను, తూర్పుదిక్కున, ఉత్తరపుదిక్కున పసిఫిక్కు మహాసముద్రముగాను, దక్షిణపుదిక్కున హిందూమహాసముద్రముగాను మారిపోయినది. అట్లాంటిక్కు మహాసముద్రములో మునిగిపోయిన భూఖండమునకు "అట్లాంటిసు" అను నొక ఖండము మునిగిపోయి నటులను, పసిఫిక్కు మహాసముద్రముగా మారిన భూఖండమునకు "లెమూరియా" యను నొక భూఖండము మునిగిపోయినటులను, హిందూమహాసముద్రములో కలిసిపోయిన జంబూద్వీపములోని భూఖం డమునకు "గాండ్వానాల్యాండు" (gaundwana land) అను నొక ఖండము మునిగిపోయినటులను యిప్పుడు నవీన శాస్త్రజ్ఞులు పరిశోధ నలుచేసి చెప్పుచుండిరి. ప్రాచీన జంబూద్వీపమంతయు భూభాగమే గాని, దానిలో సముద్రము లేదు. దానిచుట్టునుగల నిరక్షరేఖకు దిగువ

గోళమును చుట్టి లవణ సముద్ర ముండెడిది. ఇప్పటికిని ఆ లవ
ద్రమే యుండియున్నది. గాని యిప్పు డాఫ్రికాఖండమని పిల
భూభాగము పెరిగి దక్షిణ ఆఫ్రికాయనెడి పేరున పశ్చిమ సము
లోనికి చొచ్చుకొని పోయినది. అమెరికా ఖండములోని ని
మీద "లంక" నుండి ఉత్తరమున 180 డిగ్రీవద్దగల "సి
పశ్చిమమున ఉత్తర లవణసముద్రములో (నిరక్షరేఖ కు త్త
కొంత భూమి పైకి తేలినది. దీనికే దక్షిణ అమెరికాయని పే
రెండు భూభాగములు తప్ప మిగతా గోళముచుట్టును గల ని
నంటి యిప్పటికిని లవణసముద్రమే నావరించి యున్నది. నిరక్ష
దిగువగోళముచుట్టును 270 యోజనముల (అనగా 1327½ యి
మైళ్ళ) వెడల్పుగల ఉప్పుసముద్ర ముండెనట్లును, దానిని చుట్టి
ఆరు ద్వీపములును, ఇక్షు, సురాదులగు నారు సముద్రములును
దానిని చుట్టి యొకటి పంతున దక్షిణాగ్రగోళమున దక్షిణ ధ్రు
వరకు గలదని చెప్పబడినది. కాని ఆ ద్వీపసముద్రభాగములని
లవణసముద్ర గాము లైనందున నిరక్షరేఖ లగాయతు దక్షిణ ధ్రు
వరకు యేకముగా ఉప్పుసముద్రమే వ్యాపించియున్నది. అం
ప్లక్షాది ద్వీపములలోని అల్పభాగములు ఆస్ట్రేలియా, న్యూజిల
జావ, బలి మొదలుగాగల లంకలుమాత్రము యిప్పుడు నిలిచియు




ప్రాచీన భరతవర్షము నెం. ౨ రు పటము

## ౮. ఇప్పుడు గుర్తింపబడిన ప్రకారం జంబూద్వీప నవ వర్షములు




(౯౮ వ పటము)

## పటములోని వివరములు

1 భారతవర్షము
2 కింపురుషవర్షము
3 హరివర్షము
4 కేతుమాలవర్షము
5 ఇలావృతవర్షము
6 భద్రాశ్వవర్షము
7 రమ్యకవర్షము
8 హిరణ్యకవర్షము
9 కురువర్షము
10 ఉత్తరధ్రువము
11 లంక
12 యవకోటి
13 సిద్ధపురి
14 రోమకం

పటములో చుట్టు చుట్టబడి నాలుగువైపుల I అని గుర్తువేయబడిన వర్తులము (సర్కిలు) నిరక్షరేఖ. నిరక్షరేఖను చుట్టి 270 చిన్నయోజనములు వెడల్పు గల ఉప్పు సముద్రము గలదు.

1. <u>భారతవర్షము</u> ఉత్తరార్ధగోళమైన జంబూద్వీపమునకు దక్షిణపుదిక్కున గల నిరక్షరేఖమీాదనుండిన "లంక" కుత్తరమున భారతవర్షము (నెం ౮ రు పటము చూడుము) దీనిలో నవీనభాగముల ప్రకారంగల దేశముల వివరం.

(నెం ౯ రు పటమును చూడుడు ప్రాచీన నవీనవిభాగములుగల జంబూద్వీపము)

"లంక"కు తూర్పు, పశ్చిమముల యేబది డిగ్రీలవరకున్నూ, లంకకుత్తరమున ఉత్తరధృవముమీాదుగాగల గీతమీాద 35 డిగ్రీలవరకునుగల భూభాగములోని ప్రదేశము (ఇండుుండిటిబెట్టు, దక్షిణ చీనా భాగములు మినహాయింపబడవలెను.)

(నెం ౮ రు ప్రాచీనభారతవర్షపటమును చూడుడు)

"ఆఫ్రికాలోని బెల్జియం కాంగోలోని ఈశాన్యభాగమున నిరక్షరేఖకుత్తరమున గల కొద్ది భూభాగము అబిసీనియా, అరేబియాలో దక్షిణభాగం, ఇరాకులో దక్షిణం, ఆఫ్గనిస్థానం, బెలూచీస్థానం, ఇండియా, సిలోను, బర్మా, థాయిలాండు, ఇండోచైనా, కంబోడియా, మలే స్టేట్సు, ఫిలిప్పైన్సు, సుమిత్రా, బోర్నియో మొదలుగాగల భూభాగములును, ఇప్పుడు పసిఫిక్కు సముద్రములో కొంతభాగము, హిందూ మహాసముద్రములో కొంతభాగము, బంగాళాఖాతము, సముద్రగామియైన 'గాండ్వానాల్యాండు' అనేడి భూభాగప్రదేశమున గల అరేబియాసముద్రము, పరిషియాసింధుశాఖ, మొదలుగాగల జలభాగమంతయు భూభాగముగా నుండి భారతవర్షములో చేరియుండెడిది. ఇందులో సింధునదికి తూర్పున ఆసేతుహిమాచలముగాగల భాగము 'సింధుస్థానమనియు' 'భరతఖండము' అనియు పిలువబడుచుండెడిది. సింధునదికి పశ్చిమరగాగల భాగమునకు మ్లేచ్ఛస్థానమని పేరు. దీనికి పడమర సరిహద్దు పూర్వము లవణసముద్రమేయైనను పిమ్మట ఈక్వేటరుకు దిగువసముద్రము భూభాగమైనది. ఇదియే దక్షిణ ఆఫ్రికా. భారతవర్షమునకు తూర్పు, దక్షిణ, పశ్చిమముల సముద్రమును ఉత్తరమున కింపురుషవర్షమును హద్దులు.

## ౨. కింపురుషవర్షము

లంకనుండీ నిరక్షరేఖమీదగల యేబదవ డిగ్రీ లగాయితు అరువది రెండున్నర డిగ్రీలవరకున్నూ లంకకు పశ్చిమమున నిరక్షరేఖ మీదగల యేబదవ డిగ్రీలగాయతు అరువది రెండున్నర డిగ్రీల వరకున్నూ ఉత్తరం ఉత్తరధ్రువముమీదుగా (అమెరికాలోని) సిద్ధపురి వరకు గీయబడిన గీతమీద ముప్పదియైదవ డిగ్రీలగాయతు యేబదియైదవ డిగ్రీవరకు. పడమర సముద్రమునుండి తూర్పుసముద్రము వరకు వ్యాపించి యుండిన ప్రదేశము. భారతవర్షమున కుత్తరమునగల టిబెట్టున్నూ దక్షిణచీనాయున్నూ కలిసిన ప్రదేశము "అట్లాంటిక్కుసముద్రము, ఆఫ్రికాకు పశ్చిమమున గల ఫ్రెంచి ఈక్వటోరియల్ ఆఫ్రికా, ఆంగ్లో ఈజిప్షన్ సుడాన్, ఈజిప్టు, అరేబియాలో ఉత్తరభాగం, మధ్యధరా సముద్రములో తూర్పుభాగం, సిరియా, ఇరాక్, ఇరాన్ (లేక పరిషియా)లో ఉత్తరభాగం, కాస్పియన్ సముద్రము, రష్యన్ టర్కిస్థానం, సింకియాంగ్, టిబెట్, మంగోలియా, గోబీయెడారి, చైనాలో ఉత్తరభాగం, మంచూరియా సైబీరియాలో దక్షిణభాగం, కొరియా, జపాన్ లంకలు, పసిఫిక్కు సముద్రముగా మారిన 'లెమూరియా'యని యిప్పుడు చెప్పబడుచుండిన భూఖండము".

## ౩. హరివర్షము

లంకనుండి తూర్పు పడమరలను నిరక్షరేఖమీద అరువది రెండున్నర డిగ్రీల లగాయితు డెబ్బదియైదు డిగ్రీలవరకు ఉత్తరరేఖ మీద యేబదియైదు డిగ్రీలనుండి డెబ్బదియైదు డిగ్రీలవరకు నుండు ప్రదేశము. పశ్చిమమున అట్లాంటిక్కు సముద్రమునుండి తూర్పు సముద్రం (పసిఫిక్కు సముద్రము) వరకుగల భూభాగము–

"ఫ్రెంచి పశ్చిమ ఆఫ్రికా (సహారాతోసహా) మొరాకో, ఆల్జీరియా, లిబియా, మధ్యధరాసముద్రములోని మధ్యభాగం ఫ్రాన్సులో తూర్పుభాగం, బెల్జియం, హాలెండు, ఇటలీ, గ్రీసు, బల్గేరియా, రుమేనియా, జర్మని, ఆస్ట్రియా, డెన్మార్కు, బాల్టికుసముద్రం, స్కాండినేవియా, ఫిన్లాండు, పోలెండు, సోవియట్ యూనియను,

ఆసియాలోని సైబీరియా, టర్కీ, నల్లసముద్రం, కాస్పియన్ సముద్రములో ఉత్తరభాగం, తెల్లసముద్రం, ఆరలు సముద్రం (Aral sea) పూర్వము యిది భూ భాగము) కామచ్చాట్కా, బేరింగ్ సముద్రం – (యిదియు భూ భాగమే) పసిఫిక్కు సముద్రం (యిది మునిగిపోయిన లెమూరియాఖండం) దక్షిణ గ్రీన్‌లాండు." (పైన చెప్పబడిన సముద్రములన్నియు పూర్వము భూ భాగముగా నుండి "జంబూ ద్వీపము"లో చేరియున్నవి.)

## ४. కేతుమాలవర్షము

లంక పడమర డెబ్బదిఅయిదు డిగ్రీలనుండి నూటఅయిదు డిగ్రీలవరకును రోమకనుండి ఉత్తర ధ్రువమునకు గీయబడిన తూర్పు రేఖ మీద నలుబది డిగ్రీలవరకు గల ప్రదేశము.

ఈ వర్షములో స్వల్పభాగము తప్ప మిగత వర్షమంతయు, దానికి తూర్పునవున్న గంధమాదన పర్వతపంక్తిసహా సముద్రగామియైనది. అట్లు సముద్రగామియైన ప్రదేశమునే "అట్లాంటిస్" భూఖండమని నవీనులనుచున్నారు. ఇది సుమారు యేబదివేల సంవత్సరముల క్రిందట సముద్రగామియైనట్లు చెప్పుచున్నారు. కాని ఇది సముద్రగామియైనకాలము సుమారు పదికోట్ల సంవత్సరములపై కాలముగా నెంచబడుచున్నది. కేతుమాలవర్షము ఇప్పుడు అట్లాంటిక్కు సముద్రముగా హెచ్చుభాగమును, పశ్చిమ ఆఫ్రికాలో సెనిగాల్, ఫ్రెంచిగ్వినా, రాయిడీవోరో అను భాగములు గల చిన్నముక్క గలదు.

## ५ ఇలావృతవర్షము

ఇది ఉత్తర ధృవమునకు తూర్పున 'యమకోటి' వైపుకు యేబది డిగ్రీల వరకును పడమర 'రోమక' వైపుకు యేబది డిగ్రీలవరకును, ఉత్తరమున సిద్ధపురి రేఖమీద పదిహేను డిగ్రీలవరకును దక్షిణం 'లంక' రేఖమీద పదిహేను డిగ్రీలవరకును అనగా తూర్పు పడమరలు నూరుడిగ్రీల పొడుగును ఉత్తర దక్షిణములు ముప్పదిడిగ్రీలు వెడల్పును గలిగి నడిబొడ్డున ఉత్తర ధృవముగల భూఖండము. దీనిలో యిప్పుడు వున్న దేశ విభాగములు :—

మధ్యధరాసముద్రములో తూర్పుభాగం, పోర్చుగల్, స్పెయిన్, ఫ్రాన్సులలో పశ్చిమమునుండి సగభాగం, బ్రిటిషు ద్వీపములు, ఐస్‌లాండు, స్పిట్జుబర్గెన్ లంకలు గ్రీన్ లెండులో ఉత్తరభాగం, బేరింగు జలసంధియు దానికి దక్షిణమునగల సైబీరియాలోని ఈశాన్యభాగమునగల కొద్ది భూభాగం. అట్లాంటిక్కు సముద్రమున మునిగిపోయినదని చెప్పబడిన 'అట్లాంటిస్' భూఖండభాగము, కెనడా నెత్తిమీదగల లంకల సముదాయము. ఇలావృతవర్షములో మేరువుకు ఈశాన్యముగానుండిన ప్రదేశమునకు "ఉత్తర కురుభూములు"ని పేరు. ఇప్పుడా ప్రదేశములో భూమియంతయు సముద్రముగా మారిపోయినది.

రష్యన్ తుర్కిస్థాన్‌లో కూడను యొక "ఉత్తరకురు" అను పేరుగల ప్రదేశము గలదు. ఈ రెండును వేరు వేరు ప్రదేశములు. పురాణములలో వర్ణింపబడిన "ఉత్తర కురుభూములు" అనునది మేరువుకు ఈశాన్యముగాగల ప్రదేశములు. కృతయుగ కాలమున అచ్చట పంట లెచ్చుగా పండుటకు తగిన సారవంతమైన భూము లుండెడివి. ఒక సందర్భములో అగస్త్యమహాముని నావిషయమును వివరించియున్నాడు. (కురువర్ష మనునది ఉత్తరసముద్రమువరకు వ్యాపించియున్నది. దానికి ఉత్తర కురుభూములకు సంబంధము లేదు.)

(మహాభారతం అశ్వమేధ పర్వము చూడండి)

## ౬ భద్రాశ్వ వర్షము

ఈ వర్షమంతయు మాల్యవాన్ పర్వతముసహా పసిఫిక్కు సముద్రముగా మారినది. ఇదియే మునిగిపోయినదని చెప్పబడిన 'లెమూరియా' భూఖండములోని భాగము 'లంక'కు తూర్పున డెబ్బదియైదు డిగ్రీలు లగాయతు నూటఅయిదవ డిగ్రీవరకు నిరక్షరేఖమీదవుండిన 'యవకోటి' నుండి పశ్చిమముగా ఉత్తరధృవము మీదుగా 'రోమక'మునకు గీయబడిన రేఖమీద యవకోటికి పడమర నలుబదిడిగ్రీలవరకు గల ప్రదేశము.

## ౭ రమ్యకవర్షము

'లంక'కు తూర్పు,పశ్చిమముల నూటఅయిదుడిగ్రీల లగాయతు 117½ డిగ్రీలవరకును ఉత్తరధృవమునుండి 'సిద్ధపురి'వైపుకు పదిహేనవ

డిగ్రీలగాయతు ముప్పదియైదవ డిగ్రీవరకు గల భూభాగ సముద్ర భాగములు.

ఉత్తర అమెరికాలో కెనడా ఉత్తరభాగము, ఉత్తరధృవము వైపున యుండు కొన్ని లంకలు, పడమర పసిఫిక్కు తూర్పు అట్లాంటిక్కు మహాసముద్రములు. (ఈ సముద్రములు ప్రాచీనకాలమున జంబూద్వీపములో చేరిన భూభాగమైయుండి పిమ్మట లవణసముద్రముచే నాక్రమింపబడి యిప్పుడు సముద్రములుగా ప్రత్యక్షమగుచుండినవి. ఆ పోయిన భూభాగములనే 'అట్లాంటిక్కు' 'లెమూరియా' భూఖండములని నవీనులు పేరిడిరి. కాని ఆ భూఖండమంతయు ప్రాచీన జంబూద్వీపములో చేరిన నవవర్షములలోని భాగములు)

అమెరికాఖండమును "కొలంబసు" కనిపెట్టినాడనునది తెలియనిమాట. ప్రాచీన భారతీయులు దాని నాక్రమించి నివసించియుండిరి. ప్రియవ్రతుడను రాజు దానిని మూడుభాగములుగా చేసి ముగ్గురు కుమాళ్ళకు యిచ్చియున్నాడు. అవియే 1 రమ్యక 2 హిరణ్యక 3 కురువర్షములు.

## ౨. హిరణ్యకవర్షము

ఉత్తర ధృవమునుండి సిద్ధపురివైపుకు (అనగా ఉత్తరవైపున గల ఈక్వేటరువైపుకు) గల రేఖమీద ముప్పదియైదు డిగ్రీల లగాయతు యేబదియైదు డిగ్రీలవరకున్నూ 'లంక'నుండి నిరక్ష రేఖమీద (ఈక్వేటరుమీద) తూర్పు పడమరలను నూటపదిహేనున్నర డిగ్రీ లనుండి నూటముప్పది డిగ్రీలవరకు గల భూభాగము.

కెనడాలోని దక్షిణభాగము యునైటెడ్ స్టేట్సులో ఉత్తర భాగము, తూర్పు అట్లాంటిక్కు పడమర పసిఫిక్కు సముద్రభాగములు.

## ౩. కురువర్షము

ఉత్తర ధృవమునుండి అమెరికాలోని ఈక్వేటరు వైపుకు అనగా సిద్ధపురివైపుకు యేబదియైదు డిగ్రీల లగాయతు తొంబదవ డిగ్రీవరకును ఈక్వేటరుమీద సిద్ధపురికి యిరువైపుల యేబది డిగ్రీలదూరము అనగా 130 వ డిగ్రీలవరకున్నూ అనగా సిద్ధపురివరకుగల భూభాగము:—

యునైటెడ్ స్టేట్సులో దక్షిణభాగము, కాలిఫోర్నియా, మెక్సికో హాండ్యూరాస్; గౌతమాలా, శాల్వేడారు, నికార్గ్వా, కోస్టరీకా, పెనామా, దక్షిణ ఆమెరికాలో చేరిన ఉత్తరభాగమునగల కొలంబియా వెనిజూలా, గ్వైనా, ఈక్వేడారులో ఉత్తరభాగం, బ్రజీలులో ఉత్తరమున స్వల్పభాగం. తూర్పున అట్లాంటిక్కు పశ్చిమమున పశిఫిక్కు మహాసముద్రములు. (ఈ సముద్రములే అట్లాంటిస్, లెమూరియా భూఖండములుగా పూర్వముండేవి. యీ భూభాగములకు అట్లాంటిస్, లెమూరియాలని నవీనులచే పెట్టబడిన పేర్లు. ప్రాచీనులు వీనిని జంబూ ద్వీపభాగములుగా చెప్పియుండిరి.) నెం. ౧౦ రు పటమును చూడుము.



(నె ౧౦ రు పటము.)

## ౯. లంకాది పట్టణ చతుష్టయ స్థితి

ఈ భూగోళసమమధ్యము నందుండే విషువన్మండల రేఖ (అనగా నిరక్షరేఖ లేక ఈక్వేటరు) నంటిదిగువ సముద్రములో తూర్పున యవకోటి దక్షిణమున లంక పడమర రోమకం ఉత్తరమున సిద్ధపురి అను నాలుగు పట్టణములు (లంకలు) గలవు. ఈ పట్టణములకు

పరస్పరమున్నూ (ఒకదానికొకటి) నిరక్షరేఖమీద ౧౨౭౨.౧/౪ యోజనముల దూరము కలిగియున్నది. ఈ నాలుగు పట్టణములును నిరక్షరేఖయందుండుటవల్ల సుమేరు (అనగా ఉత్తరధృవము) బడబా ముఖము (దక్షిణ ధ్రువములకు మధ్యమందుంటున్నవని స్పష్టము (అనగా నిరక్షరేఖ నుండి ఉత్తర ధృవము ౧౨౭౨.౧/౪ యోజనముల దూరము. అటులనే నిరక్షరేఖకు దక్షిణధ్రువము కూడను ౧౨౭౨.౧/౪ యోజనములదూరము (ఒక యోజనమనగా ౭.౧౧/౧౨ యింగ్లీషు మైళ్ళు.) పై నాలుగుపట్టణముల పూర్వాదిదిక్కుల నిర్ణయము మేరువునుబట్టి యూహింప వలసినదిగాని మనము నివసించియుండెడి ప్రదేశమునుబట్టి సూర్యోదయాస్తమయముల ననుసరించి సాధారణ దిక్కు నిర్ణయమువలె యూహింపతగినదికాదు. పాటిస్థితి యెలాగనిన:— మేరువుకు తూర్పుదిశయందు గల భద్రాశ్వవర్షమున యమకోటి అనే పట్టణమున్నూ మేరువుకు దక్షిణమునగల భారతవర్షమందు (లంకా ద్వీపమున) లంకయను పట్టణమున్నూ మేరువుకు పశ్చిమమున కేతు మాలవర్షములో రోమకమనే పట్టణమున్నూ, మేరువు కుత్తరమున కురువర్షములో సిద్ధపురియనే పట్టణమున్నూ యుంటున్నవి. ఈ తీరున మేరువుకు నాలుగుదిశలయందున్నూ నిరక్షరేఖ మీద సృష్ట్యాది నుండియు నాలుగుపట్టణములు నిర్మింపబడి యున్నవి. అవి యిప్పుడు సముద్రగాములై యున్నందున నిరక్షరేఖమీద అక్షాంశములను బట్టి నిర్ణయించుకోవలసి యున్నది. ఆనాలుగు పట్టణముల కుత్తరమున మేరువుండి యున్నది. (నె 6, 7 ర్లు పటములను చూడుము)

పై విషయముకు ప్రమాణము:— సూర్యసిద్ధాంతం గోళాధ్యాయములో.

శ్లో॥ సమంతాదండ మధ్యాత్తు తుల్యభాగేషుతోయధేః।
దీపేషుదిక్షు పూర్వాద్యా నగర్యో దేవనిర్మితాః॥ ౩౭

శ్లో॥ భూవృత్తపాదే పూర్వస్యాం యమకోటిస్తు విశ్రుతా।
భద్రాశ్వవర్షేనగరీ స్వర్ణప్రాకారతోరణా॥ ౩౮

శ్లో॥ యామ్యాయాం భారతేవర్షే లంకాతద్వన్మహాపురీ।
పశ్చిమే కేతు మాలాఖ్యేరోమకాఖ్యా ప్రకీర్తితాః॥ ౩౯

శ్లో॥ ఉదక్ సిద్ధపురీనామ కురువర్షే ప్రతిష్ఠితా।
తస్యాంసిద్ధా మహాత్మానో నివసంతి గతవ్యథాః॥ ౪౦
శ్లో॥ భూవృత్తపాదవివరాస్తాశ్చాన్యోన్యం ప్రతిష్ఠితాః।
తాభ్యశ్చోత్తరతోమేరుః తావాదేవాసురాశ్రయాః॥ ౪౧

పై పట్టణములయందుగల సూర్యోదయాది విభేదములు చెప్పబడుచున్నవి.

శ్లో॥ "భద్రాశ్వోపరిగః కుర్యాద్భారతేతూదయం రవిః।
రాత్ర్యర్ధం కేతుమాలాఖ్యే కురావస్తమనం తథా।
భారతాదిషు వర్షేషుతద్వదేవ పరిభ్రమన్।
మధ్యోదయార్ధరాత్రౌ స్తకాలాన్కుర్యాత్ప్రదక్షిణం॥"
(సూ॥ సి॥ గోళాధ్యాయం)

తా॥ లంకాపట్టణమున సూర్యుడుదయించినప్పుడు యవకోటియందు మధ్యాహ్నమును సిద్ధపురి (అమెరికా) యందస్తమయమును, రోమకమునందర్ధరాత్రియు, నగును, ఇద్దేప్రకారము యవకోటియందు సూర్యోదయమైన సిద్ధపురియందు మధ్యాహ్నమును, రోమకమున సూర్యాస్తమయమును లంకయందు నిశిరాత్రియు నగును. ఈప్రకారమీ నాలుగుపట్టణములయందును కాలవ్యత్యాసములు సూర్య సంచారమువలన కలుగుచున్నవి.

శ్లో॥ "సర్వేషామపివర్షాణాం మేరురుత్తరతస్థితః॥"
తా॥ వర్షములన్నిటికి మేరువు ఉత్తరమున నున్నది–

## ౧౦. అసురభాగ నిర్ణయము

### (దక్షిణార్ధగోళము)

(2, 2అ పటములు చూడుము)

నిరక్షరేఖకు దక్షిణభాగమున భూగోళముచుట్టును లవణసముద్రమావరించి యున్నది. దీని వెడల్పు ౨౭౦ యోజనములు (అనగా ౨౭౦ $\times 4.11/12 = 1327.1/2$ యింగ్లీషు మైళ్ళు) అనగా నిరక్షరేఖకు దక్షిణముగా పందొమ్మిది డిగ్రీల వరకు ($1$ డిగ్రీ $= 69\frac{1}{2}$ యింగ్లీషు మైళ్ళు) చుట్టును లవణసముద్ర మావరించి యున్నది. ఈ సముద్రము

నకు క్షీరోదధియనియు, మహోదధియనియు, మిగతా భూగోళము మీది యిక్షుసముద్రము వగయిరా ఆరుసముద్రములకంటె గొప్ప దగుటవలన 'అపాంపతి'యనియు పేర్లు. లవణసముద్రమునకు దక్షిణ మున 'బడబాముఖ పర్వతం' (అనగా దక్షిణ ధ్రువము) వరకు చుట్టు నుండెడి ప్రదేశములో మిగతా ఆరుద్వీపములును, ఆరుసముద్రములును గలవు. లవణ సముద్రములోని లంకకు దక్షిణముగా లవణసముద్రము దాటినపిమ్మట, తూర్పు పడమరల విశాలముగా గలిగిన యొక గొప్ప భూఖండము దక్షిణ ధ్రువము సమీపమువరకు వున్నటులను, ఆ భూమి గొప్ప ఫలవృక్షములతో గూడిన అరణ్యములను, గొప్పపర్వతములు, సరస్సులును, గొప్ప చందన వృక్షములతో గూడిన వనమును గలిగి యున్నటులను అందొక పర్వతముమీద అగస్త్య మహాముని ఆశ్రమ మున్నటులను, శ్రీ మద్రామాయణములో వర్ణింపబడి యున్నది. శ్రీమద్రామాయణకాలం ఏకకోటి నలుబదిఆరులక్షల సంవత్సరములు. శ్రీ మద్రామాయణకాలము నాటికిని మనకాలమునకును మధ్య భూగోళము మీద అనేక మార్పులు జరిగియున్నవి. శ్రీ మద్రామాయణములో వర్ణింపబడిన భూభాగమిప్పుడు సముద్రగామియైనది. ఇట్టి స్థితిలో సృష్ట్యాదినుండియు వర్ణింపబడుచున్న వర్ణనలిప్పుడెలా సరిపోవును? సిద్ధాంత గ్రంథములలోను, పురాణములలో గూడను దక్షిణార్థ గోళములో సప్తసముద్రములును, ఆరుద్వీపములు నున్నటుల స్పష్టముగా చెప్పబడియున్నవి. "సప్తద్వీపావసుంధరా"యను శాస్త్రవర్ణనము మహాభూమికిని, భూగోళమునకును గూడ వర్తించును. మహాభారతములోను, యింకా నితరములైన విష్ణుపురాణాదులలోను వర్ణింపబడిన సప్తద్వీపాదులు మహాభూమిమీది సముద్రద్వీపాదులకు వర్తించునుగాని భూగోళముమీది వానికి వర్తింపవు. జంబూద్వీప వర్ణనమున మాత్రము లేఖక ప్రమాదదోషములవలన గాని, లేక రెండు జంబూద్వీపములు రెండుచోట్ల గలవను విషయమును గ్రహింపలేని వారివలన తాళపత్ర గ్రంథము లచ్చొత్తింపబడుటచే గాని కొంత తారుమారు చేయబడినటుల గనపడుచున్నది. జాగరూకతతో పరిశీలించువారు తెలిసికొని సమన్వయము పరచుకొనగలరు. కేవల విమర్శనాబుద్ధితో

జూ ర పురాణములను వ్యతిరేక భావమున సమన్వయింప దలచినవారికి మాత్రము సుబోధకముగా నుండదు. మహాభూమిమీది ద్వీప సము ద్రాదులకును. భూగోళముమీది వాటికిని హస్తిమశకాంతర తారత మ్యముగలదు. వాటికి వీటికి పోలికయే లేదు. బహుశః మహాభూమి మీదగల సముద్రద్వీపాదుల పేర్ల ననుసరించియే భూగోళము మీద గూడ పేర్లు పెట్టబడి యుండవచ్చును.

## ౧౧. భూగోళస్థిత సప్తసముద్ర ద్వీపాదులు

(నె ౯ రు పటమును చూడుము)

నె ౯ రు పటములో చూపబడినటుల భూగోళస్థిత సప్తసముద్ర ములును సప్తద్వీపములును యొకద్వీపమును చుట్టి యొకసముద్రమును, దానిని చుట్టి యొకద్వీపమును, యీ తీరున ఉత్తర ధ్రువమునుండి దక్షిణ ధ్రువమువరకును వ్యాపించి యున్నవి. అందు జంబూద్వీప మును దానిని చుట్టిన లవణసముద్రమును చాలా గొప్పవైయున్నవి. దక్షిణార్ధగోళమందు ఉప్పుసముద్రము దిగువగల ఆరుద్వీపములును, ఆరుసముద్రములును ఉప్పుసముద్రముచే నావరింపబడి నామమాత్రావ శేషములైనందున యిప్పుడు మనకు ఒక్క లవణసముద్రము తప్ప యితరమేమియు గోచరించుటలేదు. లవణసముద్రమున కుత్తరమున గల జంబూద్వీపములో హెచ్చుభాగము కూడను లవణసముద్రముచే నాక్రమింపబడి యున్నది.

కొందరి మతము ప్రకారమును శ్రీ మద్రామాయణములోని వర్ణ నను బట్టియు లవణసముద్రమునకు దిగువగల ఆరుద్వీపములు ఆరుసము ద్రములును యొకదానికొకటి తూర్పుగా నేర్పడి వలయాకారముగా పద్మకర్ణికను చుట్టు దళములవలె నె. ౭, ౭ అ. ర్లు పటములలో జూప బడినటుల గోళమును జుట్టుయున్నట్లు గానవచ్చుచున్నది. కాని అవి యెట్లున్నను లవణసముద్రగాములై నామ మాత్రావశేషములైనందున వానిని గురించి హెచ్చువిచారణ జేయునవసరమున్నటుల గాన్పింపదు. కాని శ్రీ మద్రామాయణములో వర్ణింపబడిన కొన్నివిశేషములు మాత్రము మనము మరువక జ్ఞప్తి యందుంచుకొన తగినవై యున్నం దున వానినిట యుదాహరించుచుంటిమి.

లంకకు దక్షిణమునగల లవణసముద్రము మధ్య లంకకు 650 మైళ్ళదూరమున 'పుష్పితిక'మను పేరుగల పర్వతముగలదు. దానికి దక్షిణమున లవణ సముద్రాంతమున లంకనుండి 1327½ మైళ్ళ పిమ్మట "సూర్యగిరి" గలదు. దానికి దక్షిణమున ఆరువందలమైళ్లో దూరమున వైద్యుతగిరి గలదు. దాని సమీపమున 400 మైళ్ళదూరమున "కుంజ పర్వతము" గలదు. అందు అగస్త్యమహాముని భవనము గలదు. అచ్చట అగస్త్యమహాముని నివసించును.

ఆ పర్వతమునందు "భోగవతి" యను పేరుగల పట్టణము గలదు. అందు "వాసుకి" యను రాజు రాజ్యము చేయుచున్నాడు. ఆ పర్వతమునకు దక్షిణమున విచిత్రమైన పర్వతారణ్యములు గలవు. కుంజపర్వతమునకు దక్షిణమున సుమారు 1400 మైళ్ళ దూరమున "వృషభ" పర్వతముగలదు. అందు గొప్ప దైనచందనవనము గలదు. అది యిచ్చట భూభాగమునకు దక్షిణాంతమువరకును సుమారు 1200 మైళ్లు వ్యాపించియున్నది. ఆవల మానవులు జొచ్చుటకు దుష్కర మైన భూమి దక్షిణధ్రువమువరకు వ్యాపించియున్నదనియు చందన వనములో బలవంతులైన గంధర్వశ్రేష్ఠులు కాపలాయుండియున్నం దున నందు ప్రవేశింప వలదనియు, లవణ సముద్రాంతమున గల 'సూర్యగిరి' లగాయితు చందన వనాంతమువరకు సుమారు 3600 మైళ్ళ పొడవున వేయిమైళ్ళ వెడల్పుగల గొప్ప భూభాగము ఫల వృక్షములతో నిండియున్నందున అందుల ఫలములు, తేనెలు, యిచ్ఛ వచ్చినటుల నారగింపవచ్చుననియు సుగ్రీవుడు హనుమదాదులకు సీతా న్వేషణమునకేగు ఘట్టమున చెప్పబడినది. చందనవనాంతము లగా యితు 1328 మైళ్లదూరమున బడబాముఖ పర్వతము (అనగా దక్షిణ ధృవము) గలదు.—

(శ్రీమద్రామాయణం, కిష్కింధా కాండ)

పైన చెప్పబడిన ప్రదేశములలో విస్తారభాగములు లవణసము ద్రముచే నావరింపబడినవి. కొన్ని ప్రదేశములు జలమయ మైనవి. కొంత జలప్రదేశము స్థలరూపము నొందినది. కొండలు సముద్రగామి యైనవి, పూర్వపు పరిస్థితులిప్పుడు గుర్తింప వీలుగాకున్నవి. మిగత

ఆరు సముద్రములు లవణసముద్రములో గలిసియు, కొన్ని స్థలరూప ముగా మారియు యిప్పుడదృశ్య మైనవి.

పాలసముద్రము, పెరుగుసముద్రము, నేతిసముద్రము, చెరుకు సముద్రము, మద్యసముద్రము లేలాగున నుండునని పాఠకులకు సందే హము గలుగవచ్చును. లవణసముద్రము మనకు ప్రత్యక్షముగా కనుప డుచుండుటవలన నమ్మగలిగితిమి గాని లేకుండిన లవణసముద్ర మెట్లుండ గలుగునని సందేహించి యుండెడివారము.

లవణసముద్ర మెట్లుండ గలిగినదో యటులనే మిగత సముద్రము లును యుండవచ్చును. ఉప్పుసముద్రపు నీటిని కాచిన ఉప్పుయెటుల సిద్ధ మగునో అటులనే మిగత సముద్రములలోని నీటిని కాచిన నీరుఆవిరియై పోగా నాయా ద్రవ్యములు సిద్ధముకావచ్చును గత ప్రపంచ మహాసంగ్రా మములో జర్మను శాస్త్రజ్ఞుడు సముద్రపునీటినుండి "పెట్రోలు" నుతయారు చేసినటుల ప్రకటితమైనది. ఈశ్వరున కసాధ్యమెద్దియు లేదు. అఘటనా ఘటనశక్తిగల ప్రకృతిలో సర్వమును సాధ్యమే యని గ్రహింపనగును.

౧. నిరక్షరేఖమీద లంక కుత్తరమున 180 డిగ్రీ వద్దనుండిన కురువర్షములో చేరిన 'సిద్ధపురి'కి ఉత్తరముగా (ఉత్తర ధ్రువమునుండి చూచిన దక్షిణంఅగును.) లవణ సముద్రమధ్యమున అనగా సిద్ధపురికి ఆరువందల మైళ్ళ దూరమున "సోమశైలము" అనునొకయెత్తైన గొప్ప పర్వతముగలదు. దానిలో యెత్తైన శిఖరములు వేయిగలవు.

౨. క్షీరసముద్రమధ్యమున "వృషభ" పర్వతమను నొక గొప్పపర్వతముగలదు. దాని మధ్య ప్రదేశములో "సుదర్శన"యను పేరుగల సరోవర మొకటున్నది. సిద్ధులు చారణులు, యక్షులు, కిన్నరులు, గరుడులు, గంధర్వులు, ఉరగులు సాధ్యులు మొదలైన దేవ యోనులు వచ్చి నాసరోవరమందు క్రీడించుచుందురు.

3. శుద్ధజల సముద్రమున కుత్తర భాగంబున "జాతరూపశిల" యను పర్వతమొకటిగలదు. అది చాలయెత్తైన పర్వతము దాని పొడవు నాలుగువందలయేబది మైళ్ళు.

౪. జాతరూప శిలా పర్వతమునకు దక్షిణమ్మున "సౌమనస పర్వతం" గలదు. అందు పూర్ణము త్రివిక్రముడు (వామనుడు)

బలిచక్రవర్తిని యాచించి మూడుపాదముల భూమినిదానము గ్రహించి నపుడు యీ సౌమనసపర్వతం మీద నొక పాదముంచి రెండవ పాదమును ఉత్తరమేరువు మీద బెట్టి యీ భూగోళ మంతయు నొక యడుగుగా కొల్చెనట. అది యీ పర్వతవిశేషము. మేరువువద్ద సూర్యుడు దయించినప్పుడు దేవభాగవాసులకు (అనగా జంబూద్వీప వాసులకు) పవలై దోచుచందమున బడబాముఖ లేక ఆ సురభాగ వాసులకీ "సౌమనస" పర్వతముమీద సూర్యుడుదయించినప్పుడు పవలై దోచును. జంబూద్వీపవాసులకు పవలుగానున్న కాలము బడబాముఖ వాసులకు రాత్రిగానుండును. వారి రాత్రి వీరికి పవలుగా నుండును. "సౌమనస పర్వతము"నందు, వైఖానస, వాలఖిల్యాది మహాఋషులు తపము జేయుచు నివసించుచుండిరి.




(నెం. ౧౧ వ పటము)

## ౧౨. సేతువు, లంకాద్వీపస్థల నిర్దేశము

(నెం. ౧౧ పటమును చూడుడు)

అసురులు, రాక్షసులు అను వారలు తమకు దిగువలోకములలో ప్రత్యేక స్థానములున్నను, తపోశక్తి సంపన్నులై తమ స్థానములనేగాక భూలోకములోనను. స్వర్గలోకములను జయించి పాలించుచువచ్చిరి. వారు దేవతలను, మానవులను, హింసింపుచుండిరి. భూతములు, పిశాచములు, అనువర్గములకు భూలోక భువర్లోకములమధ్య అంతరాళమందు ప్రత్యేక స్థానములున్నను మానవులను పీడించుటకు భూలోకమునకు వచ్చు చుండిరి. వీరలు సూక్ష్మదేహులు. (దయ్యములని మన వారలు పిల్చుచుండినది వీరినే) ఆకస్మిక మరణములను పొందిన వారలును, కర్మభూమియందు పుట్టియు, పుత్రాదులచే అపరకర్మ సంస్కారము పొందని జీవులును, విశేష విషయ కాంక్షతో యీ లోకమున జీవయాత్ర గడుపుచూ మరణించినవారును, ప్రేతగణములలో చేరియుండి వారి సంతానమువారుచేయు వేదోక్తకర్మలు దానములు మొదలైన వానివలన పాపక్షయముకాగా ప్రేతత్వముపోయి యుత్తమలోకములను బొందుచుందురు. చనిపోయినవారి కపరకర్మలు చేయక వదలినయెడల వారికి ప్రేతత్వనివృత్తి కానేరదు. వీరలెప్పుడును మానవుల సహాయమపేక్షించుచుందురు గనుక చనిపోయిన బంధువులకు పిమ్మట చేయవలసిన అపరకర్మలు శాస్త్రీయముగా నాచరించి తమకు యోపినంత దానములను వారల నుద్దేశించి సత్పాత్రులైన వారికిచ్చుచుండుటయే వారికి మనము జేయు నుపకృతి "అపుత్రస్య గతిర్నాస్తి" అనగా "పుత్రులు లేని వారికి గతులు లేవు" అని శాస్త్రవాక్యము. అందువలననే "ఆర్యులు" బహుసంతానమునుకోరుచు వారి సాయమపేక్షించుచుందురు. యాతుధానులను వర్గమువారలు పైకి దుష్టులుగా కనుబడక లోపల కుట్రచేయుచు యజ్ఞయాగాదులకు విఘ్నమాచరించుచు ఆర్యులను హింసించుచుండుటయే వారివృత్తి. వీరు చేసిన ఘనకార్యములేమియు లేనందున యీ వర్గము ప్రాముఖ్యమునకురాలేదు. వీరు రాక్షసాది వర్గములలో లీనమైనట్లు తోచుచున్నది. రావణాసురుని కోర్టులో యీవర్గమువారుకూడా నున్నట్లు శ్రీమద్రామాయణములో

వర్ణింపబడినది. రావణుడు మొదలైన కొంతమంది రాక్షసులు భూలోక మును జయించి రాజ్యములు చేసిరి. అందు రావణుడు "లంకా" ద్వీప మును స్వాధీనపరచుకొని దానినేగాక దక్షిణ దేశమందుకూడా చాలా భాగము నాక్రమించి తన అధికారమును చలాయించినట్లు రామాయ ణమునందుగలదు. రావణుడు రాజ్యముచేసిన "లంకా" ద్వీపము యిప్పుడు మనకు కనుబడుచుండిన "సింహాళ" ద్వీపమని అనేకమంది యభిప్రాయము. రావణుని లంక సముద్రగామియైనది సింహాళము వేరొక ద్వీపముగాని లంకా ద్వీపముకాదు చూడుడు.

"జంబూ ద్వీపంబున సగరాత్మజులు భూఖననంబు జేయుటం జేసి 1. స్వర్ణప్రస్థ, 2 చంద్రశుక్ల, 3. ఆవర్తన, 4. రమణక, 5. మందేహారుణ, 6. పాంచజన్య. 7. సింహాళ, 8. లంకా ద్వీపంబులని యెడు యెనిమిదియుపద్వీపంబులు గలిగె" (భాగ. 5–౨–58)

సింహాళము వేరుగాను లంక వేరుగాను యున్నవిగాని రెండును యొకటిగాదు. సగరచక్రవర్తి కాలమున అనగా యిప్పటికి 5,10,28,452 అయిదుకోట్ల పదిలక్షల యిరువది యెనిమిది వేల నాలుగువందల యేబది రెండు సంIIరములు క్రిందట ఆఫ్రికాఖండమునకు తూర్పు, దక్షిణముల మొదలు అమెరికావరకు కలిసియుండిన భూభాగము అనగా భారతవర్ష ములోకొంతయు, కింపురుష, హరివర్షములకుతూర్పుభాగములకొంతయు, భద్రాశ్వవర్షమంతయును, ఇలావృతివర్షములో తూర్పుభాగమున హెచ్చుభాగమును, రమ్యక; హిరణ్యక, కురువర్షములలో పశ్చిమమున విశేషభాగమును సముద్ర గామియైనది. దీనిని పసిఫిక్కు మహాసముద్ర మని యిప్పుడు పిలుచుచున్నారు. శాస్త్రజ్ఞులు యీ ప్రదేశముల నిటీ వల పరీక్షించి "లెమూరియా" యనెడి యొకగొప్ప భూఖండము పసిఫిక్కు మహాసముద్రములో మునిగిపోయి నటుల చెప్పుచున్నారు. దాని యవశేషము లే మెడగాస్కరు లగాయతు తూర్పుగా అమెరికా వరకువుండిన ద్వీపసమూహాము. నవీన శాస్త్రజ్ఞు లా కాలము నూహించి వేలు, లక్షలలోను లెక్కించుచున్నారు. కాని ఆ కాలము అయిదు కోట్లపై చిల్లర కాలమనియు, సగర చక్రవర్తి రాజ్యముచేయు కాల

మనియు, మనపురాణములు చెప్పుచున్నవి. సగరచక్రవర్తి పదిహేడవ మహాయుగములోని త్రేతాయుగమందుండి యున్నాడు.

లంకాద్వీపముయొక్క నిర్ణీతస్థలమును గురించి అనేకులనేక విధముల దలంచుచున్నారు. సింహళము రావణుడు నివసించిన లంక యనే విషయములో రామాయణ మందెచ్చటను లంకకు సింహళ మను నామమున్నట్లు కనుబడదు సింహళము వేరుగాను లంక వేరుగాను వున్నట్లు శ్రీమద్భాగవతము జెప్పుచున్నది. వాల్మీకి రామాయణములో జెప్పబడిన జాడలవెంటబోయి సేతులంకల స్థలనిర్ధేశము చేయుదము. కిష్కింధకాండ 41 సర్గ 8 ల 25 శ్లోకములలో సుగ్రీవుడు హనుమదాదులను దక్షిణమునకు పంపునప్పుడు వింధ్యపర్వతశ్రేణి మొదలు దక్షిణమున కన్యాకుమారి అగ్రమువరకును, ఆపిమ్మట దక్షిణ సముద్రములోని లంకకు బోయి సీతాన్వేషణము జేయవలసినదిగా జెప్పిన సందర్భములో నీ విధముగా జెప్పియున్నాడు.

"అగస్త్యమహాముని మలయపర్వతముమీద నున్నందున వారి ఆశీస్సులను బొందుడు. తామ్రపర్ణినదిని దాటుడు. పిమ్మట మహేంద్ర పర్వతము సముద్రమును కలియుచోటువరకువెళ్ళి వెదకుడు ఆ పిమ్మట దక్షిణసముద్ర మధ్యంబున నూరుయోజనముల దూరమున "లంక" యను ద్వీపము రావణునిచే పరిపాలింపబడుచున్నది. బహుజాగరూకులై అందు వెదకుడు" అని చెప్పినాడు. ఇందువల్ల మహేంద్రపర్వతము తామ్రపర్ణినది లగాయతు దక్షిణముగా కన్యాకుమారి వరకుగలపశ్చిమ కనుమలవరుసలో ఆఖరుశ్రేణి యనియు మళయాళ, తిరువాన్కూరులకు తూర్పు యెల్లగా యేర్పడియున్న కొండలవరుస యని స్పష్టపడుచున్నది. శ్రీరామచంద్రమూర్తియు, లక్ష్మణుడును చలికాలములో గడపిన "ప్రశ్రవణ పర్వతము" కిష్కింధ పట్టణమునకు పశ్చిమముగా నున్నది. కిష్కింధ శిధిలములు యిప్పుడు హాస్పేటకు యెనిమిది మైళ్ళ దూరమందు నార్తులాటిట్యూడ్ 15 డిగ్రీవద్ద యున్నవి. ప్రశ్రవణ కొండలును నచ్చటనే గలవు. ఈకొండలకుత్తరపు వరుసకు వింధ్యపర్వతవరుసయని పేరు. పశ్చిమ కనుమలు నాలుగు ఖండములుగా విభజింపబడగా నార్తులాటిట్యూడ్ 15 డిగ్రీలకుత్తరపుఖండము వింధ్య

పర్వతశ్రేణియనియు, రెండవది 15 డిగ్రీల మొదలు దక్షిణముగా పాలఘాటు లోయవరకు సహ్యా పర్వతశ్రేణియనియు, మూడవది పాల ఘాటులోయ లగాయతు తామ్రపర్ణినదీ మూలమువరకు మలయ పర్వతశ్రేణియనియు, నాలుగవది తామ్రపర్ణినది లగాయతు దక్షిణ సముద్రమువరకు మహేంద్ర పర్వతశ్రేణియనియు చెప్పబడినది. ఈ మహేంద్రపర్వతము కన్యాకుమారి అగ్రమువద్ద సముద్రముకు కలియుచున్న ప్రదేశమైయున్నది. ఇచ్చటనుండి దక్షిణముగానున్న సముద్రములో నూరుయోజనముల దూరములో (యోజనమనగా $4\frac{11}{12}$ ఇంగ్లీషుమైళ్ళు) రావణుని నివాసమైన లంకాద్వీపమున్నట్లు సుగ్రీవుడు చెప్పియున్నాడు. ఇదిగాక హనుమదాదులు సీతను వెదకి ఆమెను గానక నిరుత్సాహయులైయున్న సమయమున "సంపాతీ" యను వాడిట్లు చెప్పియున్నాడు. "నేను రావణుడు సీతను లంకవైపునకు తీసుకొని వెళ్ళుట చూచియుంటిని. ఆమె అప్పుడు దుఃఖించుచు ఆభరణములను తీయుచుండుటను చూచినాను"అని చెప్పి లంక యిచ్చటకు (అనగా దక్షిణసముద్రముయొక్క ఉత్తరతీరమునకు) సరిగా నూరు యోజనముల దూరముననున్నదనియు, తాను నిత్యము ఆహారము నిమిత్తము దూరప్రదేశములకు బోయివచ్చుచుండుట అలవాటై యున్నందున లంకయొక్క దూరము సరిగా జెప్పగలిగితిననియు, జెప్పియున్నాడు. యోజనమనగా $4\frac{11}{12}$ యింగ్లీషుమైళ్లు చొ॥($4\frac{11}{12} \times 100$)= 492 మైళ్లు. నిరక్షరేఖనుండి ఉత్తరతీరము అనగా కన్యాకుమారి అగ్రము యెనిమిది డిగ్రీలు కలదు. డిగ్రీ 1కి $69\frac{1}{2}$ మైళ్ళు చొ॥ ($8 \times 69\frac{1}{2}$) 556 మైళ్ళు. (నె ౧౧ రు పటమును చూడుము) గనుక లంక నిరక్షరేఖకు ఉత్తరం ఒక డిగ్రీ యెగువనుండి దిగువకు వ్యాపించియున్నది, సింహళము కన్యాకుమారి అగ్రమునకు తూర్పుగానున్నది గాని సాజాదక్షిణముగా లేదు.

హనుమదాదులు సీతయున్న ప్రదేశమును తెలిసికొన్నమీదట వింధ్యపర్వతశ్రేణినుండి తిన్నగా దక్షిణముగా వచ్చి మహేంద్రపర్వత శ్రేణికి దక్షిణపు చివర సముద్రపుటొడ్డున (కన్యాకుమారి అగ్రము

వద్ద) ఆగిరి, ఇచ్చటనుండియే హనుమంతుడు సముద్రమును దాటి లంకకు వెళ్లుటకు ప్రయాణమైయున్నాడు.

ఇదిగాక యుద్ధకాండ నాలవసర్గలో 23 లగాయతు 103 వరకు గల శ్లోకములు చూడుడు. శ్రీరామచంద్రమూర్తి సుగ్రీవునితోను, సైన్యముతోను దండయాత్ర బయలుదేరి కిష్కింధనుండి పశ్చిమంగా దక్షిణమునవున్న సహ్యపర్వతముకువచ్చి అచ్చటనుండి దక్షిణముగా మలయ, మహేంద్ర పర్వతశ్రేణులదాటి వానర ప్రముఖులతో దక్షిణ సముద్రపుటొడ్డున కూర్చుని లంకకు వెళ్ళుటకు సముద్రమును దాటు విషయమునుగూర్చి చర్చించెను. యుద్ధకాండ 22 సర్గ 17 ల॥ 72 వరకు శ్లోకములలో శ్రీరామచంద్రమూర్తి ఆజ్ఞవల్ల నలుడు లంకకు సేతువును నిర్మించెను. పైహేతువువలన మహేంద్రపర్వతము సముద్రము నంటిన ప్రదేశమైన కన్యకుమారి అగ్రము నార్తులాటిట్యూడ్ యెనిమిదవ డిగ్రీవద్దనుండి లంకకు సేతువు నిర్మింపబడినది.

హనుమదాదులుగాని శ్రీరామచంద్రమూర్తిగాని పశ్చిమ కనుమలుదాటి తూర్పుగా సమభూములకు వచ్చినట్లు రామాయణము నందుగాని మరెచ్చటగాని కనుపించదు. రామేశ్వరమువద్ద కొండలు లేవు. మహేంద్రగిరియు లేదు. అది తూర్పుకనుమలకు బహుదూరమున దక్షిణ సముద్రమధ్యమునందున్నది. అందువలన సేతు నిర్మాణము రామేశ్వరమువద్దనుండి జరిగియుండలేదు. రామేశ్వరమువద్ద నుండి సింహళముకు యేబదిమైళ్ళకు లోపుదూరము. మనదేశ దక్షిణ భాగమున కనగా మహేంద్రపర్వతము సముద్రముతో కలిసిన ప్రదేశ మైన కన్యాకుమారి అగ్రమునకు సింహళద్వీపము తూర్పుగానున్నది గాని దక్షిణముగాలేదు. కాబట్టి "సింహళద్వీపము" రామాయణము లోని రావణుని లంకాద్వీపముకాదు. సింహళముకు లంకకు యెట్టి సంబంధములేదు. ఇదిగాక మహాభారతము భీష్మపర్వము ఆరవఅధ్యాయ మునకు నీలకంఠ వ్యాఖ్యానంలో యీ ప్రకారము చెప్పబడినది—

"భూమధ్యరేఖ (సెంట్రల్ మెరిడియన్) లంక, కన్యాకుమారి, ఉజ్జయిని కురుక్షేత్రము (ఢిల్లీ)ల మీదుగా నున్నట్లు" చెప్ప బడినది.

తిరువాసలూరు వాస్తవ్యులైన శ్రీరామసుబ్బశాస్త్రి యను పండితుడు తాను వ్రాసిన "సేతు నిర్ణయము" అను గ్రంథములో సేతువు కన్యాకుమారివద్దనేనని నిర్ణయించియున్నాడు. జ్యోతిశ్శాస్త్ర ప్రమాణముననుసరించికూడా ఋజువు కనుబడుచున్నది. ఎట్లన:— యుగప్రళయమైన పిమ్మట సూర్యాదిగ్రహములు మేషరాశినుండి వాటి వాటికి నిర్ణయమైన వివిధ పరిమాణములుగల నడకలతో తిరుగుటకు ప్రారంభించును. ఆ ప్రకారము తిరిగి అన్నియు నొక్కసారి మేషరాశిలో కలిసికొనుటకొకమహాయుగమగును. అనగా 43,20,000 సంవత్సరములు పట్టును. అప్పటికి లంకాద్వీపమువున్న నిరక్షరేఖ (ఈక్వేటరుకు)కు సరిగా నెత్తిమీద వుండును. నవీనుల లెక్కప్రకారము గ్రీనుచ్ మెరిడియన్‌కు తూర్పున 77 వ డిగ్రీవద్ద లంకాద్వీపముండియున్నది. ఇండియాపటమును చూచిన గ్రీనుచ్‌కి తూర్పు లాంగిట్యూడ్ 77 మీద కన్యాకుమారి, ఉజ్జయిని, ఢిల్లీలు వుండును. యీ 77 డిగ్రీ రేఖవద్ద ప్రారంభించి భారతీయ ఖగోళపండితులు 360 డిగ్రీలనుగా భూగోళమును విభజించిరి. ఇది "లంకరేఖ" యను పేరుతో పిలువబడుచున్నది. ఈ పునాదిమీదనే చంద్రవంశపు రాజులున్నూ, విక్రమాదిత్యునివంశపు రాజులున్నూ యీ రేఖమీద వారి ముఖ్యపట్టణములను నిర్మించుకొనుటయేగాక అచ్చట ఖగోళ పరీక్షశాలలు (అబ్జర్వేటరీలు) నెలకొల్పియున్నారు. పై విచారణనుబట్టి రామాయణములోని రావణుని లంక నిరక్షరేఖ (ఈక్వేటరు) మీదనున్నూ ఢిల్లీ, ఉజ్జయినీ, కిష్కింధ, కన్యాకుమారి అగ్రములతో ఏకసరాసరిగా యొకే యామ్యోత్తర రేఖమీద (మెరిడియన్ మీద)నున్నూ యున్నదనుట స్పష్టము. కాని రామేశ్వరమువద్ద సేతువుగాని, సింహళము రామాయణములోని లంకగాని కానేరదు. ఆడామ్సు బ్రిడ్జి (Adam's bridge) అనునది శ్రీరామచంద్రమూర్తిచే కట్టబడిన సేతువు కాదు. అది యిటీవల పాండ్యరాజులచే కట్టబడిన చిన్నవంతెన. ఆ కాలమున అచ్చట హెచ్చులోతు లేనందున తేలికగా కట్టబడినటుల తోచుచున్నది. నిజమైన సేతువు కన్యాకుమారివద్దనుండియు రావణుని లంక కన్యాకుమారిఅగ్రముకు సరాసరి దక్షిణముగా $7\frac{1}{2}$ డిగ్రీల

దూరమున అనగా నాలుగువందల తొంబదిరెండు మైళ్ళదూరమున నిరక్షరేఖమీద ఉత్తర దక్షిణములకు వ్యాపించి యుండియున్నది— (నెం ౧౧ రు పటమును చూడుడు)

## ౧౩. మహాభూమి, భూగోళముల తేడాలు

| వేద, పురాణప్రతిపాదిత మహాభూమి :– | వేద జ్యోతిస్సిద్ధాంత ప్రతిపాదిత, భూగోళము |
|---|---|
| ౧. ఖండవిభాగములు గల జంబూద్వీపముగలది. | ౧. వర్షవిభాగ జంబూద్వీపముగలది- |
| ౨. మహాభూమి గుండ్రముగా పలకవలె నుండి మధ్య కొంచెము మిర్రుగా (తాబేటి వెన్నువలె) నున్నది. దీనికి భూమండలమని పేరు. | ౨. భూగోళము నిమ్మపండువలె సర్వతోవృత్తముగా నున్నది- దీనికి భూగోళమని పేరు. |
| ౩. దీని అడ్డుకొలత యేబది కోట్ల యోజనములు (ఇది బ్రహ్మాండ యోజనము=ముప్పది యింగ్లీషు మైళ్ళపై చిలుకగును.) | ౩. దీని అడ్డుకొలత $1627\frac{1}{8}$ సిద్ధాంత యోజనములు (సిద్ధాంతయోజనం = $4\frac{11}{12}$ యింగ్లీషు మైళ్ళు) |
| ౪. ఇది మేరురేఖను చుట్టి బ్రహ్మాండముయొక్క అండభిత్తివరకు వ్యాపించియున్నది. | ౪. ఇది జ్యోతిశ్చక్రసమమధ్యమందు ధారణాశక్తివలన ధరింపబడి నిలచియున్నది. |
| ౫. దీని నడిమధ్యమునగల మేరురేఖను చుట్టుకొని జంబూద్వీపమును దానిని చుట్టి సప్తసముద్ర ద్వీపాదులు గలవు. | ౫. దీనికి నడిమధ్యమున గోళము చుట్టును గీయబడిన నిరక్షరేఖకుత్తరభాగమంతయు ఉత్తరధ్రువమువరకు జంబూద్వీపము. నిరక్షరేఖ దక్షిణభాగములో సప్తసముద్రములును, ఆరు ద్వీపములును గలవు. ఉత్తరార్ధగోళము దేవభాగము. దక్షిణార్ధ గోళము అసురభాగము. |
| ౬. దీని సమమధ్య ప్రదేశమున మేరువు ప్రకాశింపుచున్నది. ఇది జీవులను పరిపాలించెడి మనువులకు నివాసస్థానము. | ౬. దీనికి గల యుభయపార్శ్వముల యందు మేరురేఖ దూయబడియున్నది. ఇది పరిపాలితులైన జీవులకు స్థానము. |
| ౭. దీని చుట్టూ చేరియుండే చక్రవాళ పర్వతాగ్రమునందు జ్యోతిశ్చక్ర మమర్పబడియున్నది. | ౭. సప్తకక్ష్యావృతమైన జ్యోతిశ్చక్రము దీనికి ప్రతిదినమొక ప్రదక్షిణము చేయుచున్నది. |
| ౮. "దివార్క రశ్మయోయత్ర ప్రభాం తన్వంతి నాతపం। శశినశ్చన శీతాయ నిశి ద్యోతాయ కేవలం॥ యత్రనజ్ఞాయతే | ౮. పగలు నాలుగుజాములు. రాత్రి నాలుగు జాములు గలిగి అధికమైన శీతోష్ణాదులతో గూడియుండునది భూగోళము. |

| మహాభూమి | భూగోళము |
|---|---|
| కాలోగతో పి దమజాదిభిః" అను ప్రమాణ వచనములలో చెప్పబడిన ప్రకారం శీత వాతా తపము లల్పముగా గలిగి సదా పగలుగానుండి యెప్పుడును చీకటిలేనిదై కాలవ్యత్యాసము తెలియక యుండునది మహాభూమి. | |
| ౯. ఇది పుణ్యఫలానుభవ భూమి. స్థూలశరీరముతో పొందరానిది. | ౯. ఇది పుణ్యఫలహేతువగు కర్మ భూమి. స్థూలశరీరులుండదగినది. |
| ౧౦. ఇచ్చట మనుప్రళయము తప్ప యితర చిన్నప్రళయములు లేవు. | ౧౦. మను, మహాయుగ, యుగ ప్రళయములు గలుగుచుండును. |
| ౧౧. ఇదిధాత్రి,విధాత్రియను పేర్లతో పిలువబడుచున్నది. | ౧౧. మహి, ఉర్వి, క్షితి, పృథివి, భూమి, యని పిలువబడుచున్నది. |

పైన దెలుపబడిన ప్రకారము మహాభూమి, భూగోళములు, పరస్పరభిన్నములు. పురాణములలో దేని వర్ణన వచ్చినప్పుడు దానికి సమన్వయించుకోవలెనుగాని యొకదాని లక్షణములు వేరొక దాని యందారోపించుకొని తమ బుద్ధికి సమన్వయము కుదరనందున తమ అజ్ఞానమును శాస్త్రకర్తలమీదకు త్రోసివేయజూచుట న్యాయము కాదు. గనుక శాంతచిత్తముతో సత్యాన్వేషణ బుద్ధిగలిగి విపరీత భావనలు లేక పెద్దలయొద్ద శాస్త్రముల నధ్యయనము చేయుట క్షేమము. దుష్టులవలన చేయబడిన దురాగతములుగాక పురాణములు వ్రాతప్రతులు తిరిగి తిరిగి వ్రాయునప్పుడును, అచ్చువేయుకాల మందునూ విషయజ్ఞానశూన్యులైనవారివలన అనేక మార్పులకు లోనై కొన్ని కొన్ని విషయములు తారుమారుచేయబడి గందరగోళ ముగా నేర్పడినవి.

## హిమాలయ పర్వతములు

హిమాలయ పర్వతములమీద సముద్ర సంబంధమైన చేపలు మొదలుగాగల జలజంతువుల శిలాజములు (fossils = శిలరూపము లను చెందిన జంతువులు) దొరకుచుండుటవలన పురాతన కాలమున హిమాలయపర్వతము లుండిన ప్రదేశము సముద్రముగా నుండి యున్నదనియు పిమ్మట కొంతకాలమునకు హిమాలయపర్వతములు

సముద్రమునుండి పైకివచ్చినందున ఆ సముద్రమంతయు పర్వతముగా నైనదనియు భూగర్భవస్తు శాస్త్రజ్ఞులున్నూ, భూగర్భ శాస్త్రజ్ఞులున్నూ, చెప్పుచుండిరి. దీనిని మనమాదరము నిర్విచారముగా నంగీకరించి నమ్మియుంటిమి. కాని భారతీయ వాఙ్మయమునందతిప్రాచీనమైన ఋగ్వేదములో సృష్టికథనమును చెప్పునపుడు నదులకు పుట్టినిల్లుగా హిమాలయపర్వతమును గురించి వినబడుచున్నది. గంగ, యమున, సరస్వతి, దృషద్వతి, అపాయ, శతుద్రి, చంద్రభాగ, సింధు మొదలుగాగల ఆర్యావర్తములోని నదులన్నియు హిమాలయ పర్వతములనుండి పుట్టియున్నవి. ఆ నదులు ఋగ్వేదమునందు వినబడుటవలన వానితోగూడను హిమాలయముగూడ చెప్పబడియుండుట స్పష్టము. ఇదిగాక యజ్ఞమున కతిముఖ్యమైన సోమలత హిమాలయములోని మూజవతి పర్వతమునందును, ఆ చుట్టుప్రక్కలనుమాత్రమే పుట్టిపెరుగును. సింధునది యీ ప్రాంతమునందే పుట్టినందున సోమలత నీటిప్రవాహమున కొట్టుకొని రాబడి సింధునదిలో అచ్చటచ్చట పెరుగుటవలన సింధునదికి "సింధుమాతరా" యని శ్రుతి చెప్పుచున్నది. ఈ సోమమును గురించి చెప్పుటలో ఋగ్వేదమున హిమాలయ పర్వతము వినబడుచున్నది.

శ్రుతి : సోమాసః ప్రథమా; పూర్వ్యాసోమః ఋగ్వే 3-3-3 ౬ 3

తా॥ సోమము సృష్టిలో (ఓషధులయందు మొదట పుట్టినది. అనగా ఓషధులే మొదటపుట్టినవి) మొదటిది; సోమము అతిపురాతనము.

శ్రుతి : "గిరిష్ఠాపీయూషం" (ఋగ్వే 3-౪-౪౮-౨)

తా॥ సోమము హిమాలయమునందుపుట్టిన అమృతమైయున్నది.

శ్రుతి : "దక్షోగిరిష్ఠాః" (ఉత్తరార్చికం ౬-౬-౧)

తా॥ (హిమాలయ) పర్వతమునందు పుట్టిన సోమలత.

శ్రుతి : "గిరుషుక్షయందధా" (ఋగ్వే ౯-౮౨-3)

తా॥ సోమలత జన్మస్థానము హిమాలయము మాత్రమే.

శ్రుతి : "సోమస్యేవ మౌజవతస్యభక్షః" (ఋగ్వే ౧౦-3౪-౧)

తా॥ సోమమునకు ముంజవత్పర్వతమే జన్మస్థానము.

"గిరిర్హిమవతః పృష్ఠే ముంజవన్నామపర్వతః" (భా॥ ౧౪-౮-౧)

తా॥ హిమవత్పర్వతముయొక్క దిగువభాగమున ముంజవత్పర్వతము గలదు.

"మూజవతి పర్వతేజాతో మౌజవతః। తస్యాగ్రత్వహ్యుత్తమః సోమోజాయతే"

తా॥ (హిమాలయములోని) మూజవతి పర్వతమందు బుట్టిన సోమమునకు మౌజవతమని పేరు. అచ్చట పుట్టినవి ఉత్తమమైన సోమము అని శాయనాచార్యులవారు ఋగ్వే ౧౦-౩౪-౧ ఋక్కుభాష్యములో వ్రాసియుండిరి.

వరుణుడు సోమలతను హిమాలయముమీద వ్యాపింపజేసెను- (ఋగ్వే ౫-౬-౧౩-౨)

శ్రుతి: "ఇమేహిమవన్తః" (తై॥ సం॥ ౪-౧-౭-౪)

తా॥ ఈ హిమవత్పర్వతములు

శ్రుతి: "హిమవతో హస్తి" (తై॥ సం॥ ౫-౧-౧౧-౧)

తా॥ హిమవంతునికి యేనుగు (ఉపాసకుడు దానమీయవలెను)

యీ విధముగా ఋగ్వేదాదులయందు హిమవత్పర్వతము చెప్పబడి యున్నందున అది సృష్ట్యాదినుంచియు నుండి యున్నదిగాని మధ్యకాలమున వచ్చి యుండలేదు. హిమాలయ పర్వతముగల చోటున గాని దాని చుట్టు ప్రక్కలగాని యెన్నడును సముద్రము లేదు. అయితే హిమాలయ కొండలమీదకు సముద్రజంతువుల శిలాజములెట్లువచ్చినవని మీరడుగవచ్చును. దానికి మన పురాణాదులిట్లు చెప్పుచున్నవి. ఇప్పుడు జరుగుచుండిన యీ కల్ప సృష్టి ప్రారంభమై యిప్పటికి అనగా కలిశకం ౫౦౪౪ సం॥రముకు (క్రీ॥శ॥ 1944సం॥రంకు) 195,58,85,044 సం॥రములు. జరిగిపోయిన కల్పప్రళయము 432 కోట్ల సం॥రములు. సప్తసముద్రములు యేకమైనందున భూలోక, భువర్లోక, సువర్లోకములు మూడును సముద్రజలముతో నిండియుండెను. దానినుండి తిరిగి భూమియు, ఓషధులు, జంతుసమూహము, మానవులునువచ్చి వృద్ధిపొందిరి. పిమ్మట, ముప్పదికోట్ల సంవత్సరములనగా వక మనువు కాలము జరుగగా తిరిగి జలప్రళయము గలిగి కొంచెమెంచుమించుగా సర్వజీవులు నశించిరి. ఇట్టి మను ప్రళయము 17,28,000 సంవత్సరము

లుండిన తరువాత క్రమక్రమముగా నీరింకి భూమియేర్పడి జీవకోటి వృద్ధిబొందుచుండును. ఈ ప్రకారమున యిప్పటి సృష్ట్యాదిలగాయతు ఆరుమను ప్రళయములు జరిగి భూమి సముద్రజలముతో ఆకాశమెత్తున నింపబడినది. ఏడవ మనువైన "వైవస్వతుని" కాలమురాగానే నీరు పోయి భూమి, పర్వతములు, జీవకోటి తిరిగి యేర్పడి యిప్పటికి పంద్రెండు కోట్ల సంవత్సరములైనది. హిమాలయ పర్వతములు ఆరవ మను ప్రళయమున సముద్రముచే ముంచబడి 17,28,000 సంవత్సర లుండి తిరిగి బయటపడుట వలన సముద్రజంతువుల శిలాజములుండు టకు హేతువైనది. హిమాలయ స్థానమున సముద్రమెప్పుడును లేదు. హిమాలయములిటీవల యేర్పడినవియు కావు. సృష్ట్యాదినుండియునుండి యున్నవి.

## ౧ (ఇ) భువర్లోకము

మనము నివసించెడి యీ భూగోళమునకు మీదిభాగము నారంభించి సువర్లోక పర్యంతముగల ప్రదేశమున్నూ, తిర్యగ్భాగముగా చుట్టూవుండే జ్యోతిశ్చక్రమున్నూ కలిసిన మొత్తం ప్రదేశమునకు భువర్లోకమని వ్యవహరింపబడుచున్నది. దీనియందు మనకు గోచరిం చెడి శన్యాదిగ్రహములకును, అశ్విన్యాది నక్షత్రములకును, మేషాది రాసులకును ఆధారముగానుండి, సర్వతో వృత్తమై మనకు దృష్టి గోచరముకాని స్థానమునకు "భచక్రమని" పేరు. దీనినే జ్యోతిశ్శా స్త్రమందు "భచక్రమ" నియు, "శింశుమార చక్రమ" నియు, జ్యోతిశ్చక్రమనియు, కాలచక్రమనియు, వ్యవహరింపుచున్నారు. ఈ భచక్రము గంపలో సగభాగమం దిముడునట్లమర్చబడిన గుమ్మటము చందమున చక్రవాళపర్వతము నందమర్చబడి యున్నది. ఈ చక్రము చిక్కమున నిమిడియుండే రెండు ఆధార కక్ష్యలతో జేరుకొని యున్నది. ఈ భచక్రము సప్త కక్ష్యావృతమై యున్నది. (ఒకటి, రెండు నెంబర్లు పటములను జూడుడు)

## సప్త కక్ష్యల పేర్లు

౧. శాశికక్ష్య. అందుండే అడ్డరేఖలు ౬౦ న్ని ఘడియలను తెలియజేసే రేఖలు

౨. నక్షత్రకక్ష్య- నక్షత్రములు గలది.

3. శనికక్ష్య. ౪. బృహస్పతి కక్ష్య. ౫. అంగారక కక్ష్య ౬. రవి, బుధ, శుక్రుల కక్ష్య ౭. చంద్రకక్ష్య.

పై సప్తకక్ష్యావృతమైన భచక్రముయొక్క సమమధ్య ప్రదేశమునయుండు వృత్తము (circle) భూగోళము.

శన్యాదిగ్రహములు జ్యోతిశ్చక్రమందు పడమటనుండితూర్పుకు బోవుచున్నవి. ఈ గ్రహాదులకు నాధారముగా నుండిన 'భచక్రము' ప్రతిదినమున్నూ పశ్చిమముగా నొక భ్రమణము జేయుచున్నది. ఇట్టి కాలచక్ర మెట్టుత్రిప్పి కొలిచినను 360 భాగములుగాగాని లేక యిరువదియొక్క వేయి ఆరువందల కళలుగాగాని భారతీయ ఋషులచే యేర్పరుపబడియున్నది. ఈ భచక్రమధ్యమున భూగోళము స్థిరముగా నుంటున్నది.

భారతీయ జ్యోతిష్కులలో కొందరు భూమి నిలుకడగానే యున్నదనియు. జ్యోతిశ్చక్రమంతరిక్ష మందపసవ్యముగా తిరుగుచున్నదనియు, గ్రహములు జ్యోతిశ్చక్రము వెంబడి సవ్యముగా తిరుగుచున్నవనియు, అందువలన సూర్యాదిగ్రహములకు చక్రగతి. స్వగతి యని రెండు గతులు గలిగియున్నవనియు, భూమి బ్రహ్మాండమధ్యమందుండి తన యక్షముమీద (Axis)మాత్రము తిరుగుచుండుననియు చెప్పబడెడి వాదమొకటియు, భూమిజ్యోతిశ్చక్రమున సూర్యుడుండు నాల్గవ కక్ష్యలోనుండి గతిద్వయము గలిగియున్నట్లు చెప్పెడి వాదమొకటియు, రెండువాదములుగలవు ఖగోళ లెఖలేవాదమును తీసికొన్న నుసరిపోవునని కొందరనుచున్నారు. నవీనులు సూర్యుడుతిరుగకుండా స్థిరముగా నున్నట్లును, భూమియేగతిద్వయముతో తిరుగుచున్నదనియు యిటీవలి వరకుచెప్పుచుండిరి. కానిఇప్పుడిపుడు సూర్యుడుకూడా 'గలక్టిక్ సిస్టం' చుట్టును తిరుగుచున్నాడని యంగీకరించుచున్నారు. ఈ ప్రకారమువారు యంత్ర సహాయమువలన గనుగొనుచున్నట్లు ప్రకటించుచున్నారు. ఇంకను పరిశోధనలు జరిగిన మీదట యెట్టిక్రొత్త విషయములు తెలియుచున్నవో జూడవలసి యున్నది. కొందరు యంత్రములు కొంతదూరమే సరిగా జూపగలవుగాని హెచ్చు దూరమును జూపుటలో

దూరమును దగ్గరగాను, దగ్గరను దూరముగాను, జూపవచ్చుననియు, కేవలము యంత్రాధారమైన జ్ఞానము సరియైనదని యంగీకరించుట కవకాశమున్నట్లు గనుపించదనియు, చెప్పుచున్నారు. ఇంకను పరిశోధనలు జేయగా జేయగా మన శాస్త్ర సిద్ధాంతములు సత్యములేనని తెలిసికొని లోకమునకు చాటగల కాలమురావచ్చును. ఇట్టి శాస్త్ర విషయములు పండితులకే వదలుట శ్రేయము. పండితులవలె నటించి నిర్ణయములు జేయుట మామతముకాదు.

## ౯. భూస్థిరత్వ విచారము

“భూభగోళ దీపిక” అను గ్రంథములోని ౧౧౭ ల॥ ౧౨౧ పేజీలలో చెప్పబడియున్న విషయమును శాస్త్రజ్ఞుల ముందు బెట్టుచుంటిని. దీనిని విచారించి సిద్ధాంతీకరించుట వారిపని.

“భూగోళము బ్రహ్మాండ సమమధ్య ప్రదేశమున పరమాత్మ యొక్క ధారణాశక్తివలన ధరింపబడి స్థిరముగా నిలిచియున్నదనియు, యీ భూగోళము నావరించుకొని జ్యోతిశ్చక్రము దక్షిణోత్తర ధ్రువులచే కట్టుబడి ప్రవహ వాయువుచే కొట్టబడి తనయందుగల గ్రహనక్షత్ర గణములతో కూడా సవ్యముగా ప్రత్యహమున్నూ భూగోళము చుట్టునొక భ్రమణము చేయుచున్నదనియు, అష్టవిధ భారతీయ జ్యోతిషసిద్ధాంత గ్రంథములయందును నిర్ణయింపబడి యుండిన పరమ సిద్ధాంతము. ఇదిగాక భూగోళస్థానములో సూర్యుడే ఆత్మప్రదక్షిణము చేయుచున్నాడనియు, సూర్యుడు సంచరింపుచుండే కక్ష్యావృత్తములో భూగోళము ప్రత్యహమున్నూ తనయందు-నివసించే జీవకోట్లకు ఉదయాస్తమయములు కలిగేకొరకై యొక ఆత్మ ప్రదక్షిణము చేయుచున్నదని యెంచేయెడల కలిగే విరోధములను సంగ్రహించి వివరించుచున్నాము.

౧. మఘానక్షత్రము యొక్క సమసూత్రమును ప్రారంభించి చివర స్వాతీనక్షత్రముయొక్క సమసూత్రమును కలిసియున్న సప్తఋషి నక్షత్రములు ప్రతి సంవత్సరమున్నూ మాఘశుద్ధ పున్నమనాడు సాయంకాలం మఘానక్షత్రముతో కూడా యుదయించి, తిరిగి మఘానక్షత్రముతో కూడా అస్తమయమవుచున్నవి. అప్పుడు “ఉక్స్వస్తికద”

మధ్యకీలమునందు స్థిరముగా నమర్చబడి యుండే ధ్రువతారకు తూర్పు దక్షిణము పడమర యీమూడుదిక్కులలో నున్న సప్తఋషి నక్షత్రములు క్రమముగా కనుబడడము ప్రత్యక్షముగా నున్నందున భచక్రమే భ్రమింపుచున్నదని నిశ్చయింపవలసియున్నది. ఈప్రకారము భచక్రమునకు భ్రమణమొప్పుకొనిన పక్షమున దాని అక్షబిలములో నున్న ధ్రువతారలకున్నూ, దానిమధ్య నున్న భూగోళమునకున్నూ, భచక్ర సమమధ్య ప్రదేశమునందు ఆనుకొని తదాధారముగానుండే క్షితిజ మండల మనేనామముచేత బ్రసిద్ధికెక్కిన చక్రవాళపర్వతమునకున్నూ నిశ్చలత్వమవశ్యముగా నంగీకరింపబడదగినదిగా నున్నది. ఈ విషయము బ్రహ్మసిద్ధాంతమందు కంఠోక్తిగా చెప్పబడియున్నది.

శ్లో॥ పంచాచలా మహీమేరుధ్రువౌ క్షితిజమండలం।
అవటస్తమథోభాగం క్షితిజాద్వా ప్రకల్పయేత్॥

తా॥ భూమియు, మేరువును, దక్షిణోత్తరధ్రువములు రెండును చక్రవాళపర్వతమును యీయైదును చలింపనివిగా నున్నవి. (అనగా అచలములు).

౨. రవికక్ష్యలో భూగోళమున్నూ ద్వాదశరాశి సంయోగ స్థానమగు జ్యోతిశ్చక్రనాభి స్థానములో సూర్యుడున్నూ యున్నాడనే పక్షమందు సూర్యుడొక రాశినుండి మఱియొక్క రాశికిపోవుచున్నాడనే వ్యవహారమే లోకమున సంభవింపదు. అందువలన మేషాది రాసుల సంక్రమణప్రయుక్త సౌరమాసములున్నూ కలుగవు. అశ్విన్యాది నక్షత్రములలో క్రమంగా సూర్యుడుండడమువల్ల సూర్యాస్తమయకాలములో ప్రత్యహమున్నూ రవియున్న నక్షత్రమునకు పదునాలుగవ నక్షత్రముదయము కావడము అనుభవముగా జూచుచుండేవారు యేలాగున సూర్యునకు స్థిరత్వము నొప్పుకొందురు? సమస్తదేశస్థులచేతనున్నూ రవియొక్క దిన మధ్యగతి ౫౯ కళలున్నూ ౮ వికళలున్నూ అని నిశ్చయించిన నిశ్చయమునకు భంగమువచ్చును. ఇదిగాక జ్యోతిశ్చక్రములో వారివారి కక్ష్యామార్గములలో సంచరింపుచున్న కుజ, గురు, శనైశ్చరులయొక్క వక్రాస్తమయములు క్రమముగా కలుగక పోవడమువలన బలవత్తర విరోధము పొసగు

చున్నది. అందులో విశేషముగా కుజ స్తంభమున్నూ గుర్వాదిచార మున్నూ గలుగదు. మఱియున్ను భూగోళము ఉభయధ్రువ సమసూత్ర మైన స్వస్థానము విడిచి రవి కక్ష్యలో సంచరించేపక్షములో దేవా సురభాగములయందు నుండువారలకు తత్తద్దేశీయ అక్షభాగలకు తుల్యమైన ధ్రువోన్నతి కాలత్రయములయందున్నూ ఒకతీరుగా నుండదు. ఇదియునుగాక యీ భూగోళమున వసించెడు వారంద రున్నూ వారక్రమమును భానువార ప్రభృతిగానే వ్యవహారింపు చున్నారుగాని వేరుగా వ్యవహరించడము లేదు. పంచాంగ వివేచన విషయములో శనికి నాలుగవకక్ష్యవాడు సూర్యుడు గాకపోతే భాను వారసిద్ధి కలుగనేరదు. ఈ ప్రకారం విచారించగా సూర్యుడు జ్యోతిశ్చక్ర మధ్యమందుండడము, భూమి సూర్యుని కక్ష్యలో నుండి తిరుగుచుండుటయు యసంభవములుగా కనుబడుచున్నవి. సిద్ధాంత విరోధము లనేకములుగా యేర్పడుచున్నవి. గనుక భూమి స్థిరముగా నున్నదనియు సూర్యుడే జ్యోతిశ్చక్రములో నాలుగవ కక్ష్యలోనుండి తిరుగుచున్నాడనియు చెప్పడమే సమంజసము, అని బ్రహ్మ సిద్ధాంత మందు చెప్పబడి యున్నట్లు భూభగోళదీపిక జెప్పుచున్నది. గనుక ఈ విషయమును విచారించి స్థిరపరచుడని శాస్త్రజ్ఞులకే వదలు చుంటిమి. భూమి తిరుగకుండా స్థిరముగా నున్నటుల వేదమంత్రము కూడా వినబడుచున్నది.

శ్రుతి : "భూరింద్వే అచరంతీ చరంతమ్ పద్వంతం గర్భమ పదీదధాతే" తై. బ్రా. ౨ కాండ. ౮. ప్ర. ౪. అను

విద్యారణ్యభాష్యం : "ద్యావాపృథివ్యౌగర్భం సర్వప్రాణి రూపందధాతే, ధారయతః కీదృశ్యౌ ద్వే అచరంతీ క్వాపి అవిచరంత్యౌ స్థిరేయిత్యర్థః, అతఏవఅపదీ, పాదరహితే, నహిగమ నాభావేపాద యోరస్తి కశ్చిదుపయోగః॥"

తా॥ "ద్యులోక, పృథివీలోకములు రెండును, సర్వప్రాణి రూపమైన గర్భమును ధరించుచున్నవి. అవి యెట్టివనగా యెక్కడికిని కదలనివి. అనగా స్థిరములని అర్థము. కనుకనే అపదీ అనగా పాద ములు లేనివి అని చెప్పబడుచున్నది. గమనమే లేనియప్పుడు పాదము

లతో నేమి ప్రయోజనము ?" "భూమి తన అక్షముమీద మాత్రము తిరుగుచున్నట్లు ఋగ్వే ౩-౩-౧-౯
౩-౧-౭-౫
౫-౨-౧౮-౧౦ } ఋక్కులలో వినబడుచున్నది

తన అక్షముమీద తిరుగుచు బ్రహ్మాండ మధ్యమందు కదల కుండా భూగోళమున్నట్లు తెలియబడుచున్నది. గనుక పండితులు బాగుగా పరిశోధించి పర్యవసానము తేల్చవలసి యున్నదని మనవి చేయుచున్నాము.

## ౧౦. పాతాళము

పైన స్వర్గాదులైన అయిదు లోకములును, మధ్యనుండిన మర్త్యలోకమని బిలువబడు భూలోక, భువర్లోకము లనెడి రెండు లోకములును వెరశియేడుగాగల యూర్ధ్వ లోకములను గురించి పైన చెప్పబడినది. ఇకనుమర్త్య లోకమునకు దిగువనుండు యేడు లోకము లకు పాతాళలోకములని పేరు. అందు ౧. అతలము. ౨. వితలము. ౩. సుతలము, ౪. రసాతలము, ౫. తలాతలము ౬. మహాతలము, ౭. పాతాళము, అను పేర్లతో చెప్పబడుచున్నవి. ఈ అతలాది యేడు లోకములకు నుపరిప్రదేశము మహాభూమిచేత నాచ్ఛాదితముగా నున్నందున చంద్రసూర్యులయొక్క ప్రకాశమంత మాత్రమున్నూ కలుగడంలేదు. అచ్చట నిత్యప్రకాశముగల జీవమణులచేతనున్నూ, నానావిధ జ్యోతిః ప్రభగల జ్యోతిష్మత్యాది లతలచేతనున్నూ నాయధోలోకములు శీతోష్ణములులేక నెల్లపుడు నానందకరములగు ప్రదేశములుగా నున్నవి. అందువలన నచ్చట కాలనిర్ణయము లేదు. అవి కర్మభూములుంకావు. ఆ లోకములయందుగల నానావిధ జీవులు వారివారి కర్మానుకూలముగా సుఖదుఃఖముల ననుభవింపుచున్నారు. ఈ అతలాది యేడులోకములున్నూ, వాటియందు తరుచుగావసించెడు జీవుల వివరమున్నూ విశదముగా తెలియజేయబడుచున్నది.

(నెం. ౧ రు పటమును చూడుడు)

| లోకములు | అందువసించెడువారలు |
| --- | --- |
| ౧. అతలము | పిశాచగణములు |
| ౨. వితలము | గుహ్యకులు |
| ౩. సుతలము | రాక్షసులు |
| ౪. రసాతలము | భూతములు |
| ౫. తలాతలము | యక్షులు |
| ౬. మహాతలము | పితృదేవతలు |
| ౭. పాతాళము | పన్నగులు |

ఈలోకములలోని నివాసులు, వారివారి ఋషులతోడను, వారి వారి పరివారములతోడను చేరియున్నారు. బ్రహ్మాండములో వేరు వేరుగా నుండబడిన యీ లోకములను తెలిసికొనలేని హ్రస్వదృష్టులు సృష్టియంతకు యీ భూగోళము మాత్రమే జీవనివాసముగల స్థానమనియు, యింతకు మించి యితరలోకములు లేవనియు, నాయాలోక ములన్నియు, యీ భూమిమీదనే యున్నటుల పూర్వులు భావించిరనియు, పూర్వులకు భూగోళజ్ఞానము లేనందున అమెరికా ఖండమును పాతళముగా భావించిరనియు, టిబెట్టును స్వర్గముగా నెంచిరనియు, బర్మాను బ్రహ్మలోకముగా నెంచిరనియు, మొదలుగాగల యూహలకులోనై నాహీనభావముల గ్రంథములలో నెక్కించి తాము మహా పరిశోధకులమనియు, తమ పరిశోధనల వలన దేనినో గొప్పవిషయము లను తెలిసికొనినటుల వెల్లడించుచు, లోకమునకు మహోపకారులుగా బ్రవర్తించుచున్నారు. ఇది గర్హింపదగిన విషయము. వారు సద్గురువుల నాశ్రయించి శాస్త్రము నభ్యసించుట మేలు.

## అధో లోకములను గురించిన ప్రమాణము

బ్రహ్మాండ పురాణం, లలితోపాఖ్యానం, న్యాసఖండం, పంచమాధ్యాయం.

శ్లో॥ అధోలోకాస్తువై సప్తవ్యాతలో వితలస్తథా।
సుతలశ్చతతః పశ్చాద్రసాతల తలాతలా॥

శ్లో॥ మహాతలశ్చపాతాళోహ్యాం డస్యాద్రే ప్రతిష్ఠితాః॥

శ్లో॥ పిశాచాహ్వాతలాఖ్యేతు వితలే గుహ్యకా స్తథా॥
శ్లో॥ సుతలే రాక్షసా విప్రరసాతల నివాసినః।
భూతా స్తథాయక్ష గణా స్తలాతల నివాసినః॥
శ్లో॥ మహాతలేవైపితరః పాతాళే పన్నగా స్తథా।
ఏతే సర్వేహిసగణాః పరివారైస్స మన్వితాః॥
శ్లో॥ నివసంత్యఖిలాన్ భోగాన్భుంజానాస్స్వ క్రియార్జితాన్॥

## స్కాందము కాశీఖండము ౨౧ అధ్యాయమందు

శ్లో॥ "స్వర్లోకాదపిరమ్యాణి పాతాళాదీని నారదః।
ప్రాహస్వర్గసదాం మధ్యే పాతాళేభ్యస్స మాగతః॥
శ్లో॥ ఆహ్లాదకారిణశ్శుభ్రా మణయో యత్రసుప్రభాః।
నాగాంగాభరణ ప్రోతాః పాతాళం కేనతత్సమం॥"

ఇత్యాది—

## నరకములను గురించిన వాక్యములు

బ్రహ్మాండ పురాణం, లలితో పాఖ్యానం, న్యాసఖండం, పంచమాధ్యాయం.

శ్లో॥ "అధస్తు మేరుదిగ్భాగే నరక స్తత్రవర్తతే।
త్రిఖండాత్మక సోపానం పాపినోధ్యాసతేహితత్॥
శ్లో॥ తత్రప్రథమఖండేతు పాపినోనంగ రూపిణః।
ద్వితీయే ప్రేతరూపాస్తు దుఃఖభాజ స్స్వకర్మణా॥
శ్లో॥ తృతీయే యాతనాకారాస్సూచ్యగ్రే ముక్తపాపినః।
అర్ధాధిక త్రికోటీషు నరకేషు వసంతి తే"

ఇత్యాది—

## ౧౧. అధోలోకములలో నిస్థాన విశేషములు

నెం ౧౯ వ పటమును చూడుము.

౧. కుబేరస్థానము.

ఇది వితలమునందు దానిపేరు అలకాపురము. ప్రభువు కుబేరుడు. గుహ్యకులు, యక్షులు, అసురులు అచ్చట నివసించెడి జీవులు

కుబేరుడు నవనిధులకు అధిపతి. ఇతడు బ్రహ్మాండమునకు కోశాధిపతి. ఈతడుత్తరదిక్కున కధిపతి. అతనికి మనుష్యులకు వలెనే గడ్డము, మీసమున్నూ గలదు. అతడు వక్రదేహి.

౨. మయస్థానము.

ఆవితలమునందే మేరువుకు పశ్చిమ దిశయందు యోగినీ పురము గలదు. దీని కధిపతి మయుడు. గుహ్యకులు, అసురులు అచట నివసించుచున్నారు. ఇతడు రాక్షసులకు శిల్పిగా వుంటున్నాడు. ఇతడు విచిత్రములైన మాయానగరములను ఆకాశములో విహరింప గలవానిని నిర్మింపగలడు. త్రిపురాసురులకు ఆకాశములో చాలా యెత్తున విహరింపగల పురములను మూటిని నిర్మించి యిచ్చి యున్నాడు. వీటికి త్రిపురములని పేరు. గొప్ప యోగశక్తులు గల వాడు. ఈతడొక కాలమున భూలోకమందవతరించి, గొప్ప తపస్సు చేసి సూర్యుని సాక్షాత్కరింపజేసుకొనిన తేజోమూర్తి. ఈతడొక కాలమున భూలోకములోని లంకాద్వీపమును స్వాదీన మొనర్చుకొని పరిపాలించియున్నాడు. ఇతడు సాంగముగా సూర్యసిద్ధాంతమును సూర్యభగవానునియొద్ద నధ్యయనము చేసి నాశాస్త్రమును లోకములో ప్రచార మొనర్చినాడు—సూర్యసిద్ధాంత ప్రచారకాలము యిరువది యొక్కలక్షల అరువది ఆరువేల రెండువందల నలుబది నాలుగు సంవత్సరములు యిప్పటికైనది.

3. యమస్థానము :

మూడవది యగు సుతలలోకములో వైవస్వతపురమనే పట్టణము గలదు. దానికి ప్రభువు యముడు. ఇతనికి యమధర్మరాజు అనియూ పేరుగలదు. ఇతనికి సభికులు పితృదేవతలు, అసురులు, భూలోకమందు ధర్మమార్గము ననుసరించి ప్రజాపరిపాలన మొనర్చిన రాజశ్రేష్ఠులున్నూనై యున్నారు. ఇతడు దక్షిణదిక్కు కధిపతి. ఇతడు పుణ్యాత్ముల కతిసౌమ్య స్వరూపిగాను, పాపుల కతిభయంకరుడు గాన్నూ నగుపడును. జీవుల పుణ్యపాపకర్మలను విచారించి వారివారికి తగిన ఫలముల నొసంగుచుండును. జీవుల పాపపుణ్యముల లిఖించెడి చిత్రగుప్తుడున్నూ, పాపులను శిక్షించెడి యమభటులున్నూ అచ్చట

కలదు. అచ్చట అతిభయంకరములగు నరకములు గలవు. వైతరణి యను అగ్నిహోత్రపునది యీ పట్టణ ప్రవేశమునకు ముందు దాట వలసియుండును. దీనిని దాటుట పుణ్యవంతులకు సులభమును, సౌఖ్యమును యిచ్చును. పాపులకు దుఃఖకరముగా నుండును. గోదానాదుల వలన పాపజీవులు దానిని సులభముగా దాటవచ్చును. కావున మృతులైన బంధువుల నుద్దేశించి గోదానాదుల నొసగు టత్యవసరము.

౪. నిఋతిస్థానము :

రసాతలమునందు పుణ్యాగర మనునది కలదు. దానికి నిఋతి యనెడు దైత్యుడధిపతి. రాక్షసులు, అసురులు, యితనికి సభికులు. ఇతడు నైఋతిదిక్కున కధిపతి.

౫. భేతాళస్థానము :

తలాతలమనెడి యైదవ అధోలోకములో ధనిష్ఠాన పురమను నది కలదు. పిశాచములు, తలాతలవాసులైన యసురులును యితనికి సభికులు. భేతాళుడు అధిపతి.

౬. ఈశానస్థానము:-

మహాతలమునందు కైలాసనగరములో సర్వభూత గణములతో జేరుకొని కాత్యాయనీ పతియగు ఈశానుడు ప్రభుత్వము జేయుచున్నాడు, ఈతడీశాన్య దిక్కున కధిపతి.

౭. విష్ణుస్థానము:-

ఏడవది యగు పాతాళమునందు వైకుంఠనగరము కలదు. అందు శ్రీమన్నారాయణమూర్తి పాతాళాసురులతోనున్నూ వాసుకి మొదలైన నాగశ్రేష్ఠులతోనున్నూ జేరుకొని శేషశాయిగానుండి విలాస గృహీత శరీరుడై సమస్తమును పాలించుచున్నాడు. ఈస్థానమే శ్వేత ద్వీపగతమైన కార్య వైకుంఠము.

ఈ యధోలోకములలో కడపటిదగు పాతాళలోకమునందు మాయబడి యుండే అధోమేరు మూలమునందు త్రిఖండ సోపానమను స్థానముగలదు. అందులో ప్రథమఖండమునందు అనంత జీవులున్నూ, ద్వితీయఖండమునందు ప్రేతగణములున్నూ తృతీయఖండమునందు

యాతనాదేహము నొంది యున్న జీవులున్నూ వసించుచు నిరంతర దుఃఖము ననుభవించుచున్నారు. అందు కావలనుండు సూచ్యగ్రస్థాన మునందు అముక్తపాపులగు జీవులు వాసము చేయుచు చిరకాలదుఃఖులుగా నుంటున్నారు. (వీరి నుద్దేశించియే ద్విజులందరివలనను తమ భోజనాంతమందు జేయుచున్న ఉత్తరాపోశనమందు ఉదక ప్రదానము చేయబడుచున్నది.) మంత్రము: "రౌరవే౽ పుణ్యనిలయే పద్మార్బుద నివాసినాం; అర్థినాముదకం దత్తం అక్షయ ముపతిష్ఠతు" అను మంత్రముతో ఉదకమీయబడుచున్నది.

ఈ యధోలోకములయందుండే నరకప్రదేశములు తప్ప తక్కిన పాతాళలోకములు స్వర్గలోకముకన్న సుఖానుభవ ప్రదేశములై యున్నవి.

ఈ బ్రహ్మాండమందుగల లోకములున్నూ అందలి విశేషస్థానములున్నూ, అగణ్యములుగానున్నవి. ఇప్పుడు మనకు దృగ్గోచరములై యుండే నక్షత్రములన్నియును ప్రత్యేక గోళములు. అదేతీరున మనకు దృగ్గోచరము కాని గోళము లపరిమితముగా గలవు. ఇట్టి అపరిమిత గోళములను గర్భీకరించుకొని యుండెడి నీ బ్రహ్మాండమువలె నుండెడి బ్రహ్మాండము లనేకములున్నవని చెప్పెడు శాస్త్రవచనము లనేకములు గలవు. తొల్లి శూరపద్మాసనుడు ఈశ్వరానుగ్రహముచేత నిట్టి బ్రహ్మాండములను (1008) వెయిన్నెనిమిదింటిని పరిపాలించెనని స్కాంద పురాణ ప్రసిద్ధిగలదు. ఇందువలననె భగవంతునికి అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడనెడు నామము నా మపర్యాయముగా ప్రవర్తిల్లుచున్నది.

ఈ బ్రహ్మాండాంతర్గతస్థానములందు దేవతలున్నూ దేవయోనులున్నూ ప్రతిష్ఠలమందున్నూ వసించుచున్నారు, అదేతీరున స్థానములున్నూ వేర్వేరు స్థలములయందుగలవు. అయితే సుఖానుభవములున్నూ, అధికారభేదములున్నూ వారివారి కర్మానుకూలముగా సంభవించి యున్నవి. మరియు ఇంద్రాదుల అధికారములున్నూ వారివారి కర్మముల చొప్పున పరిమిత కాలమువరకు వుంటున్నవి. కాని, యెల్లపుడును వుండనేరవు. ఉత్తమకర్మానుష్ఠానము వలన మనకును అట్టి

అధికార ప్రాప్తి కలుగవచ్చును. ఇంద్రాది నామములు అధికార నామములని తెలియవలెను.

## ౧౨. దేవయోనులు

ఈ భూగోళమునకు చేరికగా నుపరిప్రదేశమందుండునది మేఘమండలం. అది సప్తమేఘములయొక్క అధిష్టాన దేవతలకు నివాసము. దానికి పైన సప్తమరుత్తుల స్థానము అందు కుపరిభాగమందు ఖేచరులు వాసము చేయుచున్నారు. వారలు పిశాచగుణములుగల వారలై యున్నారు. ఆ పైన విద్యాధరులున్నూ, దానిమీద గుహ్యకులున్నూ, ఆమీద సిద్ధులున్నూ, నివసించుచున్నారు. భూగోళముకున్నూ జ్యోతిశ్చక్రముకున్నూ యుపరిప్రదేశమందుగల ఆకాశభాగమందు పైన చెప్పబడిన దేవయోనులు వరుసగా వేరువేరు స్థలములవసింపుచున్నారు, ఈ భువర్లోకములో నుండెడి రథంతర పురములో "విశ్వకర్మ"యనెడి దేవశిల్పి సపరివారముగా భూఋషులతోను, గంధర్వగణముతోను జేరుకొని శిల్పవిద్యాధికృతుడుగా ప్రభుత్వముచేయుచున్నాడు. ఈ భూగోళమునకున్నూ, ధ్రువమండలముకున్నూ అంతరాళమున నివసించెడు దేవయోనులకున్నూ, స్వర్గలోకాది యూర్ధ్వలోకమునందుగల దేవయోనులకున్నూ విశేష తారతమ్యములేదు.

## ఊర్ధ్వలోకము లనంతములుగా నుండవచ్చును

ఊర్ధ్వలోకము లనంతముగా నుండవచ్చుననియు, అందు యీ భూగోళముమీద జీవకోటి సంచరింపుచున్నటులనే జీవులతో గూడియుండెడి లోకము లనంతముగా వుండవచ్చుననియు, సృష్టిలో యీ భూగోళ మొక్కటియే జీవులతో గూడియున్నదని జెప్పెడివాదము సరిగాదనియు, ఖగోళ పరీక్షల వలన జీవకోటితో నిండియుండెడి బ్రహ్మాండములనేకములుండి యున్నటుల దోచుచుండినట్లును, రాయలు బ్రిటిష్ ఖగోళ శాస్త్రవేత్తయైన 'సర్. హెరాల్డు స్పెన్సరు జోన్సు' అను ఖగోళ శాస్త్రవేత్త ఢిల్లీలో 'ఇండియన్ సైన్సు కాంగ్రెసు' వారిచే యేర్పాటు చేయబడిన 6-1-47 తేదీ సమావేశంలో చెప్పియున్నాడు. ఆయన చెప్పినమాట లిట యుదాహరింపబడినవి—

"One cannot escape from the conclusion that there must be many other worlds where conditions are such

that life can come into existence and where. I think, life will in some form be found."

"There are probably more than a thousand million seperate universes each containing perhaps Something like ,00,000 Million stars (One lakh million stars) and many more beyond our range of Vision" "The question which inevitably comes to our minds at some time or other is: Is it possible that life exists only on this little world on which we live? Of course we do not know how life started on this world of ours. What we do know is that it has somehow, some time come into existence. Different people may have different views about the origin of life. I think it probable - although I cannot prove it - that wherever in creation conditions prevail where life can exist, there somehow in some way life will develope"

"There was a great variety of theories as to how planets in the solar system were formed. 'I will merely say that what has happened once in the case of our own sun giving birth to a system of planets can happen anywhere. It is so difficult to account for, and it is not likely to happen very often. But then, the stars are so many that even if only, say one star in a millon, gave birth to a system of planets, we might expect to find planets, though we cannot expect to find life on more than a relatively small mumber of them because everything seems to be weighted against the possibility of life. Yet there are still so many possibilities that it seems to me that we cannot escape from the conclusion that there must be many other worlds where Conditions are such that life can come into existence and where, I think, life will in some form be found"

"Life in the universe," he said, "Can be compared rather to some rare flower on this earth of ours which is found only in the somewhat special conditions which you won't find everywhere, but which by careful searching here and there you may find-and I think evidence of astronomical observation is that, here and there, scattered throughout our vast universe but comparatively rarely, there must exist worlds on which

possibilities of life exist, and where we should find some forms of life."

(Vide Indian Express. 8-1-1947.)

శా॥ "మనము నివసించుచుండిన యీభూగోళమువంటి ప్రాణులతో గూడిన గోళములనేకములుండి తీరవలెనవియు, అచ్చట యేదో నొక విధమైన ప్రాణులు నివసించుచుండు ననెడిసిద్ధాంతము నొప్పుకొనక యెవరికిని తప్పదని నేను తలచుచున్నాను."

"ప్రతిజగత్తులోను ఒక "న్యర్బుద" సంఖ్య (100,00,00,00,000 = 12 స్థానములు = పదివేలకోట్లు) గల నక్షత్రములతో గూడిన నూరుకోట్లకు మించిన హెచ్చు సంఖ్యగల జగత్తులుండియున్నవి. మన దృష్టి కతీతముగా నింకను హెచ్చుగాను వుండవచ్చును."

"మనము నివసించుచుండిన యీ అల్పజగత్తులో మాత్రమేనా ప్రాణులుండియున్నదను ప్రశ్న మన కొకానొకప్పుడు పుట్టుట కవకాశముగలదు. మనము నివసించుచుండిన యీ ప్రపంచములో ప్రాణులెట్లుత్పత్తిని బొందినవో మనకు తెలియదు. మనకు తెలిసిన దేమనగా! ప్రాణులెప్పుడో యెట్లో సృష్టిలోనికి వచ్చియున్నవని లేక స్థితిని పొందియున్నవని మాత్రము మన మెఱుగుదుము. ప్రాణియుత్పత్తిని గురించి వివిధజనులు వివిధాభిప్రాయములను గలిగియుండిరి. ప్రాణి జీవించుట కనుకూలమగు పరిస్థితు లేర్పడిన ప్రతిచోటను యేదియో నొకవిధముగా ప్రాణి వృద్ధిపొందవచ్చునను విషయము — నేను దానిని ఋజువుపరచ లేక పోయినను — నమ్మదగిన దానిగా తలచుచున్నాను."

"సూర్యకుటుంబములో గ్రహములెట్లుత్పత్తిని బొందినవను విషయమున అనేకవిధములైన వాదములు (లేక ఊహలు) గలవు. మనకు గోచరించుచుండిన యీ సూర్యుడెట్లు అనేకవిధములగు గ్రహమండలము లేర్పడుట కొకప్పుడు కారణభూతమాయెనో, అదే ప్రకారము యింకొకచోట యెచ్చటనైనను కూడా సంభవించియుండవచ్చును. దానిని నిర్ణయించడం కష్టము. అది తరచుగా సంభవించుచుండునది కాదు. అయితే నక్షత్రము లనంతముగా నున్నవి. పదిలక్షల నక్షత్రములలో ఒక నక్షత్రము యితరగోళము లేర్పడుటకు కారణమైనను పది కోట్ల సూర్యకుటుంబములుండి యుండును. అందు కొద్దిగానియుండు

మాత్రమే ప్రాణులుండుట కవకాశముండవచ్చును. ఎందుననగా జీవితము వృద్ధిపొందుటకు వ్యతిరేక అవకాశములే హెచ్చుగా కాన్పించుచున్నవి. అయినప్పటికిని ప్రాణి జీవింపదగిన యితర గోళములుండుటకు సావకాశము గలదను పర్యవసానమునకు మనము రాకతప్పదు. అట్లు ప్రాణులతో గూడిన లోకము లనేకములు గలవని నేను తలచుచున్నాను

"ప్రాణుల యుత్పత్తికి కిరచోట్ల లేని ప్రత్యేక పరిస్థితులు మనము నివసించుచుండిన యీ ప్రపంచమున గలిగియున్నవి. అయినను ఖగోళ పరీక్షవలన ప్రాణి నివసించుట కనుకూల పరిస్థితులు గలిగినట్టియు, ప్రాణులు నివసించుచుండినట్టియు యితరలోకములు సకృతుగా యీ బ్రహ్మాండమునందు గలవని తలచుచున్నాను" అని చెప్పియుండెను.

## ఆధునిక ప్రకృతి శాస్త్రరహస్యము

ప్రతివిషయము యిప్పుడు ప్రకృతి శాస్త్రజ్ఞులచే కనిపెట్టబడినట్లు చెప్పబడుచున్న ప్రకృతి శాస్త్రసిద్ధాంతముల ప్రకారం ఋజువు కావలయుననిన్ని అట్లు ఋజువు చేయుట కనుకూలముకానివాని నొప్పుకొనుటకు వీలులేదనిన్ని కొందరభిప్రాయ పడుచున్నారు. ప్రస్తుత కాలమున ప్రకృతి శాస్త్రజ్ఞులచే (Scientists) కనిపెట్టబడినటుల చెప్పబడుచున్న విషయములు వారు యూహించి చెప్పుచున్నవనియు, అవన్నియు నిజము కావనియు, వాటి ననుసరించి యితర విషయములను సమన్వయపరుప జూచుట కవకాశముండదనియు, గొప్ప ప్రకృతి శాస్త్రజ్ఞులని పేరొందినవారలే వ్రాసియుండిరి. వారిచే వ్రాయబడిన పంక్తులనిందు బొందుపరచుచుంటిమి.

"జీన్సు జేమ్సు" ( Prof Jeans James ) అను గొప్ప ఖగోళ శాస్త్రజ్ఞుడు తనచే వ్రాయబడిన "Mysterious Universe" అను గ్రంథములో నిట్లు వ్రాసియున్నాడు.

" Every conclusion is quite frankly speculative and uncertain. We are not in contact with ultimate reality."

తా॥ మాచే కనుగొనబడినట్లు చెప్పబడుచున్న ప్రతి పర్యవసానము న్యాయముగా విచారించిన ఊహాజనితముగాని నిజమైనది

కాదు. సత్యవస్తువుతో మాకింకను సంబంధము కలుగలేదు. అనగా సత్యము నింకను మేము తెలుసుకొనియుండలేదు అనిచెప్పియుండెను. "హాల్డెన్ పండితుడు" (Prof. Haldane) తనచే వ్రాయబడిన "Possible worlds" (అనేక లోకములుండవచ్చును.) అనెడి గ్రంధములో యిట్లు వ్రాసియున్నాడు.

"Every statement of a modern Physicist is false. Many of our most cherished Scientific theories contain so much falsehood as to deserve the title of myths"

తా॥ "అధునిక ప్రకృతి శాస్త్రజ్ఞులచే (కనుగొనబడినట్లు) చెప్పబడుచున్న ప్రతి వాగ్మూలము శుద్ధ అబద్ధము. మాచే కనుగొనబడిన గొప్ప ప్రకృతిశాస్త్ర పరిశోధనలు గొప్ప అబద్ధములతో కూడియున్నవి. అవి కల్పిత కధలని చెప్పబడుటకు తగినవి" అని వ్రాసియున్నాడు.

"ప్లాంకు అను పండితుడు (Prof Planck) తనచే వ్రాయబడిన "where is Seience going" అను గ్రంధము 217 పేజీలో నిట్లు వ్రాసియున్నాడు

"Science Cannot solve the ultimate mystery of Nature"

తా॥ "మన శాస్త్రపరిశోధనలు ప్రకృతి రహస్యములను తెలిసికొనలేవు" అని వ్రాసియున్నాడు. గనుక ప్రకృతి శాస్త్ర పరిశోధనల కనుకూలముగా వుండవలయునని పిచ్చివాదము నొదిలి భారతీయులు అనాదినుండియు ప్రకృతిసిద్ధముగా వచ్చుచుండినట్టిన్ని సంపూర్ణ సిద్ధాంతములైనట్టిన్ని తమ వేదశాస్త్రాదుల నధ్యయనము చేయుట మేలు.

## ౧౩. గ్రహగత్యాదులు

(నెం ౧,౨ ర్లు పటములను చూడుము)

(ఇందు చెప్పబడిన యోజనము $4\frac{1}{2}$ యింగ్లీషు మైళ్ళు అని గ్రహింపవలెను.)

౧. శని:-

జ్యోతిశ్చక్రమందన్ని గ్రహకక్ష్యలకు నుపరిభాగమందుండే సర్వోన్నతి కక్ష్యయందు సంచరింపుచున్నాడు. ఈ శనికక్ష్య నక్షత్ర కక్ష్యకు దిగువభాగమున నున్నది. ఈ శనిమండలము మెరుగుపెట్టిన నల్లసీసమువలె నుండును. విశేష ప్రకాశముగలది కాదు. దీని మండల విష్కంభ పరిమాణము ౧౪౭౭౬ యోజనములు. ఇది పశ్చిమము నుండి తూర్పుకు నడచును. దినమునకు ౧౧౮౫౮ యోజనము 43 వియోజనములున్నా నడచును. దీని నడకను కళాక్రమమున లెక్క వేసిన ౨ కళలు వకవికళ అవుచున్నది. ఇతని కక్ష్యాప్రమాణము ౧౭,౭౬,౬౪,౨౨౫ యోజనములు. భూగోళమునకు గల నిరక్షప్రదేశమునకు (ఈక్వేటరుకు) సరిగా ౨,౩౧,౯౭,౩౦౦ యోజనముల యెత్తు నవున్నది. ఇది ౨౯ సంవత్సరముల ౧౫౭ దినములకు భచక్రము నొకమారు చుట్టి వచ్చుచుండును. ఇట్లు ఒక మహాయుగములో ౧,౪౬,౫౬౮ సార్లు జ్యోతిశ్చక్రమును చుట్టివచ్చును.

౨. బృహస్పతి:-

ఈ గ్రహము శనికక్ష్యకు దిగువనున్నది. బృహస్పతి మండలము మిక్కిలి ప్రకాశముగల పుష్యరాగమువలె బంగారుచాయ గలిగి యుండును. ఇతని విష్కంభ పరిమాణ యోజనములు ౮౩౨౫ నడక దినమునకు ౧౧,౮౫౮ యోజనముల ౪౩ వియోజనములు లేక ౪ కళల ౫౯ వికళలు. కక్ష్యాప్రమాణము ౫,౧౩,౭౫,౭౬౪ యోజనములు, నిరక్షప్రదేశమున కుపరిభాగమున ౮౧,౨౬,౭౪౩ యోజనముల యెత్తునవున్నాడు. ఇతడు పండ్రెండు (౧౨) సం॥ రములకు భచక్రము నొక్కసారి చుట్టివచ్చును. ఒక మహాయుగమునకు ౩,౬౪,౨౨౦ భ్రమణములు చేయును.

౩. అంగారకుడు :-

గురుకక్ష్యకు దిగువ భాగమునసుండును. శుక్ర, బృహస్పతుల మండలములకన్న చిన్నది. పగడమువలె యెరుపుమించిన వన్నెకలదిగా నున్నది. మండల విష్కంభ పరిమాణము ౭౫౪ యోజనములు.

నడకదినమునకు ౧౧౮౫౮. యోజనముల ౪౩ వియోజనములు, లేక ౩౧ కళల ౨౧ వికళలు. కక్ష్యాప్రమాణము ౮౧,౪౬,౯౦౯ యోజనములు భూగోళ నిరక్షప్రదేశమునకు ౧౨,౯౫,౯౧౧ యోజనముల యెత్తున నున్నాడు, ఒక సం॥ర ౩౨౧ దినములలో భచక్రము నొక మారు చుట్టును. ఒక మహాయుగమునకు ౨౨,౯౬,౮౩౨ భ్రమణములు చేయును.

౪. సూర్యుడు :-

అంగారక కక్ష్యకు దిగువ నితని కక్ష్యగలదు. గ్రహకక్ష్యలలో మధ్య కక్ష్యలో నున్నాడు, అన్ని గ్రహమండలముల కన్న సూర్యమండలము గొప్పది. మిక్కిలి ప్రకాశముగలిగి యితర గ్రహమండలములకు నక్షత్రములకు ప్రకాశము నిచ్చుచున్నాడు. మండల విష్కంభ పరిమాణ యోజనములు. ౬౫౦౦ ఇతను ౩౬౫ దినముల ౧౫ ఘడియల ౩౧ విఘడియలలో భచక్రము నొక్కమారు చుట్టుచున్నాడు. ఒక మహాయుగమునకు ౪౩,౨౦,౦౦౦ భ్రమణములు జేయును ఈ భ్రమణములే జ్యోతిశ్శాస్త్రమందు సౌరమాన సం॥రము లని వ్యవహరింపు చున్నారు. ఇతని నడకదినమునకు ౧౧౮౫౮ యోజనముల ౪౩ వియోజనములు లేక ౫౯ కళల ౮ వికళలు, ఇతని కక్ష్యా ప్రమాణము ౪౩,౩౧,౫౦౦ యోజనములు భూగోళ నిరక్ష ప్రదేశమునకు ౬,౮౮,౬౨౭ యోజనముల యెత్తున నున్నాడు.

సూర్యుడు భువనములమధ్య తిరుగుచున్నాడని తైత్తిరీయారణ్యకము ౪ ప్రశ్నము ౭ అనువాకం ౧ మంత్రములో చెప్పబడియున్నది.

మంత్రము : "అపశ్యం గోపామని పద్యమానం।
ఆచ పరాచ పథిభిశ్చరన్తం।
సస్ర్ధీ చీస్సవి షూచీర్వసానః।
ఆవరీవర్తి భువనేష్వన్తః॥"

నాల్గవ పాదమునకు బ్రాహ్మణము :—

"అవరీవర్తి భువనేష్వన్తరిత్యాహ । ఆహ్యేషవరీవర్తి భువనేష్వన్తః।"

విద్యారణ్య భాష్యం :—

“చతుర్థ పాదోక్తా భువనమధ్యే సూర్యస్యావృత్తిః ప్రసిద్ధేతి దర్శయతి॥ ”

తాత్పర్యం :- చతుర్థ పాదములో చెప్పబడినదే మన :- “భువనముల మధ్యను సూర్యుడే తిరుగుచున్నాడ”ని ప్రసిద్ధముగా తెలిసిన విషయమేనని శ్రీ విద్యారణ్య స్వాములు భాష్యములో వ్రాసియున్నారు —

మఱియు :

ఐతరేయ బ్రాహ్మణము తృతీయ పంచికా చతుర్థాధ్యాయమున నలుబది నాలుగవ మంత్రమున (ఐత 3-4-44) సూర్యుని చలనమును గురించి యిట్లు చెప్పబడియున్నది.

శ్రుతి :- “ సవా ఏష న కదాచనాస్తమేతి నోదేతి తం యదస్తమేతీతి మన్యంతే అహ్న ఏవ; తదంతమిత్వాథాత్మానం విపర్యస్యతే; రాత్రీమే వావస్తాత్కురుతేహః పరస్తాదథయదేనం ప్రాతరుదేతీతి మన్యంతే రాత్రేరేవ తదంతమిత్వాథాత్మానం విపర్యస్యతేఽహరేవావస్తాత్కురుతే; రాత్రీం పరస్తాత్సవా ఏష న కదాచన నిమ్రోచతి। నహ వైకదాచన నిమ్రోచత్యే తస్యహ సాయుజ్యం సరూపతాం సలోకతామశ్నుతే; య ఏవం వేద య ఏవం వేద ”॥

తా॥ సూర్యుడెప్పుడును ఉదయింపడు. అస్తమింపడు. సూర్యుడు అస్తమించినాడని జనులు తలచెదరు. కాని అది అట్లుకాదు. ఎందువల్లననగా పగటికాలము పూర్తియగుచుండగా యిచ్చట దిగువనుండెడివారికి రాత్రి (గోళముకు) రెండవవైపున వుండువారికి పగలు యనెడి రెండు వ్యతిరేక ఫలముల కలుగజేయును. ఉదయమున సూర్యుడుదయించుచున్నాడని తలచుటనగా రాత్రికాలముకు చివరను పొందగా యిచ్చట దిగువ నుండెడివారికి పగలు (గోళముకు) రెండవవైపున వుండువారికి రాత్రియనెడి రెండు వ్యతిరేక ఫలములు కలుగుచున్నవి. సత్యమేమన సూర్యుడెప్పుడును అస్తమింపడు (లేక ఉదయింపడు. ఎల్లప్పుడు ప్రకాశమానుడుగా నున్నాడని అర్థము.)

౫. శుక్రుడు :-

ఇతని కక్ష్య సూర్యగ్రహాకక్ష్యకు దిగువ ఆ కక్ష్యతో యొరుసు కొని చేరి యుంటున్నది. మండల విష్కంభ పరిమాణము ౮౦౦ యోజనములు. నడక దినమునకు ౧౧,౮౫౮ యోజనముల ౪౩ వియోజనములు లేక ౫౯ కళల ౮ వికళలు. కక్ష్యాప్రమాణము ౪౩,౩౧,౫౦౦ యోజనములు. నిరక్ష ప్రదేశమునకు ౬,౮౮,౬౭౭ యోజనముల యెత్తున వున్నాడు. సౌరమాన సంవత్సరమునకొక భ్రమణము చేయుచున్నాడు. ఒక మహాయుగమునకు ౪౩,౨౦,౦౦౦ భ్రమణములు చేయును.

౬. బుధుడు :-

శుక్రకక్ష్యకు చేరి దిగువ నీతని కక్ష్యయున్నది. శుక్రునికన్న చిన్నమండలము. స్ఫటికమువలె తెల్లనివర్ణము గలది. ఇతడు సూర్యుని విడచి ౨౭ భాగములకంటె అధికముగా సంచరించడు. విష్కంభ పరిమాణము ౬౦౧ యోజనములు. నడక దినమునకు ౧౧,౮౫౮ యో॥ ౪౩ వియోజనములు. లేక ౫౯ కళల ౮ వికళలు. కక్ష్యాప్రమాణం ౪౩,౩౧,౫౦౦, యోజనములు. నిరక్ష ప్రదేశమునకు ౬,౮౮,౬౭౭ యెత్తున వున్నాడు. సంవత్సరమున కొకటి చొ॥ మహాయుగమునకు ౪౩,౨౦,౦౦౦. భ్రమణములు చేయును.

౭. చంద్రుడు :

అన్ని గ్రహములకు దిగువ భూగోళమున కుపరిభాగమున నున్నది. మండలము నిర్మలోదక చ్ఛాయ గలదిగా నున్నదిగాని స్వతంత్ర ప్రభ గలదికాదు. సూర్యప్రభ తగలడంచేత నిర్మల స్ఫటిక చ్ఛాయవలె విశేష కాంతిగలదిగా నుంటున్నది. మండల విష్కంభ పరిమాణము ౪౮౦ యోజనములు. నడక దినమునకు ౧౧,౮౫౮. యోజనములు ౪౩ వియోజనములు. లేక ౧౩ భాగల ౧౦ కళల ౩౬ వికళలు గలది. ఇతని కక్ష్యా ప్రమాణము ౩,౨౪,౦౦౦. యోజనములు. నిరక్షరేఖకు ౫౦,౭౭౦ యో॥ యెత్తున వున్నాడు. ఇతడు ౨౭ దినముల ౧౬ ఘడియల ౧౪ విఘడియలకు ఒక భచక్రభ్రమ

ణము జేయును. ఒక మహాయుగమునకు ౫,౭౭,౫౩,౩౩౬ భ్రమ ణములు చేయును.

## ౧౪. చంద్రగ్రహణము

సూర్యుడు నడకవశమువలన భూగోళమునకు దిగువ భాగము నందున్నప్పుడు భూగోళచ్ఛాయ ఉపరిభాగమున వ్యాపించును. అట్టి భూచ్ఛాయలోనికి చంద్రుడు పాతగ్రహమగు రాహువుచే (అనగా రాహుగ్రహాధిష్ఠాన పురుషునిచే) నీడువబడి ఆచ్ఛాయయందు సంచరించెడు కాలమున చంద్రుని బింబప్రకాశము యథారీతిగ కలుగక తమోబింబాకృతమై యుండును. దానినే చంద్ర గ్రహణమని చెప్పుదురు. ప్రతి చంద్రగ్రహణమందున్నూ చంద్రుడు విక్షేపవశమున పశ్చిమమునుండి తూర్పుదిక్కునకు చరించునెడల భూచ్ఛాయలోకి రాహువుచేత (రాహుగ్రహాధిష్ఠాన పురుషునిచేత చంద్రాధిష్ఠానదేవత) ప్రవేశింప జేయబడుచున్నాడు. గాన ప్రతి చంద్రగ్రహణ మందున్నూ బింబమునకు తూర్పుదిక్కు నుండు భూచ్ఛాయ స్పర్శ యెల్లప్పుడు తొలుత కలుగుచున్నది. పిమ్మట పశ్చిమ దిక్కున భూచ్ఛాయామోక్షము యెల్లపుడును తటస్థ మగుచున్నది.

## ౧౫. సూర్యగ్రహణము

భూగోళమున కుపరిభాగమున సూర్యు డుండునెడల రాహు ప్రేరితుడై చంద్రుడు గతి (నడక) వశమున నాభూగోళమునకున్నూ సూర్యునకున్నూ నడుమ సమకక్ష్యయందు కాలవిశేషములో వచ్చుచున్నాడు. అప్పుడు చంద్రబింబము సూర్యబింబము నాచ్ఛాదించుచున్నది. అట్టి కాలమందు సూర్యబింబ ప్రకాశము మనకు యథా రీతిగా నుండక బింబావృతమైనట్లు ప్రత్యక్షముగా కనుబడుచున్నది. ఇదియే సూర్యగ్రహణమని వ్యవహరింప బడుచున్నది. ఈ సూర్య గ్రహణము తటస్థమగునపు డంతా చంద్రుడు పశ్చిమ దిశనుండి తూర్పు దిక్కునకు సంచరించుచున్నాడు. గాన సూర్య బింబమునకు ప్రతిగ్రహణ మందున్నూ పశ్చిమ దిక్కున తొలుత బింబస్పర్శ కలుగు

చున్నది. ఎల్లప్పుడు తూర్పుదిక్కున బింబమునకు మోక్షము కలుగుట సంభవమగుచున్నది. ఇట్లు చంద్రబింబము సూర్యబింబము నాచ్ఛాదించడమే సూర్యగ్రహణమని చెప్పబడుచున్నది. (సిద్ధాంత శిరోమణి; సూర్య సిద్ధాంతం చంద్రగ్రహణాధ్యాయము.)

ఈ భచక్రము సమస్త గోళములయందు నివసించెడువారికిన్ని నిఖిలార్థ సూచకముగా నుంటున్నది. దీనియందుండు గ్రహచలనాదుల వలన మనకు తిథి, వార, యోగ, నక్షత్ర, కరణాదులు కలుగుచున్నవి. ఇందువలన లౌకిక, వైదిక క్రియలు యథాశాస్త్రముగా జరుగుచున్నవి. మాలిమిసంత్రాను సారముగా దిఙ్నిర్ణయాదులు చేసుకొని ఓడలు మొదలయినవానిని నడుపుచున్నారు. ఆయా కాలము లలో వృష్ట్యాదులు ఫలోన్ముఖ మగుటకున్నూ యీ గ్రహచలనాదులే కారణములు. ఈ గ్రహాదుల చలనాదులకున్నూ జీవకోటికిన్ని యొక్క విచిత్ర సంబంధము కలిగియుండుట వలన సమస్త జీవకోటికి కాలక్రియ ములయందు వారివారి కర్మానుకూలముగా కలిగే సర్వవిషయముల నున్నూ తెలియజేసి పరమేశ్వరుడు తన సర్వవ్యాపకత్వ, సర్వాంత ర్యామిత్వ, సర్వజ్ఞత్వ, సర్వకర్తృత్వ, సర్వభోక్తృత్వ, సర్వసంహారక త్వాది నిఖిల శక్తులను ప్రకాశపరచుచున్నాడు.

N. B. ఇందుగల యీ వర్ణ్యవిషయములను వాటికి సంబంధించిన పటములలో నిదానించి చూచి అవగాహన చేసుకొనవలయును.

## ౧౬. పంచాంగ వివరములు

పంచాంగ మనగా:—

౧, వారము, ౨, తిథి, ౩ నక్షత్రము. ౪, యోగము ౫, కరణము, అను నీమైదిటిని దెలుపునది పంచాంగము.

---

ఈమైదును సూర్యచంద్రుల చలనాదులవలన నేర్పడుచున్నవి. వాటి వివరమీదిగువ నీయబడినది. దీనివలన కూడా సూర్యాదిగ్రహములే తిరుగుచున్నవనిన్ని భూమినిలకడగానే యున్నదనిన్ని స్పష్ట పడగలదు.

౧ వారము :-

సూర్యోదయము లగాయితు తిరిగి సూర్యుడుదయించు కాల పర్యంతము గల కాలము వారమని నిర్ణయింపబడినది. దీనినే 'దినము లేక' రోజు' అని వ్యవహరించుచున్నారు. పై ప్రకరణములో వివరింప బడిన తీరున ౧ శని ౨ గురువు 3 అంగారకుడు ౪ సూర్యుడు ౫ శుక్రుడు ౬ బుధుడు ౭ చంద్రుడు యీవరుస ప్రకారము గ్రహములు సూర్యోదయము లగాయితు తిరిగి సూర్యోదయమగు వరకు జరిగెడు యిరువది నాలుగుగంటలలో పై నుండిన శని లగాయితు వరుసగా ప్రతి గ్రహము యొక్కొకగంట కాలమాధిపత్యము వహించుచురాగా యిరు వదినాలుగుగంటలలో గ్రహము లేడును వరుసగా ముమ్మారాధిపత్యము వహించుచురాగా యిరువదియొక్క గంటలు గడచును మిగిలెడి మూడుగంటలలో మొదటిగంటకు అనగా యిరువదిరెండవ గంటకు తిరిగిశని ఆధిపత్యము వహించును. యిరువదిమూడవ గంటకు గురువు. యిరువదినాలుగవ గంటకు అంగారకుడును ఆధిపత్యము వహింతురు. అంతటితో యిరువదినాలుగు గంటలుగల ఆరోజుపూర్తికాగా మరు రోజు ప్రారంభమున మొదటిగంటకు నాలవగ్రహమైన సూర్యుడు అధి పతి యగును. రోజులో మొదటి గంట కధిపతియైన గ్రహనామముచే నారోజు పిలువబడును. సూర్యుడధిపతియైన మొదటిగంట గల రోజుకు "ఆదివారము" అని పేరు: అట్లు ప్రతిరోజులోను గల 24 గంటలలో ఏడుగ్రహములు వరుసగా యొక్కొకగంట కాధిపత్యము వహించుచు రాగా మూడావర్తులైన పిమ్మట 22వ గంటకుతిరిగి సూర్యుడును. 23వ గంటకు శుక్రుడును 24 గంటకు బుధుడున్నూ అధిపతులగుదురు. అంత టితో ఆరోజు అంతరించి దాని తరువాత రోజు వచ్చును. తరువాత రోజు సూర్యోదయవేళనుండి బుధుడికి పిమ్మట గ్రహమైన చంద్రుడు ప్రథమగంట కధిపతియగును. చంద్రుడు ఆధిపత్యము వహించిన ప్రథమ గంటగల రోజుకు చంద్రుని పేరుగల 'సోమవార'మని పేరు. ఈ ప్రకా రము లెక్కింపగా ఆది సోమ, మంగళ, బుధ, గురు, శుక్ర, శని వార ముల చక్రము తిరుగుచుండును. ఈ చక్రములో యేవారమువద్ద ప్రారం భించినను వరుసతప్పక వచ్చుచునేయుండును. సూర్యుడు గ్రహరాజగుట

వలనను, సృష్ట్యాది సూర్యుడు ప్రథమ హోరాధిపతిగా నుండిన ఆదివార మగుటచేతను మనము ఆదివారము నారంభించి లెక్కించెడి ఆచారము సృష్ట్యాదినుండి అనగా 196 కోట్ల సం॥రములనుండి యుండియున్నది గాని ఖగోళశాస్త్రజ్ఞులు కల్పించినది కాదు వారు అనాదిగానుండి యుండిన శాస్త్రమును గురుపరంపరా నధ్యయనముచేసి నానుండిన కాలములలోని జనులకు సులభముగా బోధపడులాగున వారిపేర్లతోగాని లేక యింకొక పేరుతోగాని శాస్త్రవిషయములను గ్రంథరూపముగా నొనర్చిన శాస్త్ర ప్రచారకులే గాని శాస్త్రకర్తలుకారు.

ఈ గ్రహములయొక్క కక్ష్యలలో క్రమముగా నాలవవాడగు సూర్యుడు ప్రథమ వారాధిపతిగాగలది ఆదివారం. ఆ సూర్యుడు మొదలుకొని లెక్కింపగా నాలుగవ వాడగు చంద్రుడు ద్వితీయ వారాధిపతియగును, అది సోమవారం చంద్రునకు నాలగవవాడు అంగారకుడు తృతీయ వారాధిపతిగాగలది మంగళవారం అంగారకునికి నాలగవ వాడు బుధుడు. అతని ప్రథమ హోరాధిపత్యము గలది బుధవారం బుధునికి నాలవవాడు. బృహస్పతి. అతనిది గురువారం. గురునికి నాలవవాడు శుక్రుడు అతనిది శుక్రవారం. శుక్రునికి నాలవవాడు శని. అతనిది శనివారం. యీ ప్రకారము వారముల నామములు గ్రహ నామముల ననుసరించి వాని ఆధిపత్యము కారణముగా గలిగియున్నవి. ఈ వరుసక్రమముగానే ప్రపంచమందున్న జాతులవారును వారము లను లెక్కించుకొనుచుండిరి. కాని ఆదివారమునకు పిమ్మట సోమ వార మెందుకు వచ్చినదో వారి వాఙ్మయమం దెచ్చటను గానరాదు. ఆ గౌరవము భారతీయులకే దక్కినది. భారతీయులైన యీ వార నామములనే యితరు లందరనుసరించుచుండిరి.

౨. తిథి :-

సూర్య చంద్రు లిరువురు వారివారి కక్ష్యలయందు సంచరించు నెడల ప్రతీ అమావాస్య యందునూ, ఆ సూర్యచంద్రులు సమకళలో చేరుచున్నారు. అది మొదలు చంద్రుని కక్ష్య సూర్యుని కక్ష్యకంటె నల్పముగా నుండుటవల్ల చంద్రుడు త్వరగా సంచరింపు చున్నాడు.

అప్పట్లో సూర్యునికంటె ముందుగా ౧౨ అంశలు చంద్రుఁడు మించిన పక్షమందు ఒక తిథి కలుగుచున్నది. అందు ప్రథమ తిథి ప్రతిపత్తని (పాడ్యమి.) న్ని, రెండవది ద్వితీయ (విదియ) అనిన్ని యీ తీరున అమావాస్య వరకు ముప్పది తిథులున్ను కలుగుచున్నవి. ఈ ప్రకారమైన తిథులు వాడుక యితర దేశస్థు లెరుగరు —

3. నక్షత్రము :–

చంద్రుఁడు మేషాది రాసులయందు సంచరించు నెడల ప్రతి దినమున్ను పదమూఁడు అంశలు యిరువది కళలున్ను సంచరించుచున్నాఁడు. అదియె నక్షత్రమానము. ఈ తీరున యిరువదియేడు దినములకు అశ్విన్యాది నక్షత్రములయందు సంచరింపుచున్నాఁడు. గాన నక్షత్రములు చంద్రుని ప్రతిదిన సంచారమువల్ల కలుగుచుండును.

౪. యోగము :–

చంద్రసూర్యులు వారివారి కక్ష్యలయందు సంచరించునప్పుడు వారి సంచార గతకాలము సిద్ధాంత గణితము చొప్పున కళాక్రమముగా జేర్చి యెనిమిది వందల కళల కొక యోగముచొప్పున విష్కంభాది యిరువది యేడు యోగము లూహింపబడుచున్నవి.

౫. కరణము :–

ప్రతి తిథియొక్క అర్ధాంశము యొక్కొక కరణము చొప్పున బవకరణాది పదకొండు కరణములున్ను తిథికి రెండు కరణముల వంతున కలుగుచున్నవి. ఈ తీరున కలుగు నెడల బవ, బాలవ, మొదలుకొని శకునివరకు గల యేడు కరణములు శుక్లపక్ష ప్రతిపదుత్తరార్ధము మొదలుకొని చూచుకొనవలసినది. భద్రాది నాలుగు కరణములు మాత్రము కృష్ణపక్ష చతుర్దశ్యుత్తరార్ధము మొదలుకొని శుక్లపక్ష ప్రతిపత్పూర్వార్ధము వరకు ఆ నాలుగు నిశ్చయముగా నుంటున్నవి.

ఈ ప్రకారముపైన చెప్పబడిన అయిదంగములును సూర్య చంద్రుల చలనమువలన కలుగుచున్నవని స్పష్టపడుచున్నది. ఇదిగాక సృష్ట్యాది కాలము, మన్వాదులు, మహా యుగాదులు, శకాదులు, సంక్రాంతులు, విషఘడియలు, అమృతఘడియలు, మహాపురుష జయం

తులు, మొదలైన కన్నియో పంచాంగములు యుం మహాహారింపబడు చున్నవి, ఇప్పటి హూణ విద్యాధికులు పంచాంగమునైనను చూచు కొనెడి యోగ్యత సంపాదించలేనంటివారు విచారింపవలసి యున్నది. తమ జాతీయతకు మూలకందమగు తమ సాంప్రదాయములనే మరచిన వీరలచే జెప్పబడెడి జాతీయత యననేమియో చదువరులే యూహించు కొందురుగాక.

## ౧౭. సంఖ్యామానము

సూర్య సిద్ధాంతము ననుసరించి ప్రతి సం॥ రమునను వ్రాయ బడుచుండిన మన పంచాంగముల ప్రకారం కలి 5044 (క్రీ॥శ 1944 సం॥రం) సం॥రం నాటికి బ్రహ్మదేవుని వయస్సు దేవమానము ననుసరించి యేబది సంవత్సరముల పదమూడు ఘడియల నలుబది రెండు విఘడియలు. బ్రహ్మదేవునికి గడచిన యేబది సంవత్సరములు గాక యేబదియొకటవ సంవత్సరము ప్రథమ దినమున 13 ఘడియల నలుబదిరెండు విఘడియలనగా 195,58,85,044 మానవ సం॥రములు ప్రొద్దు గడచినది. ఏబది సంవత్సరములను మానవ సం॥రములకు మార్చిన 50 $\times$ 360 = 18,000 బ్రహ్మరోజులు వచ్చును. వీనికి కల్పములని పేరు. ౧బా కల్పములు (అనగా బ్రహ్మరోజులు) రెండు భాగములుగా నున్నవి. ౧ ఉదయకల్పము. ౨. క్షయకల్పము. ఉదయ కల్పమనగా బ్రహ్మకు పగటి కాలము. క్షయకల్పమనగా బ్రహ్మకు రాత్రికాలము. ఈ రెండును చేరిన బ్రహ్మకు ఒకరోజు. ఉదయకల్పము 432 కోట్ల సం॥రములు. క్షయకల్పముకూడ నంతకాలముండును. కనుక బ్రహ్మకొక అహోరాత్రము (రోజు) అనగా 432 + 432 = 864 కోట్ల మానవ సం॥రములు. బ్రహ్మకు యిప్పటికి గడచిన యేబది సంవత్సరములు అనగా 18,000 అహోరాత్రములు (రోజులు) మానవ సంవత్సరములకు మార్చిన 18,000 $\times$ 864 = 1,55,52,000 (ఒకకోటి యేబదియైదు లక్షల యేబది రెండువేల కోట్లు) కోట్ల మానవ సం॥రము లగును. దీనికి 13-42 ఘడియలు అనగా 195,58,85,044 సం॥రములు చేర్చిన (1,55,52,000 + 195,58,85,044 + బ్రహ్మధ్యాన కాలము 1,70,64,000 = )1,55,52,197 కోట్ల యిరువది తొమ్మిది లక్షల

నలుబదితొమ్మిదివేల నలుబదినాలుగు. అనంతమైన యిట్టి కాలమును కొలుచుటకు మన సంఖ్యామాన మేర్పరుపబడినది. ఇట్టి సంఖ్యామాన మితర దేశస్థులకేరికి నింతవరకుండి యుండలేదు. దాని వివరము దిగువ నీయబడినది.

| సంఖ్య | స్థానములు | సంఖ్యావాచకము (సంఖ్య అనగా సంఖ్యపేరు) |
|---|---|---|
| 1 | 1 | ఒకటి |
| 10 | 2 | పది |
| 100 | 3 | వంద |
| 1000 | 4 | వేయి లేక సహస్రము |
| 10000 | 5 | పదివేలు |
| 1, 5 సున్నాలు | 6 | లక్ష |
| ,, 6 ,, | 7 | దశలక్ష |
| ,, 7 ,, | 8 | కోటి |
| ,, 8 ,, | 9 | దశకోటి |
| ,, 9 ,, | 10 | శతకోటి |
| ,, 10 ,, | 11 | అర్బుదము |
| ,, 11 ,, | 12 | న్యర్బుదము |
| ,, 12 ,, | 13 | ఖర్వము |
| ,, 13 ,, | 14 | మహాఖర్వము |
| ,, 14 ,, | 15 | పద్మము |
| ,, 15 ,, | 16 | మహాపద్మము |
| ,, 16 ,, | 17 | క్షోణి |
| ,, 17 ,, | 18 | మహాక్షోణి |
| ,, 18 ,, | 19 | శంఖము |
| ,, 19 ,, | 20 | మహాశంఖము |
| ,, 20 ,, | 21 | బృందము |
| ,, 21 ,, | 22 | మహాబృందము |
| ,, 22 ,, | 23 | క్షితి |
| ,, 23 ,, | 24 | మహాక్షితి |
| ,, 24 ,, | 25 | క్షోభము |
| ,, 25 ,, | 26 | మహాక్షోభము |
| ,, 1—26 సున్నాలు | 27 | నిధి |
| ,, 1—27 ,, | 28 | మహానిధి |
| ,, 1—28 ,, | 29 | పర్వతము |
| ,, 1—29 ,, | 30 | అంత్యము |
| ,, 1—30 ,, | 31 | మధ్యము |
| ,, 1—31 ,, | 32 | పరార్ధము |
| ,, 1—32 ,, | 33 | అనంతము |
| ,, 1—33 ,, | 34 | సాగరము |
| ,, 1—34 ,, | 35 | అవ్యయము |
| ,, 1—35 ,, | 36 | అచింత్యము |
| ,, 1—36 ,, | 37 | అమేయము |
| ,, 1—37 ,, | 38 | భూరి |
| ,, 1—38 ,, | 39 | మహాభూరి |
| ,, 1—57 ,, | 58 | ఓఘము |
| ,, 1—62 ,, | 63 | మహౌఘము |

పై సంఖ్యామానము అరువది నాలుగు స్థానములవరకు వుండి యున్నట్లు వినికిడి, కాని నాకు తెలిసినంతవరకుమాత్రము యిచ్చియున్నాను. బుద్ధిమంతులైనవారు మిగత స్థానములనుకూడను శాస్త్రపరిశోధనచే గ్రహించి పూర్తి చేయుదురుగాక !

పై సంఖ్యామానము నుపయోగించి బ్రహ్మవయస్సును లెక్కించుదము.

ఒకపద్మ అయుత మహాఖర్వ అయుతఖర్వ అయుత న్యర్బుదముల రెండు అర్బుదముల నూట తొంబది యొకకోట్ల యిరువది తొమ్మిది లక్షల నలుబది తొమ్మిదివేల నలుబది నాలుగు అని సులభముగా చదువవచ్చును. అనంతముగా కాలమును లెక్కించుట కేర్పరచిన యీ సంఖ్యామానమును బట్టి మన పూర్వులెట్టి అపూర్వ ప్రజ్ఞావంతులు, విజ్ఞానవంతులైనదియు మనకు గోచరించగలదు.

## ౧౮. కాలమానము

| స్మృతుల ననుసరించి. | జ్యోతిశ్శాస్త్రము ననుసరించి. |
|---|---|
| 18 కనురెప్పపాట్లు = 1 కష్ఠ | |
| 30 కష్ఠలు = 1 కళ | 6 ప్రాణాయామలకాలము 1 విఘడియ |
| 30 కళలు = 1 ముహూర్తం | 60 విఘడియలు 1 ఘడియ |
| 30 ముహూర్తములు = 1 అహోరాత్రము | 60 ఘడియలు 1 అహోరాత్రము |

ఈ అహోరాత్రమే మానవుల రోజు—

15 రోజులు = 1 పక్షము

2 పక్షములు = 1 నెల

1 మానవులనెల = పితృదేవతలకొక అహోరాత్రము మన శుక్లపక్షము పితృదేవతలకొక పగలు మన కృష్ణపక్షము వారికొక రాత్రి.

12 మానవుల నెలలు = దేవతలకొక రోజు. అనగా ఉత్తరాయనము 6 మాసములు పగలు. మన దక్షిణాయనము 6 మాసములు దేవతలకొక రాత్రి.

30 మానవ సం॥రములు దేవతలకు వకనెల

360 మానవ సం॥రములు దేవతల కొక సం॥రము

| | | |
|---|---|---|
| 4800 దేవ సం॥ రములు లేక<br>17,28,000 మానవ సం॥రములు | 1 కృతయుగము (సంధి, సంధ్యాంశలతో కలిసి.) | |
| 3600 దివ్య సం॥రములు లేక<br>12,96,000 మానవ సం॥రములు | 1 త్రేతాయుగము | (డిటో) |
| 2400 దివ్య సం॥రములు లేక<br>8,64,000 మానవ సం॥రములు | 1 ద్వాపరయుగము | (డిటో) |
| 1200 దివ్య సం॥రములు లేక<br>4,32,000 మానవ సం॥రములు | 1 కలియుగము | (డిటో) |

| | |
|---|---|
| కృత,త్రేత,ద్వాపర,కలియుగములు నాలుగును కలిసి 12000 దివ్య సం॥రములు లేక 43,20,000 మానవ సం॥రములు | 1 దివ్య యుగము (లేక ఒక మహాయుగము అని పేరు.) |
| వేయి దివ్య యుగములు (లేక వేయి మహా యుగములు) లేక 432 కోట్ల మానవ సం॥రములు | బ్రహ్మకు ఒక పగలు దీనికి ఉదయకల్పమని పేరు. |
| తిరిగి అంతకాలము అవగా వేయి మహా యుగములు లేక 432 కోట్ల మానవ సం॥ | బ్రహ్మకు ఒకరాత్రి దీనికి క్షయకల్పమని పేరు. |
| రెండువేల మహాయుగములు లేక 864 కోట్ల మానవ సం॥రములు | బ్రహ్మకు ఒక అహోరాత్రము- |

అట్టి 30 అహోరాత్రములు = బ్రహ్మకు 1 నెల.
అట్టి 12 నెలలు = బ్రహ్మకు 1 సం॥రం.

అట్టి నూరు సం॥ రములు బ్రహ్మకు ఆయుర్దాయము. అట్టి నూరేండ్లు నిండగానే బ్రహ్మ తన బ్రహ్మాండముతో కూడనులయమును బొందును. అట్లు లయములో బ్రహ్మమానము ప్రకారం నూరేండ్లుండిన పిమ్మట అట్టి బ్రహ్మాండము దాని కధికారిగా నుండదగిన వేరొక పుణ్యజీవుడు బ్రహ్మగా కలిగి తిరిగి సృష్టిలోనికి వచ్చును. ఈ విధముగా కాలచక్రములో సృష్టి, లయము తిరిగి సృష్టితిరిగి లయములు జరుగుచుండును. అనాది కాలమునుండి అనంతకాలము కాలచక్ర మీ రీతిన పరిభ్రమించుచుండును. ఇది స్వాభావికనియతి. ఈ ప్రకారము స్వాభావికమైన సృష్టి కథనము వేదశాస్త్రములయందనుగ్రహింపబడినది. ఈ సృష్టి విధానము, బ్రహ్మాండము తదంతర్గత చతుర్దశభువనములు, అందలి దేవ, మనుష్యాదివర్గములు, స్వర్గనరకాదులు, ముక్తస్థానము మొదలుగాగల వివరములు తెలియని వారికి వైదికవాఙ్మయము సమన్వయము కానేరదు. ఒక బ్రహ్మాండములోగల పదునాలుగు లోకములు, అందలి అవాంతర లోకములు, వాటి అన్నిటియందలిగల జీవులు ఒకరితోనొకరికి సంబంధములు గలిగియుందురు. వారివారి కర్మానుసారముగా ఫలములొసంగబడుచుండును. గనుక పై వివరములను బాగుగా తెలిసికొని శాస్త్ర సమన్వయమునకు పూనుకొనిన విపరీత భావములు గలుగక అన్నిటికి సమన్వయము కుదురుగలదు. అట్లుగాక కొన్నిటి నంగీకరించుచు, కొన్నిటిని విసర్జింపుచూ చదివిన శాస్త్రము సంపూర్ణముగా

సమన్వయింపనేరదు. అది మన విజ్ఞానలోపముగాని శాస్త్రలోపము గాదని తెలియవలెను. బ్రహ్మదేవుని ఒక పగటికాలములో 14 గురు మనువులు బ్రహ్మాండములోని జీవుల నందరిని పరిపాలించుచుందురు. ప్రతి మనువు కాలము 71 మహాయుగములు. (71 × 43,20,000 =) 30,67,20,000 మానవ సం॥ రములు —

బ్రహ్మ వయస్సులో యిప్పటికి ఆరుగురు మనువులు పరిపాలించి విరమించుకొనిరి. ప్రస్తుతము ఏడవ మనువైన వైవస్వత మనువు పరిపాలించుచున్నాడు. ప్రతి మనువు కాలములోను వచ్చెడి ఇంద్రాది దేవతలు, సప్తఋషులు, అవతారములు, మనుపుత్రులు మొదలగు వివరములుగల జాబితా యీ గ్రంథము చివర భాగమున కలదు, అచ్చట చూచుకొనవచ్చును. ఋతు కాలము ననుసరించి వోషధులు ఫలప్రదము లగుచు యుపసంహరింపబడు చుండునట్లు, పరమేశ్వరుని స్వరూపమైన కాలచక్రములో బ్రహ్మలు, విష్ణులు, వారివారి బ్రహ్మాండములు, అందలి మనువులు, దేవమానవాది వర్గములు మొదలుగాగల సృష్టి యంతయు కాలానుసారముగా వచ్చుచు పోవుచు తిరిగి అదేవిధముగా వచ్చుచుండును. వచ్చిన జగత్తే తిరిగి తిరిగి వచ్చుచు బోవుచుండునని తెలియవలెను. జీవులు వారివారి పుణ్య తారతమ్యానుసారముగా మనువులు, దేవతలు మొదలుగాగల అధికార స్థానములను బొంది వారి నియమిత కాలము తీరిన వెంటనే విరమించుకొని ముక్తి నొందుచుందురు. లేక ఉత్తమలోక నివాసులగుచుందురు. ఇది స్వాభావికమైన సృష్టి కధనము.

వైవస్వత మనువు కాలములో యిప్పటికి 12,05,33,050. పన్నెండు కోట్ల అయిదు లక్షల ముప్పదిమూడువేల యేబది సం॥రములు గతించినవి. (కలి5050 సం॥ లేక క్రీ॥ శ॥ 1950 సం॥ రంకు లెఖ) ఇంకను 18,61,86,950 సం॥రములు జరుగవలసియున్నది. బ్రహ్మయొక్క యేబది యొకటవ సం॥రంలోని ప్రథమ మాస ప్రథమ దినమున సృష్టి ప్రారంభించినదాది యిప్పటికి 195,58,85,050 సం॥ రములు గడచినది. (ఈ లెఖకలి 5050 లేక క్రీ॥ శ॥ 1950 వరకు.)

# ౧౯. చతుర్దశ మనువులు

ప్రతి బ్రహ్మకల్పము (అనగా బ్రహ్మకు ప్రతిపగలు)లోను పదునలుగురు మనువులు పాలనము చేయుదురు. ప్రతిమనువు పాలనకాలములోను, ఇంద్రుడు, దేవగణములు, సప్తఋషులు వచ్చుచుందురు. మను, ఇంద్ర, దేవత, ఋషి అనునవి అధికారస్థానములు. పుణ్యాజీవులైన వారా స్థానములకు వచ్చుచుపోవుచుందురు. కాని ఎల్లప్పుడును ఆధికారికస్థానములా పేరుననే పిలువబడుచుండును. ప్రతిమనువు కాలములోను అవసరమును బట్టి విష్ణుని యవతారములు వచ్చుచుండును.



ఈగ్రంథము 64 పుటలోని ప్రాచీన భారతవర్షము అనెడి నెం. ౮ రు పటములోని వివరములు యిచ్చట వ్రాయబడినవి. నెం. ౮ రు పటములో సరిచూచుకొనుడు.

1. బ్రహ్మవర్తము
2. బ్రహ్మఋషిదేశము
3. మధ్యదేశము
4. దృషద్వతీనది (సరస్వతీనదికిఉపనది)
5. వింధ్యపర్వతములు
6. సింధునది (పైభాగం)
7. గంగానది
8. యమునానది
9. లంకాద్వీపము (నిరక్షరేఖమీద)
10. హస్తినాపురం (ఢిల్లీ)

# I. జరిగిపోయిన మనువులు

| 1<br>మనువులు | 2<br>ఇంద్రులు | 3<br>దేవతలు | 4<br>సప్తఋషులు | 5<br>విష్ణుని అవతారం | 6<br>మనువుల కుమాళ్లు భూమిని పాలించిన వారు |
|---|---|---|---|---|---|
| ౧ బ్రహ్మపుత్రుడు స్వాయంభువుడు. | ఉపేంద్రుడు జయంతుడు అనబడు దక్షుడు. | తుషితాదులు పండ్రెండు వర్గములు. | భృగువు, మరీచి, అత్రి, క్రతువు, అంగీరసుడు, వసిష్ఠుడు, పులహుడు, ఏడుగురు. | యజ్ఞుడు కపిలుడు (రెండవతారములు) | 1 ప్రియవ్రతుడు<br>2 ఉత్తానపాదుడు |
| ౨ స్వారోచిషుడు (సప్తార్చి కుమారుడు) | విపశ్చితుడు లేక రోచనుడు. | పారావత, తుషితాది వర్గములు. | ప్రాణ, వాత, అగ్ని, ఊర్జక, స్తంబక, వృష, నిస్వాసులు- | విభుడు | 1 ద్యుమంతుడు<br>2 సుషేణుడు<br>3 రోచిష్మంతుడు |
| ౩ ఉత్తముడు (ప్రియవ్రతుని కుమారుడు.) | సత్యజిత్తు లేక సుశాంతుడు. | సత్య, భద్ర, సుధామ, శివ, ప్రతర్దన, వికర్తాములు పండ్రెండు వర్గములు. | వసిష్ఠుని కొడుకులు ఏడుగురు. 1 విరజ 2 గోత్ర 3 ఊర్ధ్వబాహు 4 సవన 5 సనఘ 6 సుతప 7 శుక్ర అను వారలు- | సత్యసేనుడు (దుష్టులైన దనుజ యక్షపతులను దండించెను.) | 1 పవన<br>2 సృంజయ<br>3 యజ్ఞహోత్రి మొదలైన వారు. |

| 1<br>మనువులు | 2<br>ఇంద్రులు | 3<br>దేవతలు | 4<br>సప్తఋషులు | 5<br>అవతారములు | 6<br>మనువుల కుమార్లు |
|---|---|---|---|---|---|
| ౪ తామసుడు | త్రిశిఖ లేక (శిబి) | సత్యక, హరి వీరాది 27 వర్గములు. | కావ్య, చైత్రి పృథు అన్యవర్ణ అగ్ని పీవర, జ్యోతిధామా. | హరి (గజరాజును కాపాడినాడు) | 1 వృష 2 నర 3 ఖ్యాత 4 జాను 5 జంఘ 6 కేతు రూపాదులు. |
| ౫ రైవతుడు | వేదశీర్షుడు లేక (విభుడు) | అమితాభ వైకుంఠ కాన్య మొదలుగా 28 వర్గములు. | 1 శ్రీమంతుడు<br>2 పరజన్యుడు<br>3 ధామకుడు<br>4 హిరణ్యరోముడు<br>5 దేవబాహుడు<br>6 ఊర్ధ్వబాహుడు<br>7 వేదవంతుడు | వైకుంఠుడు | 1 ప్రతివింధ్య 2 అర్జున 3 బల 4 బంధు 5 ప్రియవ్రతాదులు. |
| ౬ చాక్షుషుడు (ధ్రువుని వంశములోని సర్వతేజుని కుమారుడు) | మంత్రద్యుమ్నుడు (లేక) (మనోజవుడు) | నాప్యాదిక, ఆర్య, ప్రభూత, భవ్య, పృథూకలేఖాదు వైన అష్టగణములు. | హవిష్మద్వీరకాదులు<br>1 సుమేధుడు<br>2 విరజుడు<br>3 హవిష్మంతుడు<br>4 ఉత్తముడు<br>5 మధుడు<br>6 సహిష్ణుడు<br>7 అతినామకుడు | 1 అజితుడు (పాలసముద్రమును తరచినపుడు కూర్మమైనాడు)<br>2 మోహిని (అమృతమును దేవతలకు పంచెను) | 1 పురు 2 పురుష 3 ప్రద్యుమ్నాదులు |

## II. ఇప్పుడు జరుగుచున్న ఏడవ మనువు

| మనువు | ఇంద్రుడు | దేవతలు | సప్తఋషులు | అవతారములు | మను పుత్రులు |
|---|---|---|---|---|---|
| ౭ వైవస్వతుడు | పురందరుడు | ఆదిత్య, మరు, అశ్వి, వసు, రుద్ర మొదలైన వర్గములు | 1 గౌతమ 2 అత్రి 3 కశ్యప 4 విశ్వామిత్ర 5 జమదగ్ని 6 భరద్వాజ 7 వసిష్టులు. | వామనుడు | 1 ఇక్ష్వాకు<br>2 అభంగుడు<br>3 ధృష్టుడు<br>4 శర్యాతి<br>5 అరిష్యంతుడు<br>6 నాభాగుడు<br>7 దిష్టుడు<br>8 కరూశకుడు<br>9 బృషధ్రుడు<br>10 వసుమంతుడు |

## III. రాబోవు మనువులు

| మనువు | ఇంద్రులు | దేవతలు | సప్తఋషులు | అవతారములు | మనుపుత్రులు |
|---|---|---|---|---|---|
| ౮ సూర్యసావర్ణి | బలి | సుతజ, విరజమృత, ప్రభులను 20 వర్గములు | 1 గాలవుడు<br>2 దీప్తిమంతుడు<br>3 పరశురాముడు<br>4 అశ్వత్థామ<br>5 కృపాచార్యులు<br>6 వ్యాసుడు<br>7 ఋష్యశృంగుడు | సార్వభౌముడు (ఏడవ ఇంద్రుని తొలగించి బలిని ఇంద్రుని చేయును). | నిర్మోహ<br>విరజ<br>సాద్యులు |

| మనువు | ఇంద్రులు | దేవతలు | సప్తఋషులు | అవతారములు | మనుపుత్రులు |
| --- | --- | --- | --- | --- | --- |
| ౯ దక్షసావర్ణి (వరుణుని కుమారుడు) | అద్భుతుడు లేక (మహావీర్యుడు) | ధారా, మరీచి సుదర్శ, గర్గాదులు 12 గణములు | 1 సపనుడు<br>2 భవ్యుడు<br>3 ధర్ముడు<br>4 ద్యుతిమంతుడు<br>5 దీప్తి 6 మేధుడు<br>7 దీప్తకుడు | దనుజహారణుడు | 1 దివ్యకేతువు<br>2 మహాకేతువు<br>3 ధృతకేతువు<br>4 దీప్తికేతువు<br>5 పంచహస్త<br>6 నిరామయ |
| ౧౦ బ్రహ్మసావర్ణి (ఉపశ్లోకునికుమారుడు) | శంభుడు లేక (శాంతి) | విబుద్ధాద్యులు 1 సుఖ 2 సుఖాత్మ, 3 సుధర్మాదులు నూరు వర్గములు | 1 సత్యుడు<br>2 నాభాగుడు<br>3 సంస్తుతి<br>4 సత్యకేతు<br>5 ప్రతిముడు<br>6 ఆరిష్మంతుడు<br>7 తపోధనుడు | విష్వక్సేనుడు | భూరిషేణాదులు పదిమంది |
| ౧౧ ధర్మసావర్ణి లేక (విష్ణుసావర్ణి) | వైధృతుడు (పూర్వనామము వృషుడు) | విహంగములు కామగమనలు నిర్వాణులు రుచులుఅనుగణములు | అరుణాదులు<br>1 శనైశ్చరుడు<br>2 సంస్తుతి<br>3 వహ్ని 4 తేజుడు<br>5 వపుష్మంతుడు<br>6 ననుజ్వాలుడు<br>7 జ్వాలనుడు | ధర్మసేతువు | సర్వత్రగ, సుధర్మ దేవానీక, సత్యధర్మాదులు పదిమంది |

| మనువు | ఇంద్రుడు | దేవతలు | సప్తఋషులు | అవతారములు | మను పుత్రులు |
|---|---|---|---|---|---|
| ౧౨ భద్రసావర్ణి (రుద్రసావర్ణి యని పేరు) | ఋతుధాముడు | హారిత, రోహితాది గణములు | 1 తపస్వి<br>2 తపోమయ<br>8 తపోమూర్తి<br>4 తపోరతి<br>5 తపోధృతి<br>6 తపోధన<br>7 ద్యుతిమంత | స్వధాముడు | 1 దేవ<br>2 ఉపదేవ<br>3 దేవశ్రేష్ఠ |
| ౧౩ దేవసావర్ణి (లేక ధామ లేక రౌచ్య.) | దివస్పతి లేక సుత్రాముడు | ధర్మ, సుధర్మ సుకర్మ నామములు గల 88 గణములు | 1 నిర్మోహక<br>2 ప్రధర్మ్య<br>8 నిష్ప్రకంప<br>4 అవ్యయ 5 నిత్య<br>6 నిరుత్సుక<br>7 హితమతి | యోగవిభుడు | చిత్రసేన విచిత్రాదులు |
| ౧౪ ఇంద్రసావర్ణి లేక (భౌత్య) | శుచి | చాక్షుష సావిత్రక నిష్ఠి వాచావృద్ధాది వర్గములు | 1 అగ్నిబాహు<br>2 శుచిచిత్త 3 శుక్ర<br>4 మాగధ 5 అగ్నిరధ<br>6 యుక్త 7 అజిత | బృహద్భానుడు (ప్రజలకు వేదోక్త కర్మలాచరించు విధానము జూపును). | గంభీర వసువు మొదలుగా గలవారు. |

పై పదునలుగురు మనువులలో ప్రథమ మనువైన "స్వాయంభువ మనువంశము ముందు చెప్పబడును.

# మనువంశ కీర్తనం

జరిగిపోయిన క్షయ కల్పాంతమున (అనగా బ్రహ్మయొక్క దినాంత ప్రళయ కాలమైన బ్రహ్మరాత్రి కాలము 432 కోట్ల సం॥ రములు జరిగిన పిమ్మట) ఉషః కాలమున బ్రహ్మ నిద్ర లేచిన కాలము మొదలు ధ్యానకాలము 1,70,64,000 మానవ సం॥ రములు గడచిన పిమ్మట జీవసృష్టి నుపక్రమించిన యీ శ్వేత వరాహ కల్పమున ప్రమాధి నామ సం॥ర చైత్ర శు ౧. (పాడ్యమి) ఆదివారం ఉదయం 6 గంటలకు అశ్వినీ నక్షత్ర ప్రధమ కళయందు రవ్యాది సప్త గ్రహములు ప్రవేశించియుండిన శుభసమయము లగాయతు నేటికి (అనగా కలి. 5044 సం॥రముకు లేక క్రీ॥ శ. 1944 సం॥) నూట తొంబది యైదు కోట్ల యేబది యెనిమిది లక్షల యెనుబదియైదు వేల నలుబది నాలుగు సం॥ రములు గడచినది. అట్టి సృష్టి ప్రారంభ కాలమున బ్రహ్మదేవుడు మొదట తన సృష్టికి ప్రధమ పురుషుడుగా స్వాయంభువ ప్రజాపతిని సృజించెను. (బహిర్గత మొనర్చెను.) ఆ స్వాయంభువుడు తన సంకల్ప మాత్రమున పూర్వ కల్పమున జీవన్ముక్తులై సృష్ట్యాది కర్మయందు తోడ్పడ నెంచి లోకానుగ్రహార్థము వేచియుండిన పది మంది ప్రజాపతులను సృజించెను. వారెవరన :- ౧. మరీచి ౨ అత్రి. 3. అంగీరసుడు. ౪. పులస్త్యుడు. ౫. పులహుడు. ౬. క్రతువు. ౭. ప్రచేతస్సు. (లేక దక్షుడు) ౮. వసిష్ఠుడు. ౯. భృగువు. ౧౦. నారదుడు. పిమ్మట సృజింపబడినవారు. ౧౧. ధర్ముడు. ౧౨. మృత్యువు. ౧3. అధర్ముడు ౧౪. కాముడు. ౧౫. క్రోధుడు. ౧౬. లోభుడు. ౧౭. సరస్వతి. ౧౮. సముద్రుడు. ౧౯. నిబుతి. ౨౦. కర్దముడు. (భాగవతం 3_373 ల॥ 379 వరకు) బ్రహ్మతమో గుణము నాశ్రయించి ౨౧. తామిస్రము. ౨౨. అంధతామిస్రము ౨3. తమస్సు ౨౪. మోహనము. ౨౫. మహా మోహనము. (21ల॥ 25 వరకు అవిద్యయొక్క అయిదు రూపములు గలిగెను. (భాగ. 3_721ల॥ 742) బ్రహ్మ తన తమోమయ దేహము రాత్రి రూపమయిన అందుండి, ౨౬. క్షుత్తు. ౨౭. తృష్ణలుకలిగినవి. అట్టి క్షుత్తృష్ణలవలన బుట్టిన

వారు. ౨౮. యక్షులు. ౨౯. రక్షస్సులు. (ఇచ్చట శేషసృష్టంగా తదభిమాన దేవతలని తెలియవలెను.)

బ్రహ్మ తేజోమయమైన సాత్త్వికసంకల్పముచే సత్త్వగుణులైన దేవ వర్గములను సృజించెను. అట్టి తేజోమయ సంకల్పము పగటి రూపంబైనది— అనగా పగటి అభిమాన దేవతలు, రాత్ర్యభిమాన దేవతలు సృజింపబడిరని తాత్పర్యము. పిమ్మట—

౩౦. అసురులు. ౩౨. సంధ్యాదేవత. (ఈమె అసురుల కాశ్రయమైనది) ౩౩. గంధర్వులు. ౩౪. అప్సరసలు. ౩౫. పిశాచులు. ౩౬. గుహ్యకులు. ౩౭. సిద్ధులు. ౩౮. భూతగణములు. (వీరు దిగంబరులు, ముక్తకేశులునైరి) ౩౯. పితృదేవతా గణములు. ౪౦. సాధ్యులు సృజింపబడిరి. పితృగణములును, సాధ్యగణదేవతలును దేవభాగంబు పొందనున వారికి శ్రాద్ధ కర్మంబులలో హవ్యకవ్యంబు లాచరింతురు —పిమ్మట ౪౧. నరులు. ౪౨. సిద్ధులు. ౪౩. విబుధులు. ౪౪. కిన్నరులు. ౪౫. కింపురుషులు. ౪౬. మునులు. ౪౭. ఋషిగణములు. ఇది సూక్ష్మ దేవతాసృష్టి—

## ఊర్ధ్వలోకస్థాల సృష్టి

తిరిగిపుట్టినవారు :—

ఏడుగురు మనువులు, దేవతలు, స్వర్గాది లోకములు, మహామునులు, మానవులు, యక్షులు, రక్షస్సులు, పిశాచములు, గంధర్వులు, ఊర్వశి మొదలైన అప్సరసలు, నాగులు, సర్పములు, గరుడులు మొదలుగాగల పక్షులు, పితృదేవతలయొక్క పలురంగులగు సమూహములు, మెరుపు, పిడుగు, మేఘము, ఇంద్రధనస్సు, ధూమకేతువు, భూకంపము మొదలగు ఉత్పాతములు, కిన్నరులు, వానరులు మీనములు బహువిధములగు పక్షులు, పశువులు, మృగములు, మనుష్యులు, రెండుప్రక్కల పళ్ళుగల పులి మొదలగు క్రూరజంతువులు, క్రిమికీటకములు, పతంగములు, పురుగులు, పసిరికాయలలోని పురుగు, మిడత, సాలెపురుగు, ఈగ, నల్లి, దోమ, నానాభేదములగు వృక్షములు మొదలగువానిని స్వాయంభువ ప్రజాపతి ఆజ్ఞచేత మొదటి

పదిమంది ప్రజాపతులు తపస్సుచేత శక్తిని పొంది ప్రాణులయొక్క కర్మమునకు తగినట్లు-స్థావర, జంగమలోకంబులను సృజించిరి. (అనగా ప్రకృతిలో నున్నవానిని బహిర్గతమొనర్చిరి)(మనుస్మృతి ౧-౩౪ల॥౪౦) పై సృష్టియంతయు ఊర్ధ్వ లోకములో జరిగినదిగాని భూలోకములో కాదు. ఇదంతయు సూక్ష్మసృష్టి.

స్వాయంభవ మనువు మానసికముగా తపోమహిమచే చేయు బడుచున్న సృష్టి చాలదని యూహించి స్త్రీ పురుష సంయోగ రూపం బున జీవసృష్టి చేయుదలంచి తన శరీరమును రెండుగా చేసి శతరూప యను స్త్రీని పుట్టించి దానిని వివాహంబయ్యెను.

శ్రుతి: "సద్వితీయ మైచ్ఛత్, సఇమమేవాత్మానం ద్వేధా పాతయత్తతః। పతిశ్చపత్నిచా భవతాం, తాంసమభవత్తతో మనుష్యా అజాయన్త" (బృహదారణ్యకం. 3-4-3)

తా॥ ఆప్రజాపతి (స్వాయంభువు) రెండవదానిని కోరెను. ఆతడు తానే రెండువిధములుగానై పెనిమిటిగాను భార్యగాను ఏర్ప డిరి. ఆ స్త్రీని మైథునమును పొందెను. అందువలన మనుష్యులు పుట్టిరి.

## దేవమానవాదిసర్గసృష్టి

స్వాయంభువ ప్రజాపతి భార్యా శతరూప. ఇది సృష్టికి మొదట మిథునము. వీరు తేజోమయ శరీరులుగాని పాంచభౌతికమైన స్థూల శరీరులు కారు. ఈ మిథునమువలన మొదట కలిగిన సంతానము. ౧. ప్రియవ్రతుడు, ౨. ఉత్తానపాదుడు. నను యిద్దరు కుమారులు. 3. ఆకూతి. ౪. దేవహూతి. ౫. ప్రసూతియను ముగ్గురు కుమార్తెలు గలిగిరి. అంతట స్వాయంభువుడు మానవజాతికి మూలభూతమగు తన సంతానము నివసించుటకు తగిన స్థలముకొరకు ప్రార్థింపగా ఈశ్వరాను గ్రహమున ప్రళయకాలజలనిమగ్నమైయున్న భూగోళము నీటిపైకి తేబడెను. (భాగ. 3-398 ల॥ 406 & 460) అంత స్వాయంభువుడు భూమిమీద తనసంతానమును నిలిపెను. భూలోక సృష్టియంతయు నిమ్మట తెలుపబడును. —

బ్రహ్మ దినమంతయు సృజించిన కాలములో సృష్టియంతయు ప్రవర్తించు చుండును బ్రహ్మకు రాత్రికాలము రాగానే ప్రళయము

సంభవించి స్వర్గ, మర్త్య అంతరాళములు (భూలోక, భువర్లోక, సువర్లోకములు) మూడును లయించును ఈ మూడు లోకములలోని జీవులందరును తమతమ కర్మలచే సంపాదించియున్న స్థూల శరీరములను విడిచి నిర్వ్యాపారకమైన మహత్సగలవారై బ్రహ్మయందు లీనమై యుందురు. స్థావర జంగమాత్మకమైన సర్వశరీరములలోను నానా కర్మానుసారులైన జీవులున్నారని తెలియవలెను. స్థావరముల నాశ్రయించియున్న జీవులు లోపల తెలివిగలిగి సుఖదుఃఖములతో కూడినవారై యుందురు. (మను. ౧-౪౯.) ఈ ప్రళయమునకు బ్రహ్మయొక్క దైనందిన ప్రళయమని పేరు. ఈ ప్రకారము బ్రహ్మయొక్క ఆయుష్కాలమైన బ్రహ్మమాన ప్రకారము నూరు సంవత్సరములు నిండిన బ్రహ్మతో కూడ బ్రహ్మసృష్టి యంతయు ప్రకృతియందు లయించును. దీనిని మహాప్రళయమందురు.

బ్రహ్మయొక్క పగటియందు పదునలుగురు మనువులు పాలనము చేయుదురు. ఒక్కొక్క మనువు డెబ్బదియొక్క మహాయుగములు పాలించును. పిమ్మట మనుప్రళయము సంభవించును. ప్రతి మను సంధియందును యొక కృతయుగ కాలము అనగా 17,28,000 సం॥ రములు ప్రళయము నిలచియుండును. ప్రతి మహాయుగాంతమందును యొక్కొక యుగ ప్రళయము కలుగుచుండును. పైన చెప్పబడిన విధమున తిరిగి తిరిగి సృష్టి ప్రవర్తించుచు లయించుచుండును. ఈ విధముగా అనాదినుండియు సృష్టి, స్థితి, లయములు జరుగుచున్నవి. నారాయణుని నాభికమలమునందు ప్రథమములో బ్రహ్మ యుద్భవించినందున దానికి "పద్మకల్పమని" పేరు. బ్రహ్మయొక్క ఏబది యొకటవ సం॥ రం ప్రథమ దివసమునకు "శ్వేత వరాహకల్పము" అనిపేరు.— (భాగ. 3. 361, 362)

సృష్టియంతయుపది విధములైన సర్గములుగా జెప్పబడినది—అందు.

(1) మహత్తత్వ గుణాశ్రయమైనది ప్రథమసర్గము

(2) ద్రవ్యజ్ఞాన క్రియోదయంబైన అహంకార తత్వము ద్వితీయసర్గము

| | |
|---|---|
| 3. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను పంచతన్మాత్ర ద్రవ్యశక్తి యుక్తంబైన పృథివ్యాది భూతసర్గము | తృతీయ సర్గము |
| 4. జ్ఞానేంద్రియములైన త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వా ఘ్రాణంబులును, కర్మేంద్రియములైన వాక్పాణిపాద పాయూపస్థంబులు నను దశ విధేంద్రియ జననము — | చతుర్థ సర్గము |
| 5. సాత్త్వికాహంకార జనితంబైన,మనోమయ సుమనోగణ సర్గంబు — | పంచమ సర్గము |
| 6. జీవలోకంబునకునబుద్ధికృతంబులైన యావరణ, విక్షేపంబులంజేయు తామస సర్గము | ఆరవ సర్గము |
| 7. స్థావరంబులైన వృక్షలతాది రూపసర్గము | ఏడవ సర్గము |
| 8. పశు, పక్షి, భూచర, జలచర, ఖేచరాది రూపమైన తిర్యగ్సర్గము — | ఎనిమిదవ సర్గము |
| 9. రజోగుణ ప్రేరితంబై, కర్మకరణ దక్షంబై దుఃఖంబందును సుఖంబునుగోరు మానుష సర్గము — | తొమ్మిదవ సర్గము |
| 10. దేవసర్గము, యిది యెనిమిది విధములు. ౧. విబుధులు ౨. పితరులు 3. సురాదులు ౪. గంధర్వులు, అప్సరసలు ౫. యక్షులు, రక్షస్సులు ౬. భూత, ప్రేత, పిశాచంబులు ౭. సిద్ధ, చారణ, విద్యాధరులు ౮. కిన్నర, కింపురుషులు. | పదవ సర్గము |

ఈ విధముగా బ్రహ్మవలన నీ సృష్టియంతయు పదివిధములుగా సృజింపబడినది. ఇందు దేవసర్గాంతర్భూతమైన "విబుధులు" అను మొదటి భాగము ప్రాకృత వైకృతోభయాత్మకంబై దేవత్వ మనుష్యత్వరూపంబైన "సనత్కుమారాది" సర్గము లేక కౌమార సర్గమని పిలువబడుచున్నది —

“స్వాయంభూతుండును, అమోఘ సంకల్పుండునునగు నప్పుండరీ కాక్షుండు రజోగుణ యుక్తుండై స్రష్టయగుచు స్వస్వరూపంబైన విశ్వంబు నాత్మీయ సామర్థ్యంబునం గల్పించె.” (భాగ 3. 345)

## చాతుర్వర్ణ్య సృష్టి




బ్రహ్మయొక్క ముఖ, బాహూరుపాదములయందు బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రజాతు లుత్పన్నంబులయ్యె. (శ్రీకృష్ణ భారతం శాంతి ౫_౮౦౭.) మఱియు (ఋగ్వే. ౧౦ మండలం. పురుషసూక్తం.)

ఇట్లు వర్ణములయుత్పత్తి శ్రుతి, స్మృతి, ఇతిహాస, పురాణముల యందు వినబడుచున్నది. పరమాత్మయొక్క విశ్వరూపవర్ణనములో పై నాలుగు అవయవస్థానములుగా వర్ణింపబడినవని తెలియవలెను.

పరమాత్మనుండి జగమంతయు నుద్భవించినందున పారమార్థిక దృష్టిచేత జీవులందరొక్కటేయైనను, గుణకర్మానురూపమైన శరీరముల బొందినందున వ్యావహారిక భేదము తప్పదు. ఇది స్వభావని

యతి. ఇట్లు ప్రతికల్పమందును చాతుర్వర్ణ్యములు సృష్టింపబడుచు తిరిగి పరమాత్మయందు లీనమగుచుండును.

శ్రుతి :- "తదేతద్బ్రహ్మక్షత్రం విట్ఛూద్ర స్తదగ్నినైవ దేవేషు బ్రహ్మాభవద్బ్రాహ్మణో మనుష్యేషు క్షత్రియేణ క్షత్రియో వైశ్యేన వైశ్యః శూద్రేణ శూద్ర స్తస్మాదగ్నా వేవ దేవేషు లోకమిచ్ఛన్తే బ్రాహ్మణే మనుష్యే ష్వేతాభ్యాగ్ హిరూపాభ్యాం బ్రహ్మాభవత్".
(బృహదారణ్యోపనిషత్ 3 అధ్యా ४ బ్రాహ్మణం, ౧౫ మంత్రము.)

తా॥ "ఈ చెప్పబడిన బ్రహ్మక్షత్రియ, వైశ్య, శూద్రాత్మకమైన చాతుర్వర్ణ్యము ఆ పరబ్రహ్మము. ఆ పరబ్రహ్మము దేవతలలో అగ్నిరూపముతో బ్రాహ్మణజాతిగాను, మనుష్యులలో బ్రాహ్మణ రూపముతో బ్రాహ్మణజాతిగాను, దేవతలలో ఇంద్రాద్యధిష్టితమైన క్షత్రియజాతియై మనుష్యులయందు క్షత్రియ స్వరూపముతో క్షత్రియ జాతిగాను, దేవతలలో వస్వాద్యధిష్టితమైన వైశ్యజాతియై మనుష్యుల యందు వైశ్యస్వరూపముతో వైశ్యజాతిగాను, దేవతలలో సర్వవస్తు పోషకమగు పృథివీరూపమైన శూద్రజాతియై మనుష్యులయందు శూద్ర స్వరూపముతో శూద్రజాతిగాను అయినది."

శ్రుతి :- "యఏకశ్చర్షణీనాం వసూనామిరజ్యతి। ఇంద్రః పంచ క్షితీనామ్"॥. (ఋగ్వేదం. ౧. ౬౮)

తా॥ "ఏ ఇంద్రుడు ఒక్కడే మనుష్యులకు, ధనములకు అధికారియో ఆతడు (ఆ ఇంద్రుడు) అయిదు వర్ణములవారికిని ఈశుడు."

(అయిదు వర్ణములు :- బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర, నిషాద. లేక సంకీర్ణ.) సత్య దానాదులైన గుణంబులు శూద్రునందైన నాతడు "సచ్ఛూద్రుడ"నంబడు. అవి బ్రాహ్మణునియందు లేకుండిన వాడు బ్రాహ్మణ వంశములో బుట్టినవాడైనను "బ్రాహ్మణాధముడు" లేక "అబ్రాహ్మణుడ"నంబడును. కాని గుణవ్యత్యాసము కలిగియున్నంత మాత్రమున శరీరము మారనేరదు. ఉత్తమ జాతివాడు గుణకర్మ దోషముచే భ్రష్టుడై తన జాతిలో అధముడై యుండును. అధమ జాతి వాడు యోగ్యమగు గుణసంపత్తిచే తన జాతియందుత్తము డనిపించు కొనును. ఈ విధముగా పశు, పక్షి, వృక్ష, లతాదులలోను, వజ

వైడూర్యాదులలోను నీ నాలుగు జాతులు గలవు. వృక్షములలో అశ్వత్థము బ్రాహ్మణజాతి గలది. మఱ్ఱి, జువ్వి మొదలైనవి క్షత్రియ జాతులు. రత్నములలో బ్రాహ్మణాది నాలుగు జాతులు రత్న పరీక్షకులచే నేటికిని గుర్తింపబడుచున్నవి. శాస్త్రములలో ఆవిభాగము లన్నిటి యందును చూపబడు చుండినది. దేవతలలో ప్రజాపతులు, అగ్ని, ఆంగీరసులు బ్రాహ్మణులు. ఇంద్ర, వరుణ, సూర్య, చంద్ర, రుద్ర, పర్జన్య, యమ, మృత్యు, ఈశానులు క్షత్రియులు. ఏకోనపంచాశన్మరుత్తులు, అష్టవసువులు, ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు, త్రయోదశ విశ్వేదేవులు వైశ్యులు. పృథివీదేవత శూద్రజాతిగలది. ఇట్లు దేవతలందును, చాతుర్వర్ణ్యములు గలవు. (శ్రీకృష్ణ భారతం శాంతి5-413) అసురులలో రావణాసురుడు బ్రాహ్మణుడు. రాక్షసులలో హిరణ్యకశ్యపుడు క్షత్రియుడు. ఇతని వంశమునందే బలిచక్రవర్తి పుట్టి దేవ బ్రాహ్మణ భక్తిగలిగి వేదోక్త రీతిగా దేవతలనుద్దేశించి యజ్ఞము లాచరించినాడు. క్రమ పద్ధతి నవలంబించి సర్వాధిపత్యము నిలుపుకొనుటకు ప్రయత్నించగా స్వర్గాధి పతిగానున్న ఇంద్రుడు అకాలములో భ్రష్టత్వమును బొందుటకు వీలులేనందునను, సాత్వికుడై క్షాత్రవృత్తి నవలంబించి ఇంద్రుని గెలిచి స్వర్గము నాక్రమించి వేదోక్తాచారముల నవలంబించి తన త్రైలోక్యాధిపత్యమును నిలుపుకొనగోరి 99యజ్ఞములొనర్చి నూరవయజ్ఞము నాచరించుచుండిన బలిచక్రవర్తిని దౌర్జన్యమార్గమున నిగ్రహించుట న్యాయము కానందున, శ్రీ మహావిష్ణువు వామన మూర్తియై బలిని యాచించి మూడు లోకములను స్వాధీనపరచుకొని ఇంద్రునికి తిరిగి యివ్వవలసివచ్చినది. ఇప్పుడుండిన ఇంద్రుని పరిపాలన కాలము యీ వైవస్వత మన్వంతరములో అంతమొందును. రాబోవు యెనిమిదవ మనువైన "సావర్ణిమనువు" కాలములో బలిచక్రవర్తి ఇంద్రత్వమును బొందునట్లు వామనమూర్తి అనుగ్రహించి నాడు. అంతవరకును బలిచక్రవర్తి సుతలలోకములోనుండి తపస్సు చేయుచుండునట్లును గ్రహింపబడినది.—

# ఋగ్వేదములో వర్ణవిభాగము

అయితే కొందరు బుద్ధిమంతులు ఋగ్వేదకాలములో వర్ణభేదము లేదనియు పిమ్మట కాలమందేర్పడిన వనియు, ఋగ్వేదములో నెక్కడను వర్ణముల పేర్లయినను చెప్పబడి యుండలేదనియు ఋగ్వేదము దశమమండలములో చాతుర్వర్ణ్య సృష్టి చెప్పబడిన పురుషసూక్తము యిటీవల దానిలో చేర్చబడినదనియు చెప్పుచు ఋగ్వేదములో వర్ణప్రశంస లేనేలేదని వాదించుటయే గాక వారిచే వ్రాయబడు గ్రంథములలో వ్రాయుటకు కూడా సాహసించుచున్నారు. వారికి సమాధానముగా ఋగ్వేదములో వర్ణముల ప్రశంస రాబడిన స్థలములలో గొన్నింటి నచ్చటచ్చట చూపుచున్నాము– ఈ కాలముకు వర్ణము లక్కరలేదని యెంచబడిన మానుకొందురుగాని లోగడ జరిగిన చారిత్రికాంశముల మరుగుపరచి యసత్య ప్రచారము చేయుట ధర్మము కాదు. ఋగ్వేదములోని ఋక్కులన్నియు దేవతలను స్తోత్రము చేయుటయే ప్రధానముగా ప్రవర్తించినవిగాని, వర్ణములను గాని, వర్ణధర్మములను గాని, చరిత్రను గాని లేక యితర సంబంధములైన వానిని గాని చెప్పుటకు ప్రవర్తించి యుండలేదు. కాని అచ్చటచ్చట సందర్భానుసారముగా ప్రసంగవశమున వినబడిన వాక్యములలో గొన్నిటిని దిగువనిచ్చుచుంటిమి —

౧. "బ్రహ్మద్విష స్తపనోమన్యుమీరసి" (ఋగ్వే. ౨.౩.౨౩.౪)

తా॥ (ఇంద్రా!) "నీవు బ్రాహ్మణ ద్వేషుల నశింపుజేయువాడవైతివి. వారి క్రోధము నడచివేయుచువు."

౨. "సభేయోవిప్రః" (ఋగ్వే. ౨.౩.౨౪.౧౩)

తా॥ సభయందుగల ఆ యీ బ్రాహ్మణుడు.

౩. శ్రుతి :– "బ్రహ్మాణేవ విదథఉక్థశాసా"

(ఋగ్వే. ౨.౪.౩౯.౧)

తా॥ "స్తోత్రములను పఠింపుచుండిన యిద్దరు బ్రాహ్మణులవలె"

౪. శ్రుతి :– "ఉద్గాతేవ శకునే సామగాయసి బ్రహ్మపుత్ర ఇవ సవనేషుశంససి" (ఋగ్వే. ౨.౪.౪౩.౨)

తా॥ "ఓ శకునే! (అనగా పక్షిశ్రేష్ఠము) దేవతాస్తోత్రములను పఠించెడి బ్రాహ్మణుని వలె నీవు సామమును పాడుచుంటివి!"

౫. శ్రుతి :- "అధ్వర్యుభిః పంచభిః సప్తవిప్రాః" (3-౧.౭.౭)

తా॥ ఐదుగురు అధ్వర్యులు, ఏడుగురు విప్రులు అనగా బ్రాహ్మణులు (వీరు యజ్ఞములో హోమములు చేయువారు)

౬. శ్రుతి:- "తంత్వావిప్రా" (ఋగ్వే. ౩.౧.౧౦.౯)

తా॥ "బ్రాహ్మణులారా! మీరుదానిని.........".

౭. శ్రుతి:-"సఇత్ క్షేతి సుధిత ఓకసిస్వేతస్మా ఇళాపిన్వతె విశ్వదా సీమ్। తస్మైవిశః స్వయమేవానమంతే యస్మిన్బ్రహ్మారాజనిపూర్వవతి"॥
(ఋగ్వే. ౪-౫-౫౦-౮)

తా॥ "ఏరాజు బ్రాహ్మణుని తనకు పూర్వునిగా (జ్యేష్ఠునిగా) తెలిసి పూజించుచుండునో అట్టిరాజుకు యీభూమి సంపూర్ణముగా ఓషధీఫలాదుల నొసంగుచుండును. ఆతనికి వైశ్యాదిసర్వజనులు తమంత తాముగా కప్పముల చెల్లించుచుందురు." (ఇందు వర్ణములన్నియు స్పష్టముగా చెప్పబడినవి)

౮. శ్రుతి :- "అప్రతీతోజయతి సంధనాని ప్రతి జన్యాన్యుత యాసజన్యా అవస్యతేయోవరివః కృణోతి బ్రహ్మణేరాజా తమవంతి దేవాః" (ఋగ్వే. ౪. ౫. ౫౦. ౯.)

తా॥ "దరిద్రుడై ధనమును గోరుచుండినట్టిగాని, కోరకయుండి నట్టిగాని బ్రాహ్మణునికి యేరాజు ధనమునొసంగునో, అట్టిరాజు తన శత్రు ధనముల ననాయాసముగాబొందును. తన ప్రజలహృదయము లను చూరగొనును. అట్టి రాజును దేవతలు కాపాడుచుందురు."

౯. శ్రుతి :- "బ్రహ్మద్విషేతప పుషిం హేతిమస్య"
(ఋగ్వే 3-30-౧౭.)

తా॥ "భగ్న భగ్నన మందు నీ బాణజాలముల నీ బ్రాహ్మణ ద్వేషులపై ప్రయోగించి సంహరింపుము." (అని ఇంద్రునిగూర్చి ప్రార్థింపబడినది.)

౧౦ శ్రుతి :- "బృహత్ వదేమవిదథే సువీరాః"
(ఋగ్వే. ౨-౪.౪౩-౩).

తా॥ "మేముకూడా మాలో క్షత్రియుల కూడలియందు దేవుని స్తోత్రములు చేయుదుముగాక !"

౧౧. శ్రుతి :- "న తేదూరే పరమాచిద్రజాంస్యాతు."
(ఋగ్వే. ౩-౩-౩౦-౨).

తా॥ "రజోగుణ ప్రధానులైన గొప్ప రాజులుకూడా నీ కుమారులుగా లేరు." (అనగా ఇంద్రునికి దూరులుగారు. అని తాత్పర్యము.)

౧౨. శ్రుతి :- "మమద్విధారాష్ట్రం క్షత్రియస్య."
(ఋగ్వే. ౪-౪-౪౨-౧.)

తా॥ "క్షత్రియుడనైన (రాజునైన) నాకు రెండధికారములు గల రాష్ట్రముగలదు. (ఇందు క్షత్రియశబ్దము ప్రయోగింపబడినది).

౧౩. శ్రుతి :- బ్రాహ్మణః" యిత్యాది
(ఋగ్వే. ౧౦-౪-౫౦-౪).

తా॥ "బ్రాహ్మణులు మొదలైన.

౧౪. శ్రుతి :- "ధృతవ్రతా క్షత్రియాః."
(ఋగ్వే. ౧౦-౬-౬౬-౮).

తా॥ క్షత్రియులు ధృతవ్రతులు.

౧౫. శ్రుతి :- "విప్రాసో; రాజానో. (ఋగ్వే. ౧౦-౬-౭౮).

తా॥ బ్రాహ్మణులు; రాజులు.

౧౬. శ్రుతి :- "బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్.
(ఋగ్వే. ౧౦-౭-౭౦-౧౨).

౧౭. శ్రుతి :- "తథారాష్ట్రం గుపితంక్షత్రియస్య."
(ఋగ్వే. ౧౦-౯-౧౦౯-౩).

తా॥ క్షత్రియుడైన రాజువలన రక్షింపబడుచున్న రాజ్యము శత్రువుల కశక్యమైనటుల.

౧౮. శ్రుతి :- "బ్రాహ్మణస్యాపనీయ."
(ఋగ్వే. ౧౦-౯-౧౦౯-౪).

ఋగ్వేదములో చాతుర్వర్ణ్య ప్రశంసగలదని పై
వలన మనకు స్పష్టపడుచున్నది. ఇక ముందు వర్ణములేర్పడియ
కుల, వర్ణహీనమైన సంఘము యేర్పడగలిగిన యెడల మ
బోవు చరిత్రలలో అట్టివర్ణసాంకర్యము సవిస్తరముగా వర్ణిం

# ప్రజావృద్ధి

స్వాయంభువుడు మొదట ప్రజాపతిని సృజించిన మ
ప్రజాపతులు మొదలుగాగల వారిని సృజించుటయు, తనన
పతుల వలనను చేయబడిన సృష్టి నభివృద్ధిచేయుటకొని, తన
దర్ధము స్త్రీ రూపముగా సృజించి ఆదిమిథునంబై స్త్రీ పు
నము బడసి, వారికి నివాసము నన్వేషింప, పరమేశ్వరాను
భూమి నీటినుండి పైకి వచ్చుటయు మనము లోగ
కొనియున్నాము. పిమ్మట బ్రహ్మచేతనాజ్ఞాపిం
స్వాయంభువుడు తన దారాపుత్రాదులతో యీ భూలోక
ద్వీపాంతర్గతమైన భారత వర్షమందలి ఆర్యావర్తము
హించుచుండిన నదులలో పవిత్రతమమైన "సరస్వతీ నది"
ఆశ్రమ మేర్పర్చుకొని ప్రజాభివృద్ధికొరకు యజ్ఞములొన
బ్రహ్మచే నాజ్ఞాపింపబడినవాడై యనేక యజ్ఞంబు లొన
స్వతీ నదీ తీరముననే "యోనిం దేవకృతం" (ఋగ్వే. 3.
ఋగ్వేదములోను, "దేవనిర్మితం దేశం" అని మనుస్మృతి
బడియున్నది. అదియే (సరస్వతీ దృషద్వతీ నదుల మధ్యన
"బ్రహ్మావర్త" దేశమని చెప్పబడుచున్నది ఋగ్వేదము
గింపబడిన "యోనిం దేవ కృతమ్" అనగా దేవతలచే
లేక నిర్దేశింపబడిన — "యోని" అనగా జీవుల జనన
స్పష్టముగా నచింపబడుటను యీ సరస్వతి నదీ తీరమే భ
జీవులు జన్మించుటకు ప్రథమమున యేర్పడిన స్థల
ముగా తెలియుచున్నది. ఇందును గురించి వివరముగా న
బడిన "మానవసృష్టి విజ్ఞానం" అను గ్రంథమున చర్చింప

భూగోళము నీటినుండి పైకి వచ్చువరకు భూగోళమందెచ్చటను యెట్టి ప్రాణియు భూమిమీద నివసించి యుండలేదని వేరుగ జెప్ప నక్కరలేదు. భూగోళము నీటిపైకి రాబడి ప్రాణికోటి నివసించుట కర్హముగా జేయబడిన పిమ్మట అందుపై నివసించిన ప్రథమ మానవుడు స్వాయంభువ మనువై యున్నాడు. సృష్ట్యాదియందు మానవు లాచరింప వలసినట్టి వేదోక్త ధర్మములను ప్రచారమొనర్చిన "మనుస్మృతి" కర్త యీయనయే. కృతయుగమందు మనుస్మృతి ధర్మములును, త్రేతా యుగమునందు గౌతమ స్మృతియు, ద్వాపరయుగమందు శంఖలిఖిత స్మృతియు, కలియుగమున పరాశర స్మృతియు ననుసరణీయములు. ప్రతి మహాయుగమునందును నాయాయుగమున కేర్పడిన స్మృతులు ప్రచారమునకు వచ్చుచుండును.

శ్లో॥ "కృతేతు మానవాః ప్రోక్తాః, త్రేతాయాం గౌతమాస్మృతాః। ద్వాపరే శంఖలిఖితౌ, కలౌ పారాశరాః స్మృతాః॥" అని చెప్పబడినది.

ఆయా యుగములయందు మానవులచే యాచరింపబడ వలసిన ధర్మములు వేద పురుషునివల్ల స్వాభావికముగానే వేదములతో బాటు బహిర్గతము లగుచుండును. ఈ ప్రకారము అనాదినుండియు ప్రతి సృష్ట్యాదియందును బహిర్గతమగుచు ప్రతి ప్రళయము నందును పర మాత్మయందు లీనమగుచు తిరిగి పునస్సృష్టియందు బహిర్గత మగు చుండును. అట్టి ధర్మములను తాము తెలిసికొని ప్రజలలో ప్రచారము చేసినవారి పేర్లతో నాయా స్మృతులు గుర్తింపబడు చున్నది. స్వాయం భువ మనువు, గౌతమ, యాజ్ఞ వల్క్య, పరాశరులాదిగాగల వారలు వేదధర్మములను ప్రచారములోనికి తెచ్చినందున వారికి స్మృతికర్తలని పేరు కలిగినది.

సృష్ట్యాదియందు వేదములతో బాటు వేదాంగములు, స్మృతులు ఇతిహాస పురాణములన్నియు ప్రకృతి సిద్ధముగా పరమాత్మనుండి ఆవిర్భవించిన బ్రహ్మవలన బహిర్గతమై, ఋషులవలన లోకములో ప్రచారమునకు వచ్చియున్నవి.

శ్రుతి:- "అస్యమహతో భూతస్యనిశ్వసిత మేతద్యదృగ్వేదో యజుర్వేదః సామవేదో౽థర్వాఙ్గిరస ఇతిహాసః పురాణం విద్యాఉపని షదశ్లోకాః సూత్రాణ్యను వ్యాఖ్యానాని వ్యాఖ్యానాని"

తా॥ ఋగ్వేదమును, యజుర్వేదమును, సామవేదమును, అధ ర్వవేదమును, ఇతిహాసమును, పురాణమును, దేవజనవిద్య, ఉపనిష త్తులు మంత్రములు సూత్రములు మంత్రములయొక్క వివరణములు అర్థవాదములును (ఏవిగలవో అవన్నియు) గొప్పదైన యాపరమాత్మ యొక్క నిట్టూర్పులు.

శ్రుతి:- "బ్రహ్మదేవానాం ప్రథమం సంబభూవ విశ్వస్యకర్తా। భువనస్య గోప్తా, సబ్రహ్మవిద్యా ప్రతిష్ఠా మథర్వాయ జ్యేష్ఠపుత్రా యప్రాహా"॥ (ప్రథమముండకోపనిషత్ ౧ ఖండః ౧)

తా॥ దేవతలందు బ్రహ్మ మొదట పుట్టెను ఆయన విశ్వములకు కర్త. భువనములను కాపాడువాడు. ఆయన బ్రహ్మవిద్యను సర్వవిద్య లను ప్రతిష్ఠించి తన జ్యేష్టపుత్రుడైన అధర్వునికి చెప్పెను.—

ఆవిద్య లెవ్వియనగా:-

శ్రుతి:- "ఋగ్వేదో యజుర్వేదస్సామవేదో౽ థర్వవేదశ్శిక్షా కల్పోవ్యాకరణం నిఋక్తం ఛందోజ్యోతిషమితి"॥ (ప్రముండకం ౧-౫)

తా॥ ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము. అధర్వ వేదము, శిక్షా, కల్పము, వ్యాకరణం, నిఋక్తము, ఛందస్సు, జ్యోతి షం మొదలైనవి.

శ్రుతి:- "ఋగ్వేదం విజ్ఞాపయుతి యజుర్వేదగ్ సామవేదమా ధర్వాణం చతుర్థమితిహాసపురాణాం పంచమం వేదానాం వేదం॥"

(ఛాందోగ్యం. సప్తమప్ర॥ ౨-౧)

తా॥ ఋగ్వేదమును, యజుర్వేదమును, సామవేదమును, నాల్గవదైన అధర్వణవేదమునున్నూ, అయిదవదిన్ని వేదములకు వేద మున్నూ అయిన ఇతిహాస పురాణములున్నూ విజ్ఞాపనము చేయబడు చున్నవి.—

[ఇతిహాసపురాణములు వేదార్థమును వివరించి సంపూర్ణముగ జెప్పునవి గనుక "వేదానాం వేదం" వేదములకు వేదము అని చెప్ప బడినది]

శ్రుతి: "బ్రహ్మప్రజాపతయ ఉవాచ ప్రజాపతిర్మనవే మనుః ప్రజాభ్యః"—

తా॥ (పైన చెప్పబడిన) సర్వవేదములను, వేదాంగములను, ఇతిహాస పురాణాదులను, బ్రహ్మ ప్రజాపతులకు జెప్పెను. ప్రజాపతి మనువునకును మనువు ప్రజలకును చెప్పెను.

ఈ ప్రకారము సర్వవర్ణా శ్రమాచార ధర్మములు జీవులకంటె ముందుగానే పరమాత్మనుండి వేదములతో బాటు స్వయముగా ఆవిర్భ వించినవి. వానిని ప్రథమమున బ్రహ్మయు ఆయునవలన ప్రజాపతు లును, వారివలన మనువును, మనువువలన మానవులలో బ్రాహ్మణు లును పొందిరి. బ్రాహ్మణులవలన సర్వవర్ణములకును పరంపరా ప్రచారము చేయబడి ఆచరింపబడుచున్నవిగాని అవి యెవరివలనను యోచింపబడి వ్రాయబడినవి కావు. గనుకనే హిమాలయ వింధ్యపర్వ తములు త్తరదక్షిణహద్దులుగా గలిగి ప్రయాగకు పడమరగాను, సర స్వతీ నదీగుప్తమైన వినశన దేశమునకు తూర్పుదిగాను యుండిన దేశము మధ్యదేశమనియు, ఆ దేశమందు వంశపారంపర్య క్రమముగా వచ్చు చుండిన యే ఆచారములుగలవో అవియే నాలుగువర్ణముల వారికిని, సంకీర్ణజాతులకును ఆలంబనీయములనియు, ఆ ప్రదేశమునందు జన్మిం చిన బ్రాహ్మణునివలననే భూలోకములోనుండు సర్వమానవులు తమ తమ ధర్మములను తెలిసికోవలసినదనియు మనువు చెప్పుచున్నాడు.

శ్లో॥ "ఏతద్దేశప్రసూతస్య సకాశాదగ్రజన్మనః।
స్వంస్వంచరిత్రం శిక్షేరణ్ పృథివ్యాం సర్వమానవాః॥"

(మను. ౨-౨౦)

శ్రుతి:- "బ్రాహ్మణాన్ననిందేత్తద్వ్రతమ్." (ఛాందోగ్యోపని షత్. ౨-౨౦-౨).

తా॥ "బ్రాహ్మణులను నిందింపకుము. అదివ్రతము గలవాడవు కమ్ము" అని వేదమాదేశించుచున్నది—

# స్వాయంభువుని వంశము

బ్రహ్మావర్తదేశమున సరస్వతీనదీతీరమున వసిష్ఠాది తొమ్మిది మంది ప్రజాపతులతో కూడి ప్రథమమున నివసించిన దంపతులు:—

స్వాయంభువ ప్రజాపతి + శతరూప.

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| ప్రియవ్రతుడు | ఉత్తానపాదుడు | ఆహూతి (కుమార్తె) | దేవహూతి | ప్రసూతి |
| + | + | + | + | + |
| భార్య బర్హిష్మతి | భార్య సునీతి | భర్త ఋచి ప్రజాపతి | భర్త కర్దమ ప్రజాపతి | భర్త దక్షప్రజాపతి |

## I. ప్రియవ్రతుని వంశక్రమము:—

భార్య బర్హిష్మతియందు. కుమారులు పదిమంది ౧ యాగ్నీధ్ర ౨ ఇధ్మజిహ్వ, ౩ యజ్ఞబాహు, ౪ మహావీర, ౫ హిరణ్యరేత, ౬ ఘృతపృష్ఠ, ౭ సవన, ౮ మేధాతిథి, ౯ వీతిహోత్ర, ౧౦ కవి.

కుమార్తె ౧ ఊర్జస్వతి; యీమె భర్త భార్గవుడు.

ప్రియవ్రతుని రెండవ భార్యయందు:—

కుమారులు ముగ్గురు. ౧౨ ఉత్తమ, ౧౩ తామస, ౧౪ రైవత. ఇందు 4, 7, 10 కుమారులు పరమహంసలైరి. **12, 13, 14,** కుమారులు మనువులైరి. మిగత యేడుగురు కుమారులు రజోగుణ ప్రధానులై క్షాత్రమవలంబించి మహాభూమి భూగోళముల యందున్న సప్తద్వీపాధిపతులైరి. ప్రియవ్రతుని జ్యేష్ఠపుత్రుడు యాగ్నీధ్రుడు. ఈతడుభయజంబూ ద్వీపములకును నధిపతి. ఇతని కుమారులు తొమ్మిదిమంది. వీరు భూగోళముమీది జంబూద్వీపమును నవవర్షములుగా విభాగించి వాటి కధిపతులైరి. ౧. నాభి, ౨. కింపురుష, ౩. హరి, ౪. ఇలావృత, ౫. రమ్యక, ౬. హిరణ్మయ, ౭. కురు, ౮. భద్రాశ్వ, ౯. కేతుమాల అను వీరల పేర్లతో నాయా వర్షములు పిలువబడినవి. హిమాలయపర్వతములకు దక్షిణముగా నిరక్షరేఖమీదనుండిన "లంకా" ద్వీపమువరకుగల భూఖండమున

కనాడనుండియు "భారతవర్షమను పేరుగలదు. దానిని "నాభి" యను యాజ్ఞీధ్రుని జ్యేష్ఠపుత్రుడు పరిపాలించినందున దీనికి "అజనాభ" వర్షమను పేరుకలిగినది. పిమ్మట "నాభి"యొక్క కుమారుడు "ఋషభుడు" ఆతని కుమారుడు "భరతుడు" పరిపాలించినందున ఆతని పేరున నీ యజనాభ వర్షమునకు భారతవర్షమనుపేరు తిరిగి కలిగినది. (నెం. ౮ పటమును చూడుడు.) "లంక"కు తూర్పున నిరక్షరేఖమీద యేబదవ డిగ్రీవరకును, "లంక"కు పశ్చిమమున నిరక్షరేఖమీద యేబదిడిగ్రీల వరకును, "లంక"నుండి ఉత్తరధ్రువమునకుగల "యామ్యోత్తరరేఖ (అనగా మెరిడియన్) మీద నూపుదియైదు డిగ్రీలవరకు భారతవర్షము వ్యాపించియుండెడిది. దీనికి తూర్పున యిప్పుడు పసిఫిక్కుసముద్రమని పిలువబడు "లవణసముద్రము. దీనికి తూర్పుసముద్రమని పేరు. దక్షిణమున యిప్పుడు హిందూమహాసముద్రమని పిలువబడు "దక్షిణ లవణ సముద్రము." పశ్చిమమున ఆఫ్రికాలోని ఈక్వేటరుకు పడమర యిప్పుడున్న భూభాగము పూర్వము సముద్రముగా నుండెడిది. అదియే "పశ్చిమ లవణసముద్రము. ఉత్తరమున "కింపురుషవర్షము," టిబెట్టు యీకింపురుషవర్షములో చేరియున్నది. ఈవర్షవిభాగము యీగ్రంథమున వివరముగా లోగడ తెలిసికొనియుంటిరి.

ప్రియవ్రతునికి జ్యేష్ఠకుమారుడైన యాజ్ఞీధ్రుని జ్యేష్ఠపుత్రుడయిన "నాభికి" శ్రీ మహావిష్ణు "ఋషభుడ"ను పేరున యవతరించి ఋషులకు పరమహంసధర్మము ననుభవమునకు దెచ్చుకొని యాచరింపతగిన విధానమును నేర్పెను. మహాత్ముడైన ఋషభునికి నూరుమంది పుత్రులుద్భవించిరి. అందు జ్యేష్ఠుడు "భరతుడు." ఇతడజనాభవర్షమును పాలించినాడు. ఈతడే "జడభరతుడు" అను నామమున పిలుపబడినవాడు. ఈయున పేరుననే అజనాభవర్షము భారతవర్షమని పిలువబడినది. ఇతనిభార్య "పంచజని" యను నామెయందు "సుమతి"యనువాడు పుట్టెను. సుమతికి దేవతాజిత్తు, అతనికి దేవద్యుమ్నుడు, అతనికి పరమేష్ఠి, ఆతనికి ప్రతీహుడు నాతనికి ప్రతీహర్త. అతనికి భూముడు భూమునికి ఉద్వేధుడు, అతనికి ప్రస్తోత అతనికి విభుడు, ఆ విభునకు పృథుషేణుడు, ఆతనికి

నక్తుడు, అతనికి గయుడు, అతనికి చిత్రరథుడు, అతనికి మరీచి, అతనికి బిందుమంతుడు, అతనికి మధువు, అతనికి వీరవ్రతుడు, అతనికి మన్యువు మొదలైనవారలు కలిగి వారి సంతాన పరంపరలచే లోకములను నిండించిరి. సృష్ట్యాది నూటతొంబది ఆరుకోట్ల సం॥రముల నుండియు పరిపాలించిన రాజులను వ్యక్తిగతముగా పేర్లతో చెప్పుట కష్టతరమైనందున "రాజవంశముల" నెత్తుకొని వంశపరంపరలో ప్రసిద్ధిగలవారి పేర్లను మాత్రము తీసికొని వరుసక్రమము చెప్పబడినది. రాజపరంపరలో వంశములు వ్యక్తులుగా నిరూపింపబడినందున యొక రాజు పేరుగలది అనేకమంది రాజులు తెంపులేక పరిపాలించగా నందు ప్రసిద్ధిగల యొక పేరుమాత్రమావంశమున కీయబడి మనకు రాజపరంపర చెప్పబడినది. గనుక వరుసక్రమమున జెప్పబడిన రాజులపేర్లు వంశములుగా నెంచుకొనవలయునుగాని వారిని వ్యక్తులుగా దీసికొని యొక్కొక రాజు రాజ్యకాలము సగటున యేబది లేక అరువది యని యెంచి సృష్టికాలమును లెక్కవేయరాదు.

స్వాయంభువమనువుయొక్క రెండవ కుమారుడైన "ఉత్తాన పాదుని" వంశక్రమము.

ఉత్తానపాదుని కుమారుడు ధ్రువుడు. ఇతడు యమునానదీతటంబునగల మధువనంబున తపంబుజేసి శ్రీ మహావిష్ణుని యనుగ్రహంబున శాశ్వతమైన ధ్రువపదంబును బొందెను. ఇతడు రాజ్యముచేసిన కాలము యిరువది ఆరువేల సం॥రములు (26,000). ఇతని కుమారుడు వత్సరుడు వానికి పుష్పార్ణుడు. వానికి వ్యుష్టుడు వానికి సర్వతేజుడు. వానికి చాక్షుషుడు.(యితను ఆరవమనువైనాడు). చాక్షుషునికి ఉల్ముడు, వానికి అంగుడు, వానికి వేనుడు, వానికి పృథుచక్రవర్తి (యితను బ్రహ్మావర్త దేశంబున మనుక్షేత్రముగల సరస్వతీతీరమందు తొంబది తొమ్మిదశ్వమేధయాగము లొనర్చి, నూరవయాగము చేయుచుండగా ఇంద్రుడా యజ్ఞమును విఘ్నముచేయుదలచి పాషండ వేషములతో యజ్ఞాశ్వమును ముమ్మారు దాచుటయూ, ప్రతిసారియు నాతని వేషము గురితింపబడగా దానిని విసర్జింపవలసి వచ్చెను. అట్లు విసర్జింపబడిన ప్రతి వేషమును మానవులలో కొందరవలంబించి పాషండధర్మములు

గలవారైరి. వీరలే, జైనులు, బౌద్ధులు కాపాలికులు, అనుమతములు గలవారైరి. ఇది వకటవ మనువైన స్వాయంభువ మనువుకాలములో జరిగినకథ. ఇది జరిగి యిప్పటికి నూటడెబ్బదికోట్ల సంవత్సరములైనది. ఏడవ మనువు "వైవస్వతుని కాలమునుండి లెక్కించిన తిరిగి యీకథ మూడుకోట్ల సం॥రముల క్రిందట జరిగినది. అప్పుడప్పుడా మూడుమతములును ప్రముఖులైన మనుజులవలంబించినపుడు లోకమున విస్తారముగా ప్రచారమగుచువచ్చెను సుమారు నాలుగువేలసంవత్సరముల క్రిందట గౌతమబుద్ధుని వలన యీమతము తిరిగి ప్రచారమునకువచ్చెను గాని గౌతమబుద్ధు డీ మతమునకు మూలపురుషుడుకాడు. ఆతడు ప్రచారకుడు మాత్రమే. పృథుచక్రవర్తికుమారుడు జితాశ్వుడు, వానికి హావిర్ధానుడు, వానికి ప్రాచీన బర్హి, వానికి ప్రచేతసులను పేరుగల పదిమందికుమారులు. వారికి దక్షప్రజాపతి, సృష్ట్యాదిని స్వాయంభువ ప్రజాపతి వలన గలిగిన మానససృష్టిలోని పదిమంది ప్రజాపతులలో నొకడైయుండెను. చాక్షుషమన్వంతరములో (ఆరవమనువు కాలములో) దైవయోగమున నీతని దేహముపోగా తిరిగి వైవస్వతమన్వంతములో దక్షుడనుపేరుతో ప్రాచేతసులకు జన్మించి ప్రజావృద్ధిచేసి యున్నాడు.

### III. స్వాయంభువ మనువుయొక్క మూడవసంతానమైన "ఆకూతి" యను కుమార్తెయొక్క వంశక్రమము:—

ఈమె భర్త రుచిప్రజాపతి. ఈదంపతులకు విష్ణువు యజ్ఞుడను నామంబునను, ఆదిలక్ష్మి "దక్షిణా"యను కన్యకారత్నంబుగను యుదయించి నాదిమిథునంబయ్యె. ప్రథమసృష్టియందిది నిషిద్ధంబుగా లేదు. ఎందుకనన — దేవతాశరీరములనుండి మానవశరీరములు పుట్టుట యసంభవము — ఈమధ్య సంధిసమయము ప్రత్యేకముగా నుండును. అపుడు తేజోరూపులైన దేవతలవలన జన్మించిన రూపములున్నా తేజోమయములైయుండును. అంతియేగాని రక్తమయములగు పాంచభౌతిక దేహములు కానేరవు. ఆసిద్ధాంతము ననుసరించి ఆదేవతలలో ఒక దంపతులవలన గలిగిన సంతానము రక్తమయదేహధారులు కానందున వారు దంపతులుగ వర్తించుటదోషము కాక పోయెను—ఆమిథునము

నకు ౧. తోషుడు ౨ ప్రతోషుడు 3. సంతోషుడు ౪. భద్రుడు ౫. శాంతి ౬. ఇడస్పతి ౭. ఇధ్మ్ముడు ౮. కవి ౯. విభుడు ౧౦. వహ్ని ౧౧. సుదేహుడు ౧౨. రోచనుడు. అనుపన్నిద్దరు బుట్టి స్వాయంభువ మన్వంతరమున తుషితులను దేవతలైరి. (భాగ. ౪-౪ ౬॥ ౬ వరకు).

IV. స్వాయంభువ మనువుయొక్క నాలుగవ సంతానమైన "దేవహూతి" యను కుమార్తె యొక్క సంతానము.

ఈమెభర్త కర్దమప్రజాపతి. ఈదంపతులకు ౧ కళ, ౨ అనసూయ, 3 శ్రద్ధ, ౪ హావిర్భువు, ౫ గతి ౬ క్రియ, ౭ ఖ్యాతి, ౮ అరుంధతి; ౯ శాంతి యను తొమ్మిదిమంది కుమార్తెలున్ను ౧౦ కపిలుడు అను విష్ణ్వంశసంభూతుడైన కుమారుడున్ను కలిగిరి-అంటే:-

(1) మొదటికుమార్తె "కళ" ఈమెను మరీచియను ప్రజాపతి కిచ్చి వివాహము చేసిరి. ఈదంపతులకు కశ్యపప్రజాపతియు, పూర్ణిమ యను కన్యయు బుట్టిమిథునమైరి. వారికి "విరజుడు" "దేవకుల్య"యను కన్యయు గలిగి మిథునంబైరి.

(2) రెండవకుమార్తె "అనసూయ" భర్త "అత్రిమహాముని" ఈదంపతులకు ౧ అమృతాంశుడు, ౨ దత్తాత్రేయుడు, 3 దూర్వాసుడు అను ముగ్గురు కుమారులుగలిగి ఊర్ధ్వరేతస్కులైరి.

(3) మూడవ కుమార్తె "శ్రద్ధ" భర్త అంగిరసుడు వీరికి నలుగురు కుమార్తెలు ౧ సినీవాలి, ౨ కుహూ, 3 రాకా, ౪ అనుమతి, పిమ్మట బహుకాలము జరుగగా రెండవ మనువైన స్వారోచిషుని కాలములో ౫ ఉచథ్యుడు. ౬ బృహస్పతి యను నిద్దరు కుమారులున్ను కలిగిరి.

(4) నాలుగవ కుమార్తె "హావిర్భువు" భర్త పులస్త్యప్రజాపతి. వీరికి ౧ అగస్త్యుడు, ౨ విశ్రవసుడు అను నిద్దరు కుమారులు అందు విశ్రవసునికి "నిలబిల" యను భార్యయందు కుబేరుడను "కైకసి" యను రెండవ భార్యవలన రావణ, కుంభకర్ణ, విభీషణులను ముగ్గురు కుమారులును గలిగిరి,

(5) అయిదవ కుమార్తె "గతి" భర్త పులహ ప్రజాపతి వీరికి ౧ కర్మశ్రేష్ఠుడు ౨ వరీయాంశుడు 3 సహిష్ణుడు, నను ముగ్గురు కుమారులు కలిగిరి.

(6) ఆరవ కుమార్తె "క్రియ" భర్త క్రతువు ఈదంపతులకు అరువదివేల వాలఖిల్యులను ఋషిసత్తములు గలిగిరి.

(7) ఏడవకుమార్తె "ఖ్యాతి" భర్త భృగుప్రజాపతి. వీరికి ౧. ధాత, ౨ విధాత, యను కుమారులిద్దరును, 'శ్రీ' యను కన్యకా రత్నంబును గలిగిరి. 'ధాతకు' 'ఆయతి'యను భార్యయందు మృకండ మహామునియు; వానికి మార్కండేయుడును గలిగిరి. 'విధాతకు' 'నియతి'యను భార్యయందు ప్రాణుడును అతనికి వేదశిరుండను మునియు గలిగెను.

(8) ఎనిమిదవకుమార్తె – అరుంధతి. ఈమెకు ఊర్జయను వేరొక పేరు గలదు. భర్తవసిష్ఠుడు. ఈదంపతులకు ౧ చిత్రకేతుడు, ౨. సురోచి, 3 విరజుడు, ౪. మిత్రుడు, ౫. ఉల్బణుడు, ౬. వసుభృద్ధ్యానుడు, ౭ ద్యుమంతుడునను సప్తఋషులు బుట్టిరి. మఱియు శక్తి ప్రముఖులైన నూరుగురుకుమారులు గలిగి విశ్వామిత్రుని వలన సంహారింపబడిరి.

(ముఖ్యగమనింపు) "అరుంధతి" యను స్త్రీ బ్రాహ్మణుడును, మహాయోగియు తపశ్శాలియు నైన కర్దమ ప్రజాపతికిని స్వాయంభువ మనువు కుమార్తెయైన దేవహూతికిని గలిగిన యెనిమిదవ సంతానము. ఈమెను తండ్రియైన కర్దమ ప్రజాపతి వసిష్ఠునికిచ్చి వివాహ మొనర్చినాడు. (ఆంధ్ర భాగవతము తృతీయస్కంధము. 850, చతుర్థస్కంధము, 26 చూడుడు.) మఱియు అరుంధతి మహాయోగియు విష్ణువు యొక్క అవతారమూర్తియు నైన "కపిల" మహామునికి తోబుట్టువు. ఇట్టిస్థితిలో అరుధంతి చండాల స్త్రీయని చెప్ప సాహసించుచున్నారు. మేము యీ నిజమును దెలిసికొనవలయుననెడి యుద్దేశ్యమున ననేక గ్రంధముల పరిశీలించితిమిగాని యెందును "అరుంధతి చండాల స్త్రీ" యను విషయము గానరాలేదు — బ్రాహ్మణజాతిని నిందించుటకు

గాను అనూయాపరులైనవారిచే కల్పితమైనదిగాని వాస్తవముకాదు, అని తెలియవలెను. (ఎవరైనను యేగ్రంథముననైనను గనుగొనినయెడల మాకు దెలిపిన కృతజ్ఞులమైయుందుము.)

9. తొమ్మిదవ కుమార్తె "శాంతి" భర్త అధర్వుడు. వీరికి ధృతవ్రతుడు, దధ్యంచుడు ననెడి యిద్దరు కుమారులు గలిగిరి. వీరి సంతాన పరంపరచే జగంబులు పరిపూర్ణంబులయ్యెను.

10. (పది) కపిలుడు. ఈయన విష్ణువు యొక్క అవతార మూర్తి. సాంఖ్య యోగమును, భక్తియోగమును తల్లియైన దేవహూతికి చెప్పినాడు. బ్రహ్మచారి, ఋషి, మహాయోగి. సిద్ధద్వీపమున (ఉత్తర అమెరికాఖండము అని యిప్పటిపేరు)కు బోయి ఆశ్రమస్థాపనముచేసి తపంబొనర్చిన ప్రథమ మానవుడు.

V. స్వాయంభువుని ఐదవ సంతానమైన "ప్రసూతి" యొక్క వంశక్రమము. ఈప్రసూతికి భర్త దక్షప్రజాపతి. ఈదక్షుడు సృష్టిప్రారంభమున సృజింపబడిన పదిమంది ప్రజాపతులలోనివాడు. ఈయనకు ప్రచేతస్సు అని నామాంతరము ఈమెతో కలిసి యితడు ప్రజావృద్ధి చేయగలిగినాడు. కాని ఆరవమనువైన చాక్షుషమన్వంతరములో శరీర పతనముకాగా తిరిగి ప్రచేతసులకు మారిషయను భార్యయందు యీ వైవస్వత మన్వంతరములో జన్మించి కర్మదాక్ష్యంబున దక్షుండను నామంబు ధరించి బ్రహ్మచేత ప్రజాసర్గ రక్షయందు నియోగింపబడి మరీచ్యాది ప్రజాపతులను తత్తద్వ్యాపారములయందు నియోగించుచుండెను. అందువలన సీతని వంశవిస్తారంబును చెప్పునప్పుడు ప్రథమ దక్షుడనియు, ద్వితీయదక్షుడనియు వ్యవహరింపబడును. గనుక యిద్దరు దక్షులు యొకరేగాని వేరుకారు. కాలవ్యత్యాసమును మాత్రము గ్రహింపవలెను. ఉతడిప్పటికి తన యుద్యోగమునందుండి లోకానుగ్రహము కొరకు వ్యవహరింపుచున్నాడు.

ప్రసూతి + (భర్త) ప్రథమ దక్షప్రజాపతి. ఈ దంపతులకు 16 మంది కుమార్తెలు.

1. శ్రద్ధ 2. మైత్రి. 3. దయ, 4. శాంతి. 5. తుష్టి 6. పుష్టి. 7. ప్రియ. 8, ఉన్నతి. 9. బుద్ధి. 10. మేధ. 11. తితిక్ష. 12. హ్రీ. 13. మూర్తి. 14. స్వాహా. 15. స్వధా. 16. సతి:—

ఇందులో 15 "స్వధాదేవి"ని పితరులకును 16 "సతీదేవి"ని శివునకును యిచ్చి వివాహమొనర్చెను. 14 కుమార్తెయైన "స్వాహాదేవి"ని అగ్నిహోత్రున కొసంగెను. మిగతా పదముగ్గురను ధర్మున కొసంగెను. అందు ధర్మునకు దక్షపుత్రికలైన.

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రద్ధవలన | — | శ్రుతంబును |
| 2. | మైత్రివలన | — | ప్రసాదంబును |
| 3 | దయవలన | — | అభయంబును |
| 4. | శాంతివలన | — | సుఖంబును |
| 5. | తుష్టివలన | — | ముదంబును |
| 6 | పుష్టివలన | — | స్మయంబును |
| 7. | క్రియవలన | — | యోగంబును |
| 8. | ఉన్నతివలన | — | దర్పంబును |
| 9. | బుద్ధివలన | — | అర్థంబును |
| 10. | మేధవలన | — | స్మృతియును |
| 11. | తితీక్షవలన | — | క్షేమంబును |
| 12. | హ్రీవలన | — | ప్రశ్రయంబును |
| 13. | మూర్తివలన | — | నర, నారాయణులను ఋషులిరువురు గలిగిరి. |

అగ్నిదేవునకు దక్షపుత్రికయైన

14. స్వాహాదేవివలన — ౧ పావకుడు. ౨. పవమానుడు 3 శుచియును ముగ్గురు కుమారులు గలిగిరి — ఆ ముగ్గురి వలనను 45 అగ్ను లుత్పన్నంబులయ్యె. ఇట్లు తండ్రియైన

| | | |
|---|---|---|
| అగ్ని | — | 1 |
| కొడుకులు | — | 3 |
| మనుమలు | — | 45 |
| మొత్తము | — | 49 అగ్నులు |

యజ్ఞములలో వారి వారి పేర్లతో ఇష్టులు చేయబడుచు పూజింపబడు దేవతలైరి. ఈ అగ్నులు యేడు వర్గములుగా విభజింపబడిరి. వారలెవ్వరన: —

1. అగ్నిష్వాత్తులు. 2. బర్హిషదులు. 3. సౌమ్యులు. 4. పితలు. 5. నాజ్యపులు. 6. సాగ్నులు. 7. నిరగ్నులు అను నేడు వర్గములయ్యె :—

పితృదేవతలకు దక్షపుత్రికయైన

15. స్వధాదేవియందు ౧. వయున. ౨. ధారిణియును నిద్దరు కూతులు గలిగిరి. వారిద్దరు జ్ఞాన విజ్ఞాన పారగులై బ్రహ్మనిష్ఠలై యుండిరి.

16. శివునకు దక్షపుత్రియైన "సతీదేవి" భార్యయై తండ్రియైన దక్షునకునుభర్తయైన శివునకునువిరోధమురాగా, తండ్రివలన యవమానితయై యోగాగ్నిచే శరీరంబు దహించి ప్రాణంబులు విడిచి దేవతయైన హిమవంతునికి పుత్రికయై పార్వతియను నామంబు ధరించి తిరిగి శివుని వివాహంబయ్యెను. (భాగ. 4–28లll 34) ప్రథమ దక్షుని సంతానమంతయు దేవతావర్గములని తెలియువలెను.

# ద్వితీయ దక్షుని సంతతి

క॥ "ఎవ్వని సంతానంబులు, నివ్వటిలెన్ వసుధనెల్ల నెటి నాదక్షుం
డివ్వలన జగములన్నిటఁ బ్రవ్వజలము నిలిపినట్లు ప్రజఁబుట్టించెన్॥
(భాగ. 6-205)

దక్షప్రజాపతి తనయోగ బలమువలన ఆకాశమందును, భూమియందును, అరణ్యములందును, నీటిలో దిగెడువానిని, రాత్రి

సంచరించెడువానిని, పగలు సంచరించెడువానిని, మనుష్యులను, దేవ వర్గములను, గరుడాది పక్షి విశేషములను, సర్పాదులను, కిన్నరులను, దానవులను, యక్ష, పక్షి, నగములు, వృక్షములు మొదలైన బహు విధములైన జీవకోటి సంతతిని సృజించెను. (భాగ.6_206_207)

క॥ "బహువిధముల, బహుముఖముల
బహురూపములైన ప్రజల బహులోకములన్
బహుళముగ జేసి మదిలో
బహుమానము నొందడయ్యెఁ బ్రఖ్యాతముగన్ ॥
(భాగ. 6-208)

" ఇట్లు దక్షప్రజాపతి ప్రజాసర్గంబు చాలక చింతించి, మంత సంబున లక్ష్మీకాంతుని సంతుష్టస్వాంతుంజేయువాడై, వింధ్యపర్వతంబునకు జని యఘమర్షణంబను తీర్థంబున యతిఘోరంబైన తపంబొనర్చె." (భాగ. 6_211,212)

" దక్షుని తపంబునకు మెచ్చి భగవంతుండగు నారాయణుండు సాక్షాత్కరించి పంచజన ప్రజాపతి తనూజయగు "యశిక్ని" యను కన్యకను దక్షునకిచ్చి, దీనిని నీవు భార్యగా గొని మిథున వ్యవాయధర్మంబున యీ స్త్రీయందు ప్రజాసర్గంబు యతివిపులంబు గావింపగలవాడవు. మఱియు నీకు బిదప నీ క్రమంబున నిఖిల ప్రజలును, మన్మాయామోహితులై మిథున వ్యవాయ ధర్మంబున బ్రజావృద్ధి నొందించి మదారాధనపరులై యుండగలవారని పలికి యంతర్ధానంబు నొందె." (భాగ. 6-223)

పిమ్మట దక్షుండు విష్ణుమాయామోహితుడైన "యశిక్ని" యను తన భార్యయందు "హర్యశ్వుల" ను పదివేల పుత్రులంబుట్టించె. వారలు నారదుని ప్రేరణంబున తండ్రి నిర్దేశించినట్లు ప్రజాసర్గంబొనర్పజాలక విరాగులై పరమహంసలై చనిరి. పిమ్మట దక్షుండు చింతనొంది తిరిగి శబళాశ్వులను పేర వేయిమంది కుమారులను గలిగించిన వారును నారదుని యుపదేశంబున పరమహంస లైరి. పిమ్మట దక్షుండు తన భార్యయందు అరువదిమంది కూతులంగని

ధర్మునికి పదుగురను, కశ్యపునకు రెండుసార్లుగా పదిహేడుగురను, చంద్రునకిరువదేడ్వురను, భూతునకిద్దరను, అంగిరసునకిద్దరు, కృశాశ్వునకిద్దరు చొప్పున నిచ్చి వివాహంబొనర్చెను.'' (భాగ. 6.252)

## ౧ ధర్మని సంతానము.

| భార్యలు | | సంతానము |
|---|---|---|
| 1. భానువుకు | — | 1. వేదుడు, 2. ఋషభుడు, 3. ఇంద్రసేనుడు బుట్టిరి. |
| 2. లంబకు | — | విద్యోతుడు యితనికి స్తనయిత్నులనువారలు బుట్టిరి. |
| 3. కకుబ్దేవికి | — | సంకటుడు యితనికికీటకుండు యితనికి దుర్గాభిమానులైన దేవతలు బుట్టిరి. |
| 4. భూమిదేవికి | — | దుర్గభూమికధిష్ఠాన దేవతలుజన్మించిరి. వారికి స్వర్గుండును, నందియు బుట్టిరి. |
| 5. విశ్వదేవికి | — | విశ్వేదేవగణంబులు జనించె. వారలు అపుత్రకులు. |
| 6. సాధ్యాదేవికి | — | సాధ్యగణంబులుబుట్టిరి. వారికి నర్థసిద్ధియను వాడు బుట్టె. |
| 7. మరుత్వతీదేవికి | — | మరుత్వంతుండు, జయంతుండును బుట్టిరి. అందు జయంతుండు "ఉపేంద్రుండ''నబడె. |
| 8. ముహూర్తాదేవికి | — | సకల భూతంబులకు నాయాకాలంబులం గలిగెడు నాయాఫలంబులనిచ్చు "మౌహూర్తికుల''నియెడు దేవగణంబులు బుట్టిరి. |
| 9. సంకల్పాదేవికి | — | సంకల్పుండుదయించె. వానికి కాముండు బుట్టె. |
| 10. వసుదేవికి | — | 1. ద్రోణుడు, 2. ప్రాణుడు, 3. ధ్రువుడు, 4. అర్కుడు, 5. అగ్ని, 6. దోషుడు, 7. వస్తువు, 8. విభావసువు, అను ఎనమండుగురు వసువులు జనించిరి. |

| | |
|---|---|
| అందు ౧. ద్రోణునకు "నభిమతి" యనియెడు భార్యయందు. | 1. హర్షము 2. శోకము 3. భయములను వారలు బుట్టిరి—(వీనికధిష్ఠాన దేవత లని గ్రహింపవలెను) |
| ౨. ప్రాణునకు భార్య ఊర్జస్వతి యందు | 1. సహుడు 2. ఆయువు 3. పురోజవుడు గలిగిరి |
| ౩. ధ్రువునకు భార్య ధరణి దేవియందు | అనేక విధంబులగు పురుషులు బుట్టిరి. |
| ౪. అర్కునికి భార్య "వాసన" యందు | ధర్షాదులుదయించిరి. |
| ౫. అగ్నికి భార్య "వసుధారా" యందు | ద్రవిణకాదులుపుట్టిరి, కృత్తికలకు స్కందుడు వానికి విశాఖాదులుదయించిరి. |
| ౬. దోషునకుభార్య "శర్వరి" యందు | హరికళ 'శింశుమారుండు' దయించె |
| ౭. వస్తువునకు భార్యా "అంగీరస" యందు | "విశ్వకర్మ" యను శిల్పాచార్యుండు బుట్టె, అతనికి నాకృతి యను సతియందు చాక్షుషుండను మనువుదయించె, ఆ మనువు వలన "విశ్వేలు" "సాధ్యులు" అనువారలు బుట్టిరి. |
| ౮. విభావసునకు భార్య "ఉష" యందు | 1 వ్యుష్టి. 2 రోచి. 3 ఆతపుడు అనువారలు జనించిరి, అందాతపునికి పంచయాముండను దివసాభిమాన దేవతయుదయించె. |

## ౨. భూతుని సంతానము :

దక్షుని అల్లుడైన "భూతు"నకు భార్య "సురూప" యను భార్యయందు కోట్లసంఖ్యలైన రుద్రగణంబు లుదయించిరి.

మఱియు, 1. రైవతుడు 2. అజుడు 3. భవుడు. 4. భీముడు 5. వాముడు 6. ఉగ్రుడు. 7. వృషాకపి 8. అజైకపాత్తు 9. అహిర్బుధ్నుడు 20. బహురూపుడు 11. మహాంతుడు అనువారలు రుద్రపారిషదులును, అతిభయంకరులైన ప్రేతులును, వినాయకులును బుట్టిరి.

## 3. ఆంగీరసుని సంతానము :

| | |
|---|---|
| దక్షుని కల్లుడైన "అంగీరసుడు" భార్యా'స్వధ' యందు | పితృగణంబులు బుట్టిరి. |
| రెండవభార్య దక్షపుత్రిక 'సతి' యందు | అథర్వ వేదాభిమానదేవతలు పుట్టిరి. |

## ౪. కృశాశ్వుని సంతానము :

| | |
|---|---|
| దక్షునికల్లుడైన "కృశాశ్వుని"కి భార్య "అర్చిదేవి" యందు | "ధూమ్రకేశు" డను కుమారుడు గలిగెను. |
| (కృశాశ్వుడు లేక వేదశిరునికి) దక్ష కుమార్తెయైన "ధిషణాదేవి" యందు | ౧, దేవలుడు ౨, వయునుండును ౩, మనువును బుట్టిరి. |

## ౫. కశ్యపుని (లేక తార్క్ష్యుని) సంతానము :

దక్షుని పుత్రికలు 17 పదిహేడుగురు రితని భార్యలు

1. అదితి 2. దితి 3. తనువు 4, అరిష్ట 5, తామ్ర 6. క్రోధవశ 7, సురస 8, సురభి 9, ముని 10, తిమి 11, ఇళా 12. కాష్ఠ 13, సరమ 14. వినత 15, కద్రువ 16, పతంగి 17, యామిని.

అందు :

I. అదితికి పుట్టినవారందరు దేవతలు

1. వివస్వంతుడు 2. అర్యముడు 3. పూషుడు 4. త్వష్ట 5. సవిత 6. భగుడు 7. ధాత 8. విధాత 9. వరుణుడు 10. మిత్రుడు 11. శక్రుడు 12; ఉరుక్రముడు అను మనువులు జన్మించిరి. అందు వివస్వంతునికి సంజ్ఞాదేవియందును శ్రాద్ధదేవుండను మను వుదయించె, (ఇతనే వైవస్వతుడు) మఱియు యముడు, యమియునను నిరువురు మిధునంబుగాను - అశ్వినీదేవతలును గలిగిరి రెండవభార్య యైన ఛాయాదేవి యందు శనైశ్చరుడును, సావర్ణియను మనువును, తపతియను కన్యకయుం బుట్టెను, ఈమె సంవరుణుకి భార్య యయ్యెను.

2. అర్యమునకు :— మాతృకయను భార్యయందు 'చర్షణు'లుదయించిరి. వారి మూలంబున మనుష్యజాతి యీలోకంబున స్థిరంబుగా నుండునట్లు బ్రహ్మదేవునిచే గల్పింపబడియె. ఇంతవరకు మానవులు స్వర్గలోకమునకు బోయి వచ్చుచుండిరి. చర్షణ దేవతల ఆధిపత్యము వచ్చిన పిమ్మట మానవులు భూలోకవాసులైరి. స్వర్గమునకు బోయెడి శక్తి లోపించినది.

3. పూషునికి :— దంతములుపోయి పిండి తినువాడయ్యెను. ఈతనికి సంతతి లేదు.

4. త్వష్టకు :— దైత్యులకు తోబుట్టువైన "రచన" యను భార్యయందు "విశ్వరూపుడు బుట్టెను ఈ విశ్వరూపుడు బృహస్పతి లేని సమయంబున దేవతలకు బురోహితుండై తన తల్లి తోబుట్టువులైన (అనగా మేనమామలు) దైత్యులకు యజ్ఞభాగంబు లిచ్చిన కారణంబున ఇంద్రునిచే సంహరింపబడెను. తన కుమారుని సంహరించిన కారణంబున త్వష్ట ప్రజాపతి ఇంద్రుని సంహరింప గలండులకు మారణ క్రతు హోమంబొనర్పనందుండి వృత్రాసురుం దుద్భవించెను. వాడు వేదమంత్రముల, నపస్వరముగా నుచ్చరించినందున ఇంద్రుని జంపు నిమిత్తము జేయుబడిన మంత్రముయొక్క అర్థము వ్యతిరేకించి

"ఇంద్రునివలన జంపబడుదుగాక" యని యర్థమిచ్చినందున ఇంద్రుని వజ్రాయుధముచే హతుడయ్యెను.

5. సవితృనకు :— పృశ్ని, సావిత్రి, వ్యాహృతియను భార్యలందు, పశు, సోమ, పంచయజ్ఞంబులు (అనగా యజ్ఞాధిష్ఠాన దేవతలు) జన్మించిరి.

6. భగునకు :— సిద్ధియను భార్యవలన 1. మహిమ, 2. అనుభవ. 3. విభువులను మూవురును 4. ఆశిషాయను కుమార్తెయును గలిగిరి.

7. ధాతకు :— 1. కుహూదేవి. 2. సినీవాలి 3. రాక 4. అనుమతి. నలుగురు భార్యలు. అందు కుహూదేవికి 'సాయము' అను కుమారుడున్నూ 2. సినీవాలికి 'దర్శ' యను కొడుకును 3. రాకకు 'ప్రాతరాఖ్యుడు' 4. అనుమతికి 'పూర్ణిమాఖ్యుడును' కొడుకులు గలిగరి.

8. విధాతకు :— 'క్రియ' యను భార్యయందు "అగ్ని పురీష్యాదు"లు గలిగిరి.

9. వరుణునకు :— 'జర్షి' యను భార్యయందు పూర్వకాలంబున బ్రహ్మపుత్రుండైన భృగువును, వల్మీకంబున జనించిన వాల్మీకియును జన్మించిరి.

10. మిత్రునకు :— 'రేవతి'యను భార్యయందు అరిష్ట, పిప్పలయను కుమారులుదయించిరి.

11. మిత్రావరుణులకు :— ఊర్వశిదర్శనంబున రేతోద్గతంబైన దానిని కుంభంబున ప్రవేశింపజేయ అందు అగస్త్యుండును, వసిష్ఠుండును జనియించిరి. (ఈ వసిష్ఠుండు సృష్ట్యాదియందు గలిగిన పదుగురు ప్రజాపతులలోని వాడైనను కొండొక శాపవశంబున శరీరంబును బోగొట్టుకొని బ్రహ్మదేవు నాశ్రయించి వైవస్వత మన్వంతరంబున మిత్రావరుణులకు ఊర్వశీ దర్శనమాత్రంబున మనంబు చలించి రేతోద్గతంబుకాగా వారు జూసిని కుంభములో

నుండగా నందుండి అగస్త్యునితో సహా తిరిగి వసిష్ఠుడు శరీరము పొందిన వాడాయెను.

12. శక్రునకు :— 'పౌలోమి' యను భార్యయందు జయంతుడు, ఋషభుడు విదుషుడనను ముగ్గురు కొడుకులు గలిగిరి.

13. ఉరుక్రమునకు :— 'కీర్తి'యను భార్యయందు "బృహచ్ఛ్లోకుండు" బుట్టె, బృహచ్ఛ్లోకునకు సౌభగాదులు పుట్టెరి,

II. దితికి :— యీమెకు పుట్టినవారు దైత్యులు,

1. హిరణ్యకశ్యపుడు 2. హిరణ్యాక్షుడు అను యిద్దరు కుమాళ్లు అందు హిరణ్యకశిపునకు భార్యయైన దత్త (లీలావతి) యందు 1. ప్రహ్లాద 2. అనుహ్లాద 3, సంహ్లాద 4. హ్లాదులను నలుగురు కుమాళ్లు 5. సింహికయను కుమార్తెయు కల్గిరి. అందు ప్రహ్లాదునకు "దేవి" యను భార్యయందు "విరోచనుండు" బుట్టెను. అతనికి బలి జన్మించెను. బలికి "అశన" యను భార్యయందు బాణుండు జ్యేష్ఠుండుగా నూరుగురు కుమాళ్ళు పుట్టిరి. బాణాసురుడు పరమేశ్వరు నారాధించి ప్రమథ గణంబులకు ముఖ్యుడయ్యెను. మఱియు "దితికి" పుట్టిన "మరుత్తుల" ను వారలు నలుబది తొమ్మిదిమంది సంతానము లేని వారై తపోశక్తిచే ఇంద్రునితో గూడి దేవత్వము నొందిరి.

2. అనుహ్లాదునకు :— "ఊర్మి" యను భార్యయందు ౧. బాష్కలుడు ౨. మహిషుడు అను యిద్దరు జన్మించిరి.

3. సంహ్లాదునకు :— "గతి" యను భార్యయందు పంచజనుండు బుట్టెను.

4. హ్లాదునకు :— "దమని" యను భార్యయందు వాతాపి; ఇల్వలులు బుట్టిరి. వారిని అగస్త్యుండు జీర్ణింపజేసుకొనియెను.

5. "సింహిక" యందు రాహువు జనించెను.

III. తనువునకు :— దేవతలకు శత్రువైన 18 మంది కుమాళ్లు గలిగిరి. వారిపేరు 1. ద్విమూర్ధుడు 2. శంబరాసురుడు 3. అరిష్టుడు

4. హయగ్రీవుడు 5. విభావసుడు 6. అయోముఖుండు 7. శంకుశిరుండు 8. స్వర్భానుడు 9. కపిలుడు 10. ఆరుణ 11. పులోముడు 12. వృషపర్వుడు 13. ఏకచక్రుడు 14. అనుతాపనుడు 15. ధూమ్రకేతుడు 16. విరూపాక్షుడు 17. దుర్జయుడు 18. విప్రచిత్తి-వీరిలో యెనిమిదవవాడగు స్వర్భానునకు "సుప్రభ" యను కన్యక కలిగెను. దాని "నముచి" యనువాడు వివాహంబయ్యెను - పండ్రెండవవాడగు వృషపర్వునకు "శర్మిష్ఠ" యను కూతురు గలిగెను. దానిని నహుషుని కుమారుడైన "యయాతి" వివాహంబయ్యెను. యయాతికి శర్మిష్ఠ యందు 1. ద్రుహ్యుడు 2. అనువు 3 పూరుడు అను కుమాళ్ళు ముగ్గురును, జ్యేష్ఠ భార్యయగు "దేవయాని" యందు జ్యేష్ఠులుగా యదు, తుర్వసులను కుమారు లిరువురును వెరశి యయాతికి ఐదుగురు తనయులు కలిగిరి.

యయాతి కుమాళ్ళు ఐదుగురిలో జ్యేష్ఠులైన 1. యదువు 2. తుర్వసు 3. ద్రుహ్యుడు 4 అనువు యీ నలుగురు తండ్రి కోరిక తీర్చక నిరాకరించినందున వారికిని వారి సంతానమునకును రాజ్యార్హత లేకుండునట్లు శపించెను. కడసారి కుమారుడైన "పూరుడు" తండ్రియొక్క ఈప్సితమును సంతోషపూర్వకముగా వహించి తీర్చినందున యయాతి రాజ్యమునకు "పూరుని" చక్రవర్తిగా చేసెను. యదువు వంశమువారు యాదవులు. వీరికి రాజ్యార్హత లేకపోయెను. పూరుని వంశములోనివాడు ఉగ్రసేనుడు యితని కుమారుడు కంసుడు అందువలనే రాజవంశములోనివాడగు కంసుడు దుష్టుడైనందున తండ్రిని బందిఖానాలో నుంచి తాను రాజాయెను. శ్రీకృష్ణుడు దుష్టుడైన కంసుని మేనమామయైనను మన్నింపక వానిని సంహరించి వాని తండ్రియైన ఉగ్రసేనుని తిరిగి రాజుగా చేసెను.

తనువు యొక్క కుమాళ్ళలో పదవవాడగు "అరుణి" యను వైశ్వానరునకు 1. ఉపదానవి 2. హయశిరసి 3. పులోమ 4 కాలక యను నలుగురు పుత్రికలు. అందు 1 ఉపదానవి హిరణ్యాక్షునకు పత్నియయ్యెను. 2. హయశిరసను క్రతు ప్రజాపతి వివాహంబయ్యెను. 3. పులోమ 4 కాలక లిద్దరను కశ్యప ప్రజాపతి చతుర్ముఖుని వాక్యం

బున వివాహంబయ్యెను. ఆ యిరువురలో "పులోమకు" పౌలోము డును, "కాలక"కు కాలకేయుడు అను కొడుకు లిరివురు కలిగిరి. వారికి అరువదివేల రాక్షసులు జన్మించిరి. వారు యజ్ఞ కర్మంబులకు విఘా తుకులై బహుకాలము వర్తింప వారి నర్జునుండు వధించెను.

18. విప్రచిత్తి "సింహిక" యను భార్యయందు రాహువు, కేతువు మొదలైన నూరుమంది కొడుకులు పుట్టి గ్రహత్వంబు గైకొనిరి.

దిగువ చెప్పబడినదంతయు అభిమాన దేవతల సృష్టియని తెలియ వలెను.

| | | |
|---|---|---|
| iv | అరిష్టకు | గంధర్వాలు గలిగిరి |
| v. | తామ్రకు | శ్యేన, గృధ్రాదులు గలిగెను |
| vi. | క్రోధవశకు | సర్పంబులును, |
| vii. | సురసకు | యాతుధానులును (రాక్షస జాతిలోనివారు) |
| viii. | సురభికి | మహిషాది సురభులు |
| ix. | మునికి | అప్సరసలు |
| x. | తిమికి | జలచరంబులు |
| xi. | ఇళకు | వృక్షాద్యులైన ఓషధులు |
| xii. | కాష్ఠకు | పంచ శఫాదులు |
| xiii. | సరమకు | శ్వాపదములు (శునకములు మొదలైనవి) |
| xiv. | వినతకు | విష్ణువునకు వాహనంబైన గరుడుండును సూర్యునకు రథసారధియైన అనూరుండును బుట్టిరి. |
| xv. | కద్రువకు | అనేక విధములగు భుజగంబులు పుట్టెను. |
| xvi. | పతంగికి | పక్షులు పుట్టెను. |
| xvii. | యామినికి | శలభంబులు పుట్టెను' |

ఈ యభిమాన దేవతలవలన నానాయోనివర్గంబులు సృజింపబడి లోకములన్నియు నిండింపబడినవి,

ఈ విధంబున కశ్యప ప్రజాపతి సంతాన పరంపరలచే జగంబులన్నియు పూర్ణంబులయ్యెను, పై విధములగు సంతానములన్నియు వారి సంకల్పమువలనను యోగశక్తులవలనను, మహిమా విశేషమునను, భార్యాభర్తల సంయోగరూపమునను యీ మొదలైన అనేక విధముల జీవసృష్టి యొనర్పబడినది. ప్రజాపతులు ఆధికారిక పురుషులు. సృష్టిని బహిర్గత మొనర్చుటయే వారికి విధ్యుక్త ధర్మము, లయకాలమందు ప్రకృతిలో వారి వారి కర్మలతో సహా లీనమైయున్న జీవకోటిని వారి వారి గుణ కర్మానుసారమైన శరీరమునిచ్చి సృష్టిలోనికి బహిర్గత మొనర్చుటకుగాను ప్రతి సృష్టియందును ప్రజాపతులుగా, యోగశక్తులు మహిమావిశేషములు గలిగి గొప్పతపస్సుతో గూడిన జీవులు వచ్చుచుందురు, గనుక వారికి సాధ్యముకానదేదియు నుండదు.

౬, చంద్రుని సంతానము — దక్షపుత్రికలు 27 గురు భార్యలైనను క్షయరోగియవుట వలన చంద్రుడు సంతాన హీనుడయ్యెను, ఆ యిరువదియేడుగురు భార్యలు అశ్విన్యాదినక్షత్ర రూపములనొందిరి,

(ఇచ్చట చంద్రుడన చంద్రగోళము కాదు. గోళాధి దేవతయైన చంద్రదేవత అని తెలియవలెను,)

ధర్మాధర్మములు రెండును సృష్టి ప్రారంభమున యేకకాలమునందే సృజింపబడినవి, దేవతావర్గములు ధర్మమే ప్రాధాన్యముగా గలవారు, రాక్షసులు, అసురులు, పిశాచగణములు, భూతములు ప్రేతులు, యాతుధానులు మొదలుగాగల వర్గములవారు అధర్మము నాచరించు స్వభావముగలవారు, మానవులు ధర్మాధర్మరూపులు, వీరందరూ నాదిసృష్టిలోనివారు, వీరందరికి ప్రత్యేక స్థానములు స్వర్గ మర్త్య పాతాళ లోకములయందు నిర్ణయింపబడియున్నవి. దస్యులు, దాసులు, కృష్ణత్వచ, కృష్ణయోని, కృష్ణగర్భ, 'అనార్య, అవ్రత

అన్యవ్రత, వృషల యను పదములు యజ్ఞయాగాది క్రతువులనొదిలి వాటిని దూషించెడి వారినిన్ని, ఉపనయనాది వేదోక్త సంస్కారములను పరిత్యజించిన వారినిన్ని తమ కుటుంబములోని వారైనను ఆర్యులు వారిని సంఘమునుండి బహిష్కరించి గ్రామములలోనుండి వెడల నడిచి నందువలన వారు శత్రుత్వమును వహించి ఆర్యులకును వారిచే చేయ బడు కర్మలకును తీరని యుపకారమొనర్చుచు దుష్టులుగా ప్రవర్తించు చుండుటవలన అట్టివారిని పై పేర్లతోనేగాక వారి దుష్టత్వమును సూచించుటకు (అధర్మపరులైన) అసురరాక్షస యాతుధాన పిశాచ మొదలైన దుష్టవర్గములను సంబోధించినట్లు పిలుచుచుండిరేగాని వారు ప్రత్యేకవర్గముగాని ఆర్యావర్తములోని ఆదిమవాసులుగాని కారు, అట్టి ఆదిమవాసు లెవరును లేరు:

"భూలోకములో ఆదిమనివాసులు ఆర్యులేయైయుండిరి."

"ఆర్యుల జన్మభూమి ఆర్యావర్తమై యున్నది."

పైన చెప్పబడిన "మనువంశ కీర్తన" మనెడి సృష్టి కథన మంతయు స్వాయంభువ మనువు కాలములోనిది. స్వాయంభువుడు మొదటి మనువు. నూటతొంబదియైదుకోట్ల సం॥రముల క్రిందటినుంచి 165 కోట్ల సం॥రముల క్రిందటివరకు ప్రజాసృద్ధిచేయుచు యీ సృష్టి లోని జీవకోటి సంతతిను పరిపాలించిన ప్రథమమనువు. అతనికి పిమ్మట అతనితో సహా ఆరుగురు మనువులు గతించియుండిరి. ఇప్పుడు మనము ఏడవ మనువైన "వైవస్వత మనువు" పరిపాలనలోనున్నాము. వైవ స్వతుని కాలములో పండ్రెండు కోట్ల పైచిలుకు సంవత్సరములు గడి చినవి. ఇంకను పదునెనిమిది కోట్ల పైచిలుకు సంవత్సరములు జరుగ వలసియున్నవి. ఆ పిమ్మట యెనిమిదవ మనువు "సావర్ణి" జీవకోటిని పరిపాలించును.

## ౨౦. జగచ్చక్రభ్రమణము స్వాభావికము ప్రమాణవచనములు

ఈ శ్వేతవరాహ కల్పంబునందు యిప్పటికి గడచిన, యిప్పుడు నడుచుచుండిన ముందు రాబోయెడి మనువుల చరిత్రములు పైన దెలుప బడినవి. పరమేశ్వరున కెద్దియు నసాధ్యంబులేదు.

"భగవంతుడైన హరివిరాడ్విగ్రహంబునందు భూత భవిష్య ద్వర్తమానంబైన విశ్వంబు విలోక్యమానంబగు" (భాగ 2-16).

"ఈ కల్పంబందుండు దేవాసురాదులు ప్రతిమన్వంతరం బందును నిట్లు నామరూపంబులచే నిర్దేశింపబడుదురు. (భాగ 3-345).

చ॥ "వినుము చతుర్యుగాంతమున వేదములన్నియు విప్లవంబులై
చనిన మహీతలంబునకు సప్తమునీంద్రులు నేగుదెంచి పెం
పున బహువేదశాస్త్రములు మున్నిటయట్ల ప్రతిష్ఠ చేసి రూ
ఢిని నొనరించుచుందురు దెబ్బదియొక్క మహాయుగంబునన్.

(వెన్నెలకంటి సూరనార్యుని విష్ణు పురాణం 4-55.

క॥ స్మృతులు ప్రతిష్ఠింతురు ప్రతికృతయుగముల మనువులవని
గీర్తులు వెలయున్.
క్షితి పాలింపుదు రమ్మనుసుతులు దివిజవరులు క్రతుభుజులం
బెంపెసగన్ (వి. పు. 4-56)

క॥ మనువులు మనుపుత్రులును, య్యనిమిషులును సప్తఋషులు
నమరాధిపులున్
వినుమా యామన్వంతర, మునధికారులు జగంబు బోషింపగన్

(వి. పు. 4-57)

కృతయుగంబున కపిలాదుల రూపములు దాల్చి లోకమునకు జ్ఞానమార్గంబుపదేశించియు, త్రేతాయుగంబున రాజవంశంబులయందు వతరించి దుష్టశిక్షణం బొనర్చియు, ద్వాపరంబున వేదవ్యాసత్వంబు నొంది వేదశాఖల ననేక విధంబులుగా విస్తరింప జేసియు, కలియుగం

బున కలికి రూపంబున వేదశాస్త్ర మార్గంబులు నశించకుండ కాపాడుచును భగవంతుడు ప్రవర్తించు చుండువాడు. (వి. పు. 4_60 ల॥ 63)

ప్రతి కల్పమందును ప్రథమ మన్వంతరములో యేర్పడిన దేవతలు అసురులు మొదలైన వర్గములన్నియు తిరిగి తిరిగి నాయామన్వంతరముల యందన్నిటయందును ప్రథమ మన్వంతరమందేర్పడిన నామరూపముల చేతనే ప్రకాశింపుచు వారి వారి నియమితకార్యముల నొనర్చుచుందురు. నామరూపములు వెనుకటి మన్వంతరములోవలెనే నిర్దేశింపబడినను ఆయా స్థానముల నాక్రమించి నాయా నామరూపము లు బొందుచున్న జీవులుమాత్రము వేరువేరుగానుందురు. కొన్ని చోట్ల వెనుకటి జీవులే తిరిగినా స్థానము నాక్రమించుటయు గల్గుచుండును. ప్రతి మహాయుగాంతముయొక్క కలియుగాంతమున వేదములు నశించి మతవిప్లవములు కలుగుచుండగా ప్రతికృతయుగ ప్రారంభమందును సప్తమహా ఋషులు భూమియందవతరించి తిరిగి వేదములను ప్రజలలోవ్యాపింపజేసి సనాతనధర్మమును ప్రతిష్ఠించి చాతుర్వర్ణ్యముల చక్కబరచి వేదధర్మముల నాచరించునటుల నొనర్చుచుందురు. ఈ ప్రకారము ప్రతిమన్వంతరమందునను గడచుచున్న డెబ్బదియొక్క మహాయుగాంతములయందును జరుగుచుండును. ప్రతియుగమందును తిరిగినాయాస్మృతులే మనువులచే ప్రతిష్ఠింపబడుచుండును. మనుసుతులు రాజులై చాతుర్వర్ణ్య ధర్మముల పరిపాలించి ప్రజలవలంబించి తరించునట్లు శాసించుచుందురు. ఈ ప్రకారము మనువులు, ప్రజా పతులు, మనుపుత్రులు, సప్తఋషులు, దేవతలు అధికారులై మన్వంతర పరిపాలనము జరుపుచుందురు. పైన చెప్పబడినవన్నియు అధికార స్థానములు. ఎక్కువ పుణ్యము నార్జించి తపోయోగానుష్ఠానములుగలిగి మహామహిమా సంపన్నులైన జీవులా యాపదవు లాక్రమించుచుందురు. సృష్టి కర్తయైన బ్రహ్మకూడా యొక పుణ్యజీవియని తెలియవలెను. తపోయోగాదులచే ప్రతి జీవుడును జన్మాంతరముల, పై ఆధికారిక స్థానమును బొంద నర్హుడగును.

# ౨౧. గతించిన 28 గురు వ్యాసులు

వైవస్వత మన్వంతరమున గతించిన యిరువది యెనిమిది మహా యుగములలోని యిరువదెనిమిది ద్వాపరాంతములయందు వేద విభాగము నొనర్చి, కలియుగ జీవుల నిమిత్తం ఇతిహాస పురాణంబులను వ్రాసి ప్రచారమొనర్చిన "వ్యాసపీఠము" నధిష్టించిన పుణ్యజీవుల జాబితా నీదిగువ నీయబడినది.

ప్రథమ మహాయుగ ద్వాపరాంతమున వచ్చిన వ్యాసుడు. ౧. బ్రహ్మ. పిమ్మట క్రమముగా ౨. స్వాయంభువ ప్రజాపతి ౩. ఉశన లేక శుక్రుడు. 4. బృహస్పతి 5 సూర్యుడు 6 మృత్యువు 7. దేవేంద్రుడు 8. వసిష్ఠుడు. 9 సారస్వతుడు. 10 త్రిధాముడు 11. త్రివృషుడు (వృషభుడు). 12. భారద్వాజుడు. 13. అంతరిక్షుడు. 14 ధర్ముడు 15 త్రయారుణి. 16. ధనంజయుడు. 17. కృతంజయుడు. (మేధాతిథి) 18. సంజయుడు. 19. అత్రి 20 గౌతముడు. 21. హర్యాత్ముడు. 22. వేనుడు (వాజశ్రవుడు) 23. సోముడు. 24. తృణబిందుడు. 25. భార్గవుడు. 26 శక్తి. 27 జాతుకర్ణుడు. 28. కృష్ణద్వైపాయనుడు.

పై వారలు వేదవ్యాస రూపంబులు ధరియించి వేద, వేదాంగ, ధర్మశాస్త్ర, పురాణా, గమంబులు మొదలుగా బదునెనిమిది విద్యలు జగంబులం బ్రసిద్ధంబు జేసిరి. వేదశాస్త్రాదు లనాదినుండి యున్నవి గాని అవెవరిచేతను కనుగొనబడినవి కావు ఎప్పటి కప్పుడు తిరిగి అవియే ప్రచారములోనికి తేబడుచుండును.

# రాబోవు 29వ వ్యాసుడు

ద్రోణపుత్రుండైన "అశ్వత్థామ" ముందరి ద్వాపరంబున (అనగా 29వ ద్వాపరం) వేద వ్యాసుండు కాగలవాడు. ఇవ్విధంబున నానా మన్వంతరములయందు గల నానా ద్వాపరంబుల నొక్కొక్క మహాత్ముండు వైష్ణవాంశంబున వేదవ్యాసుండై వేదంబుల నుద్ధరించు -

(శ్రీ ములుగు పాప యారాధ్య ప్రణీత.

ఆంధ్ర దేవీ భాగవతం ౧. ౧౨౮)

(ఆంధ్ర విష్ణు పురాణం 4-68)

## ౨౨. కొందరు చారిత్రక పురుషుల కాలగణనము

మాకు దొరికిన చారిత్రక సంబంధమైన పురుషుల కాలగణనములను పాఠకులకు దెలియునిమిత్తం దిగువ నుదహరించుచున్నాము.

(ఈ అంకెలు బెజవాడ కాపురస్తులు శ్రీ పర్వతం లక్ష్మీనారాయణ జ్యోషిగారి తండ్రిగారైన శ్రీ పర్వతం నృశింహదీక్షితులుగారిచే వ్రాయబడిన "సూర్యసిద్ధాంతం" వ్రాతప్రతి చివరను వ్రాయబడి యున్నది. వారు వ్రాసిన అంకెలకు యిటీవల జరిగిన కాలమును కలిపి కలిశకము 5044 (క్రీ. శ॥ 1944) వరకు లెఖ చూపబడినది.

వైవస్వత మన్వంతరములో రాబడిన పురుషుల నామములు

| అవతారములు : | సౌరమానము ప్రకారం జరిగిన మానవాబ్దములు |
|---|---|
| 1. మత్స్యావతారగతాబ్దాః | 12,49,02,461 |
| 2. కూర్మావతార గతాబ్దాః | 12,07,00,463 |
| 3. ఆదివరాహావతార గతాబ్దాః | 10,58,08,866 |
| 4. శ్రీ నృశింహావతార గతాబ్దాః | 8,64,59,123 |
| 5. శ్రీ వామనావతార గతాబ్దాః | 4,40,45,044 |
| 6. శ్రీ పరశురామావతార గతాబ్దాః | 1,46,01,046 |
| 7. శ్రీ రామావతార గతాబ్దాః | 1,46,16,000 |
| 8 శ్రీ బలరామ, శ్రీకృష్ణావతార గతాబ్దాః | 5,044 |
| 9. త్రిపుర సంహారణార్థంరాబడిన బౌద్ధావతారగతాబ్దాః(గౌతమబుద్ధుడుకాదు) | 46,31,058 |
| 10 రాబోవు కలికావతారము కుదరుగవలసిన కాలము | 4,26,956 |

శ్రీరామావతార గతాబ్దములు 1,25,36,378 అని కొన్నిచోట్ల గలదు. పొరపాటుపడి యుండవచ్చును. దీనినే పంచాంగములలో చూపుచున్నారు. ఇది విచారణీయము.

## చక్రవర్తులు గతించిన కాలములు :

| | |
|---|---|
| 1. హరిశ్చంద్ర చక్రవర్తి గతాబ్దాః | 11,98,24,226 |
| 2. నలచక్రవర్తి గతాబ్దాః | 10,36,17 033 |
| 3 పురుకుత్స చక్రవర్తి గతాబ్దాః | 9,36,17,033 |
| 4 పురూరవశ్చక్రవర్తి గతాబ్దాః | 8,16,12,005 |
| 5. సగర చక్రవర్తి గతాబ్దాః | 5,10,28,452 |
| 6. శిబిచక్రవర్తి గతాబ్దాః | 4,14,80 308 |

## గతించిన రాజుల కాలములు ;—

| | |
|---|---|
| 1. కార్తవీర్యార్జున గతాబ్దాః | 1,25,47,147 |
| 2. అంబరీష గతాబ్దాః | 4,08,31,038 |
| 3. గయరాజగతాబ్దాః | 3,99,20,448 |
| 4. పృథురాజ గతాబ్దాః | 3,22,08,874 |
| 5. యయాతిగతాబ్దాః | 3,10,31,034 |
| 6. మాంధాత గతాబ్దాః | 2,34 40,171 |
| 7. శశిబిందు గతాబ్దాః | 2,70,28 801 |
| 8. భగీరథ గతాబ్దాః | 2,15,05,931 |
| 9. దిలీప గతాబ్దాః | 1,46,08,971 |
| 10. భరతరాజ గతాబ్దాః (దుష్యంతుడు + శకుంతలకు కలిగిన కుమారుడు) | 1,56,04,037 |
| 11. రావణ గతాబ్దాః | 1,46,27,036 |
| 12. రంతిదేవ గతాబ్దాః | 1,20,37 308 |
| 13. నహుషాబ్దాః | 1,12,25,494 |
| 14. ఇంద్రద్యుమ్న గతాబ్దాః | 49,888 |

ఆర్య విజ్ఞానాంతర్గత "బ్రహ్మాండసృష్టి విజ్ఞాన" మనెడి ప్రథమ భాగము సంపూర్ణము.

ఓం తత్సత్ !

# ఈ గ్రంధముద్రణకు సహాయపడిన
# సత్పురుషులు

1. ఒకేసారి నూరు రూపాయిలుగాని అంతకు హెచ్చుగాగాని
యిచ్చినవారు—మహారాజపోషకులు
2. ,, యేబదినుండి ... నూరువరకు ,, రాజపోషకులు
3. ,, యిరువదిఅయిదు ... యేబదివరకు ,, పోషకులు
4. ,, పది ... యిరువదియైదువరకు ,, చందాదార్లు

## మహారాజ పోషకులు

యిచ్చిన మొత్తం

1 మ॥రా॥శ్రీ వల్లభనేని వెంకటకృష్ణయ్యగారు
గండిగుంట—ఉయ్యూరు శివారు 232-0-0
2 ,, ఉద్దగిరి కృష్ణారావుగారు వేములదీవి
నరసాపురం తాలూకా 100-0-0
3 ,, జయంతి సత్యనారాయణమూర్తిగారు,
సెక్షను కంట్రోలరు నైజాం స్టేటురైల్వే
సికింద్రాబాదు 100-0-0

## పోషకులు

4 ,, శ్రీ భ్రమరాంబా చెన్నమల్లేశ్వరస్వామివారి
ట్రస్టీ కాశీవాఝుని సుబ్రహ్మణ్యంగారు
ఎలమర్రు 25-0-0
5 ,, చంద్రా అండ్ కో గాంధినగరం బెజవాడ 25-0-0

## చందాదార్లు

## విజయవాడ

1 మ॥రా॥శ్రీ అన్నవరపు వెంకటేశ్వర్రావుగారు 10-0-0
2 ,, మద్దాలి వెంకటసుబ్బయ్యగారు 10-0-0
3 ,, లకావర్ఝుల సుబ్రహ్మణ్యశాస్త్రి 10-0-0

| | | | |
|---|---|---|---|
| 4 | శ్రీమతి | కాంచనపల్లి కనకాంబగారు | 10-0-0 |
| 5 | మ॥రా॥శ్రీ | శిష్టా వెంకటకృష్ణయ్యగారు ప్లీడరు | 10-0-0 |
| 6 | ,, | నంద్యాల రంగనాథాచార్యులుగారు రిటైర్డు డిప్యూటీకలెక్టరు | 10-0-0 |
| 7 | ,, | కొతారు రామారావు పంతులుగారు | 10-0-0 |
| 8 | ,, | బూరుగుల సత్యనారాయణశాస్త్రిగారు | 10-0-0 |
| 9 | ,, | పెమ్మరాజు సత్యనారాయణగారు | 10-0-0 |
| 10 | ,, | రెంటచింతల కృష్ణమూర్తిగారు | 10-0-0 |
| 11 | ,, | ఘడియారం హనుమంతరావుగారు | 10-0-0 |
| 12 | ,, | ఖండవల్లి శీతారామాచారిగారు | 10-0-0 |
| 13 | ,, | నాథావఝ్ఝల సత్యనారాయణగారు | 10-0-0 |
| 14 | ,, | అక్కిపెద్ది గోపాలశాస్త్రిగారు | 10-0-0 |

## బందరు

| | | | |
|---|---|---|---|
| 15 | మ॥రా॥శ్రీ | మోటమర్రి లక్ష్మినారాయణగారు | 10-0-0 |
| 16 | ,, | మద్దూరి శేషాచలం పంతులుగారు | 10-0-0 |
| 17 | ,, | రాళ్ళభండి వెంకటశీతారామశాస్త్రిగారు అడ్వొకేటు | 10-0-0 |
| 18 | ,, | చిట్టా బాలకృష్ణశాస్త్రిగారు | 10-0-0 |
| 19 | ,, | C. V. Achary B. A. B. L. ఈడేపల్లి | 10-0-0 |
| 20 | ,, | కొర్రపాటి రాజేశ్వరావుగారు నడకుదురు | 10-0-0 |
| 21 | ,, | అన్నావఝ్ఝల సత్యనారాయణగారు అవురువూడి | 10-0-0 |
| 22 | ,, | శివలంక లింగయ్యఅయ్యవారు | 10-0-0 |
| 23 | ,, | గాయత్రి అనంతరామయ్యగారు పుయ్యూరు | 10-0-0 |
| 24 | ,, | కాశీనాథుని వీరేశలింగంఅయ్యవారు | 10-0-0 |

# యలకుర్రు గ్రామం

25 మ॥రా॥శ్రీ ఇవటూరి సానందరావుగారు 10_0_0
26 ,, మల్లంపల్లి కుమారబ్రహ్మానందంగారు 10_0_0
27 ,, బొమ్మకంటి సుబ్రహ్మణ్యంపంతులుగారు
కాటేనిపాడు 10_0_0
28 ,, కాశీనాధుని సాంబశివరావుగారు 10-0_0
29 ,, సూరానేని జగన్నాధరావుగారు
మొఖాసాదారు కాటేనిపాడు 20_0_0
30 ,, కాశీనాధుని వీరమల్లయ్య అయ్యవార్లుగారు 10_0_0
31 ,, కాశీనాధుని విజయరామలింగంఅయ్యవారు 10_0_0
32 ,, సింగరాజు త్రిపురాంతకంగారు 10_0_0
33 ,, కాశీనాధుని బుచ్చయ్యగారు 10_0_0

# నిడుమోలు

34 ,, డాక్టరు పిల్లుట్ల లక్ష్మినారాయణగారు 10_0_0
35 ,, మాదిరాజు వెంకటేశ్వరరావుగారు 10_0_0
36 ,, మాచిరాజు వెంకటేశ్వర్లుగారు 10_0_0
37 ,, మాచిరాజు శీతారామయ్యగారు 10_0_0
38 ,, కట్లమూడి మన్మధరావుగారు 10_0_0
39 ,, కూనపులి వెంకట్రామయ్యగారు నెమ్మలూరు 20_0_0
40 ,, మల్లాది బుచ్చంభొట్లుగారు ,, 10_0_0
41 ,, చుండూరి సూర్యనారాయణమూర్తిగారు
హైద్రాబాదు 10_0_0
42 ,, మూర్తి ఉదయభాస్కరమూర్తిగారు 10_0_0
43 ,, పండా వెంకటరాజగోపాలకృష్ణ చౌదరిగారు
దొడ్డవరంవంగోలు 10_0_0

# శుద్ధపత్రము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౪ | ౨౫ | చాతుర్వర్ణ | చాతుర్వర్ణ్య |
| ౧౩ | ౪ | చక్రకారముగా | చక్రాకారముగా |
| ౧౮ | ౧౯ | బ్రహ్మణాసవా | బ్రహ్మణాసహా |
| ౨౦ | ౭ | అర్యులు | ఆర్యులు |
| ౪౪ | ౨౦ | భావతో | భావముతో |
| ౫౮ | ౧౨ | సముదము | సముద్రము |
| ౬౨ | ౨౩ | పూర్వ | పూర్ధ్వ |
| ౬౮ | ౫ | తెమూరియా | లెమూరియా |
| ౭౦ | ౮ | తెమూరియా | లెమూరియా |
| ౭౫ | ౨౪ | చుట్టు | చుట్టి |
| ౮౧ | ౮ | నిర్ధేశము | నిర్దేశము |
| ౮౭ | ౧౫ | సింధునదికి | సోమమునకు |
| ౯౧ | ౨౯ | "ఉక్ స్వస్తికద" | "ఉవక్ స్వస్తిక" |
| ౯౨ | ౧౧ | భ్రుమిహా | భ్రువౌ |
| ౯౫ | ౧౬ | పాతళముగా | పాతాళముగా |
| ,, | ౨౮ | స్వార్గె ప్రతిష్టితాః | స్వార్ధె ప్రతిష్ఠితాః |
| ౧౦౧ | ౨౬ | mumber | number |
| ౧౦౯ | ౯ | బింబాకృతమై | బింబావృతమై |
| ౧౧౪ | ౧౪ | సాంప్రాదాయ | సాంప్రదాయ |
| ౧౨౧ | ౨ | తారుసుడు | తామసుడు |
| ౧౩౧ | ౫ | వైశ్యాః | వైశ్యాః |
| ౧౩౨ | ౨ | క్షత్రియ | క్షత్రియ |
| ౧౩౪ | ౧౬ | అవస్యతే | అవస్యవే |
| ౧౩౭ | ౨౦ | చున్నది | చున్నవి |
| ౧౪౭ | ౨౨ | దేపు | దేవు |
| ౧౫౪ | ౧౩ | కలిఘరి | కలిగిరి |